# ప్రపంచ చరిత్ర

(ఏడవ భాగము)

రచన:

జవహర్‌లాల్ నెహ్రూ

అనువాదం:

చింతా దీక్షితులు

సంస్కృతి ప్రచురణ

(55)

వెల రెండు రూపాయలు



## ర చ యి త

జననం 1889. కాశ్మీర దేశస్థులు. తండ్రి ప్రఖ్యాత న్యాయవాది మోతీలాల్ నెహ్రూ. తల్లి స్వరూపరాణి. జన్మస్థానం ప్రయాగ-అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కళాశాలలో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యుడుగానున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహ వాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణజన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను 1936, 37, 46 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. 1950 నుంచి 1954 వరకు కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్నారు. వివాహితులు. భార్య కమలా నెహ్రూ చనిపోయింది. కొడుకులు లేరు. ఒక్కతే కుమార్తె-ఇందిరా గాంధి. చెల్లెండ్రిద్దరు-విజయలక్ష్మి పండిట్, కృష్ణ హాతీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను రచించారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా', 'ప్రపంచ పరిణామము'లను మాప్రచురణలలో ప్రచురించియున్నాము. నేడు (1956) ఇండియా ప్రధానిగా నున్నారు.

నివాసము : 17, యార్క్ రోడ్డు, న్యూ ఢిల్లీ.

# విషయసూచిక

లేఖ. పు

# పటములు

# జారుల (Tsars) నాటి రష్యా

మార్చి 16, 1933

నేడు రష్యా ఒకసోవియట్ దేశము. కర్షకులయొక్కయు, కార్మికులయొక్కయు ప్రతినిధులు దాని ప్రభుత్వమును సాగించుచుండిరి. కొన్నివిధములుగా అది ప్రపంచమంతటిలోను మిక్కిలివృద్ధిజెందిన దేశము. వాస్తవపరిస్థితులెట్లున్నను, దాని ప్రభుత్వరచనయు, సంఘరచనయు, సాంఘికసమత్వమను సిద్ధాంతముపై ఆధారపడియున్నవి. ఇది ఇప్పటిపరిస్థితి. కాని కొన్నిసంవత్సరములకుపూర్వము, 19 శతాబ్ది అంతటను, అంతకుముందును, యూరోపుదేశమంతటిలోను రష్యా మిగులవెనుకబడ్డదేశము. అభివృద్ధిని ప్రతిఘటించు దేశముగానుండెను. వికరమగు నిరంకుశత్వము, అధికారతత్వము అచ్చట తాండవమాడుచుండెను. పడమటియూరోపులో విప్లవములుచెలరేగినను, మార్పులు వచ్చినను, దైవదత్తాధికారసిద్ధాంతమును, జారులింకను శిరసావహించుచునేయుండిరి. అచ్చటి చర్చి పూర్వాచారబద్ధమగు ప్రాచీనగ్రీకుచర్చి. రోమన్‌చర్చికాదు. ప్రాటస్టంటుచర్చికాదు. ఈచర్చిపైతము ఇతర ప్రదేశములందుకంటె నిచ్చట అధికముగా అధికారతత్వమును ప్రదర్శించుచుండెను. జారుల పరిపాలనము నది సమర్థించుచుండెను. దాని చెప్పుచేతలలోనుండెను. ఆదేశమునకు "పవిత్ర రష్యా" అనిపేరు. జారుచక్రవర్తి అన్ననో అందరికిని అతడు *"తెల్లనిచిట్టితండ్రి." ప్రజలను మభ్యపరచుటకును, రాజకీయ ఆర్థికపరిస్థితులపైకి వారిబుద్ధి పోకుండచేయుటకును చర్చియు, అధికారులును ఇట్టిగాథ లల్లుచుండిరి. చరిత్రమార్గములలో పవిత్రత వింతసహవాసములచేసియుండెను!

---

* Little White Father.

ఈ "పవిత్రరష్యా"కు ప్రత్యేకచిహ్నము "నూట్." అది తరచు చేయుపని "పొగ్రోమ్స్." ప్రపంచమున కా దేశ మీరెండు మాటలను బహూకరించెను. జానిసలను, ఇతరులను శిక్షించుటకై వాడుకొరడాకు "నూట్" అని పేరు. "పొగ్రోమ్స్" అనుమాటకు విధ్వంసము చేయుట, పీడించుట అని అర్థము. క్రియకువచ్చుసరికి జనసంహారము చేయుట, అనగా ముఖ్యముగా 'జ్యూ'లనువధించుట అని అర్థమువచ్చినది. జారులరష్యాకు వెనుకవిశాలము, నిర్జనము, అగు సైబీరియా స్టెప్పి మైదానములుకలవు. స్టెప్పీలపేరు చెప్పినప్పుడు, దేశబహిష్కరణము, చెర, నిరాశ జ్ఞప్తికివచ్చును. రాజకీయశిక్షితులనేకులు సైబీరియాకు పంపబడుచుండిరి. బహిష్కృతులకై పెద్దశిబిరములు అచ్చటలేచినవి, వలసలుపెరిగినవి. వాటి సమీపమునందే ఆత్మహత్యచేసికొన్నవారి గోరీలున్నవి. చిరకాలముపాటు ఒంటరిగా దేశబహిష్కారశిక్షను, చెరను అనుభవించుట దుర్భరముగానుండును. సాహసపురుషుల మనస్సులు సైతము నిరాశాపూరితములయ్యెను. వారిదేహము లీ భారమును భరించలేక శిథిలములయ్యెను. ప్రపంచముతో తెగతెంపులై ఒంటరిగా, బంధువులకు మిత్రులకు కాకుండ, తన కష్టసుఖములపంచుకొని తనభారమునుతగ్గించువారి నెడబాసి జీవించుటకు మనోదార్ఢ్యముండవలెను. ధైర్యముండవలెను. స్థైర్యముండవలెను. నిశ్చలమనస్సుండవలెను.

ఇట్లు జారులరష్యా ఎత్తినతలలన్నింటిని చిదుకబొడిచెను. స్వాతంత్ర్యము సాధించుటకు చేసినప్రతియత్నమును అణచివేసెను. ప్రయాణము కష్టతరము చేయబడెను. దూరదేశములనుండి ఉదారభావములు రాకుండవలెనని ఇట్లుచేసిరి. స్వాతంత్ర్యము నణచిపెట్టినచో నది నానాటికి పెంపొందును. అది ముందుకు కదిలినదా దుముకుచుపోవును. ప్రాతపద్ధతులు తత్కారణమున విచ్ఛిన్నమగును.

ఆసియాలోని అనేక దేశములపట్లను, యూరోపుపట్లను —

(దూరప్రాచ్యమున, మధ్య ఆసియాలో, పర్షియాలో, టర్కీలో) — జారుల రష్యా అవలంబించిన రాజకీయసూత్రములను, దానిచర్యలను, వెనుకటి జాబులలో కొంతవరకు చూచియుంటిమి. ఇప్పుడు సమగ్రముగాకొంత తెలిసికొందము. ప్రధానకథాభాగముతో వేర్వేరుచర్యలను పొత్తుకలిపి చూతము. భూగోళమున రష్యాదేశము ఉనికి యెట్టిదనగా దానికెల్లప్పుడు రెండుముఖము లుండును. ఒకటి పశ్చిమమును చూచును; ఒకటి తూర్పును చూచును. దానియునికినిబట్టి అది యూరేసియన్ రాజ్యము. దాని తరువాతగాధ ఒకమారు పాశ్చాత్యదేశోన్ముఖమగుట, ఒకమారు ప్రాచ్యదేశోన్ముఖమగుట. పశ్చిమమున ఓడింపబడిన అది తూర్పుకు చూచెను; తూర్పున అటకాయింపబడిన మరలనది పశ్చిమమునకు చూచెను.

చెంగిజ్ ఖాన్ వారసత్వమగు ప్రాచీన మంగోల్ సామ్రాజ్యములు విచ్ఛిత్తిచెందిన విషయమును, మాస్కో రాకుమారుని నాయకత్వమున రష్యా రాకుమారులు రష్యానుండి గోల్డెన్ హోర్డ్ మంగోలులను చివరకు తరిమివేసె నన్నవిషయమును ఇదివరలో చెప్పియుంటిమి. 14-వ శతాబ్దాంతమున నిది జరిగెను. కాలక్రమమున మాస్కో రాకుమారులు దేశమంతటికిని నిరంకుశాధి కారులై "జారులను" నామధేయమును ధరించిరి. వారి ఆచారవ్యవహారములు, వారిదృక్పథము చాలవరకు, మంగోలు సంప్రదాయముగానే ఉండెను. వారికిని, రష్యాను అనాగరిక దేశమను పశ్చిమయూరోపునకును సమానధర్మము లేమియు లేకుండెను. 1689 లో జారుపీటర్ సింహాసన మధిష్ఠించెను. అతనినే "మహాపీటర్" అందురు. రష్యాను పశ్చిమోన్ముఖము చేయించవలెనని అతడు నిశ్చయించెను. అచ్చటి పరిస్థితులు అవగాహనచేసి కొనుటకై అతడు పశ్చిమదేశసంచారము చాలకాలము చేసెను, చూచినవిషయము లనేక మతడనుకరించదలచెను. ఇష్టములేని, చదువురాని, కులీనులపై అతని యభిప్రాయములను విధించెను. ప్రజాసామాన్యము వెనుకబడి యుండిరి.

అణగద్రొక్కబడియుండిరి. కావున ఈ సంస్కరణముల పట్ల వారి అభిప్రాయము పీటర్ తెలిసికొనవలసిన అవసరమేలేదు. ఆ నాటి గొప్ప జాతులు సముద్రముమీద అధికారముకలిగి బలాఢ్యులై యున్నసంగతి పీటర్ చూచెను. సముద్రాధికారము యొక్క ప్రాముఖ్యము నతడు గ్రహించెను. కాని, రష్యాపెద్దదేశమైనప్పటికిని దానికి సముద్రముచేరుటకు మార్గములేదు. ఆర్కిటిక్ మహాసముద్రమున్నది. కాని దానివల్ల ప్రయోజనములేదు. కాన నతడు వాయువ్యముగా బాల్టిక్‌వరకును, దక్షిణముగా క్రిమియావరకును చొచ్చుకుపోయెను. అతడు క్రిమియా చేరలేదు (అతని తరువాతివారు చేరిరి). స్వీడన్‌ను ఓడించి అతడు బాల్టిక్‌మాత్రము చేరెను. అతడొక నూతననగరమును పాశ్చాత్యపద్ధతుల మీద స్థాపించెను. దానికి సెంటుపీటర్సుబర్గు అనిపేరు. అది నీవా నదిపై నున్నది. ఫిన్‌లాండు సింధుశాఖకు దూరముగా, బాల్టిక్‌సముద్రమునకు పోవుదారిలోనున్నది. ఈ నగరము నతడు తనరాజధానిగా చేసికొనెను. మాస్కోను పట్టుకొన్న ప్రాచీనసంప్రదాయములకు భిన్నముగా నతడు పో ప్రయత్నించెను. 1725 లో పీటర్ కాలధర్మమునందెను.

మరి 50 సంవత్సరములపైబడిన తరువాత వేరొక రష్యన్ చక్రవర్తిని తనదేశమును పాశ్చాత్యసంప్రదాయముల కనుగుణముగా మార్చ ప్రయత్నించెను. ఈమె కేతరిన్ II అను పేరుగల స్త్రీ, ఈమెనుకూడ "మహా చక్రవర్తిని" యందురు. ఆమె అసాధారణస్త్రీ: బలాఢ్యురాలు: క్రూరస్వభావము కలది. సమర్థురాలు, ఆమె దుష్టశీలయను చెడ్డపేరు సంపాదించెను. తనభర్త జార్‌ను హత్యచేయించి, రష్యాలన్నింటికీ తానే నిరంకుశాధికారముపహించి, 14 సంవత్సరముల కాల మామె రాజ్యమేలెను. గొప్పవిద్యాపోషకురాలివలె ఆమె నటించెను. వాల్టెర్‌తో ఆమె ఉత్తరప్రత్యుత్తరముల జరిపెను. ఆయన స్నేహము పొంద యత్నించెను. వార్సైలోని ఫ్రెంచికోర్టు సంప్రదాయములను కొంతవరకు ఆమె అనుకరించెను. విద్యా సంస్కరణములను కొన్నింటిని చేసెను

ఇదంతయు పై తరగతుల వారి కొరకే. ఇదంతయు బాహ్యప్రదర్శనము కొరకే. ఒక్కమారు సంస్కృతిని అనుకరించుటకు సాధ్యపడదు. అది వేళ్లు తన్నవలెను. అభివృద్ధి గన్నదేశముల ననుకరించు వెనుకబడ్డ దేశము, నిజమగు సంస్కృతిని గమనించలేక అందలి వెండి బంగారము లను డాకు రేకుగా మార్చును. పశ్చిమ యూరోపు సంస్కృతి కొన్ని సాంఘిక పరిస్థితులపై ఆధారపడియుండెను. ఇట్టి పరిస్థితులను కల్పించ కుండ పీటర్, కేతరిన్‌లు పైకట్టడమును (బాహ్యరూపము) మాత్ర మనుకరించ ప్రయత్నించిరి. పర్యవసాన మేమనగా ఈ మార్పుల భారము ప్రజాసామాన్యముపై బడెను. కమతగాండ్ర స్థితి దుర్భర మయ్యెను. జార్ల నిరంకుశత్వము ప్రబలమయ్యెను.

ఇట్లు జారుల రష్యాలో కాసంత పురోగతితోపాటు కొండంత పశ్చాత్‌గతి జరిగెను. రష్యాలోని రైతులు క్రియకు బానిసలే. వారు తమ భూములను కనిపెట్టుకొనియుండవలెను. ప్రత్యేకముగా అనుమతిపొంది గాని వానిని విడువరాదు. భూకామందులతెగకు చెందిన కొందరుఉద్యో గస్తులకు, బుద్ధిమంతులకు మాత్రమే విద్యాబోధ పరిమితముగా చేయు చుండిరి. మధ్యతరగతిప్రజలు లేరనియే చెప్పవచ్చును. ప్రజాసామా న్యము వెనుకబడియుండిరి. వారికి చదువురాదు. వెనుకటికాలములో రక్తపాతముతోకూడిన కర్షకులతిరుగుబాట్లు అనేకము సంభవించెను. హింసభరించలేక చేసిన అనాలోచితమగు తిరుగుబాట్లు. అవి అణచివేయ బడెను. పైతరగతులవారికి కొద్దివిద్య లభించినది. కాబట్టి పశ్చిమ యూరోపులోని తత్వాలభావములు కొన్ని క్రమేణ వారిద్వారా రష్యాలో ప్రవేశించెను. అవి ఫ్రెంచివిప్లవదినములు. తరువాతవచ్చిన నెపోలి యనునాటిదినములు, నీకు జ్ఞాపకమున్నదా? నెపోలియనుపతనానంత రము యూరోపువందంతటను పశ్చాద్గతి కలిగెను. ఇట్టి పశ్చాద్గతికి నాయకుడు జారైన అలెగ్జాండరు I; ఇతడు చక్రవర్తులతో "పవిత్ర మిత్రత్వము" సాధించి వారిని కూడగట్టుకొనెను. అతని తరువాత

వచ్చినవాడు అతనికన్న దుష్టుడు. కార్యచోదితులై ఉద్యోగస్థులు విజ్ఞానవంతులు నగు కొందరుయువకులు 1825 లో విప్లవమును లేవనెత్తిరి. వీరందరు భూమికామందుల తరగతికి చెందినవారు. ప్రజాసామాన్యము యొక్కగాని, సైన్యముయొక్కగాని సహాయము వారికిలేదు. వారణచి వేయబడిరి. వారిని "డిశంబరైటు" లందురు. వారు డిశంబరు 1825 లో తిరుగుబాటులేవనెత్తుటచే వారికాపేరు వచ్చినది: రష్యాలో రాజకీయ ప్రబోధము కలిగినదని చూపు ప్రధమబాహ్యచిహ్నమే ఈతిరుగుబాటు. తిరుగుబాటుకుముందు రహస్యరాజకీయసంఘములు తలయెత్తెను. జారుల ప్రభుత్వము ఎట్టిరాజకీయకార్యకలాపమును జరుపకూడదని నిషేధించుట ఇందుకు కారణము. ఈ రహస్యసంఘములు సాగిపోవుచుండెను. విప్లవభావములు వ్యాపించుచుండెను. ముఖ్యముగా విజ్ఞానవంతులలోను, విశ్వవిద్యాలయ విద్యార్థులలోను ప్రాకిపోవుచుండెను.

క్రిమియన్ సంగ్రామములో రష్యా ఓడిపోయినపిమ్మట కొన్ని సంస్కరణములు ప్రవేశపెట్టబడెను. 1861 లో కమతగాండ్రపద్ధతి రద్దుచేయబడెను. కర్షకప్రపంచమున కిది గొప్పవిషయమే అయినను వారికి దీనివలన ఎక్కువసదుపాయము కలుగలేదు. విముక్తిచెందిన కమతగాండ్ర పోషణకు చాలినంతభూమి వారి కొసగలేదు. ఇది యిట్లుండ విజ్ఞానవంతులలో విప్లవభావములు వ్యాపించుటయు, జారుప్రభుత్వము వారిని పీడించుటయు ఏకకాలమున జరుగుచుండెను. విజ్ఞానాభివృద్ధిజెందిన బుద్ధిమంతులకును, కర్షకప్రపంచమునకును ఎట్టి సంబంధము లేకయుండెను. సమానాభిమానవిషయము లేమియులేకుండెను. కాన 1869—75 సంవత్సరములలో సోషలిస్టుసిద్ధాంతాభిమానులగు విద్యార్థులు (వారికి సుస్పష్టభావములులేవు, ఆదర్శప్రియులు) కర్షకలోకములోప్రచారముచేయ నిర్ణయించిరి. వేలకొలది విద్యార్థులు గ్రామములలోనికి వచ్చిపడిరి. కర్షకు లీ విద్యార్థుల నెరుగరు. వారిని నమ్మలేదు. కమతగాండ్రపద్ధతి పునఃప్రవేశపెట్టుటకు కుట్రపన్నవచ్చిరని

వారి ననుమానించిరి. కాన విద్యార్థులనేకులను, ప్రాణములకు తెగించి వచ్చినవారిని, కర్షకులు స్వయముగా పట్టుకొని జారుయొక్క పోలీసుల కప్పజెప్పిరి. ప్రజాసామాన్యముతో స్వయముగా సంబంధముపెట్టుకొన కుండ చేసిన అసాధ్యప్రయత్నముల కిది అసాధారణ నిదర్శనము.

కర్షకులపట్ల తాముచేసిన ప్రయత్నములు పూర్తిగా భగ్నమగు టచే విజ్ఞానవంతులగు విద్యార్థులు విభ్రాంతులైరి. అసహ్యాభావముతో, విరాళతో వారు "హింసాపద్ధతి" నవలంబించిరి; అనగా అధికారులపై బాంబులువేసిగాని, వేరొకవిధముగాగాని వారినిచంప ప్రయత్నించిరి. హింసాపద్ధతికిని, బాంబుప్రయోగమునకును రష్యాలో అదేప్రారంభము. దానితో విప్లవాత్మకకార్యకలాపము నూతనస్థాయి నందుకొనెను. బాంబులను విసరువారు తాము "బాంబుతోనున్న లిబరల్సు" అని పేరు పెట్టుకొనిరి. వారి హింసాత్మకసంస్థకు "ప్రజాసంకల్పము" అనిపేరు. ఇది బూటకపుపేరు. దీనితోసంబంధమున్న ప్రజలు కొద్దిమంది మాత్రమే.

ఈవిధముగా దృఢసంకల్పులగు యువతీయువకులకును, జారు ప్రభుత్వమునకును క్రొత్తపోరాటము ప్రారంభమాయెను. అనేకపీడిత జాతులప్రజలును, రష్యాలోనిజాతీయ అల్పసంఖ్యాకవర్గములును చేరుట చేత విప్లవపరులసంఖ్య పెరిగిపోయెను. ఈ జాతులవారును, ఈ అల్ప సంఖ్యాకవర్గములును ప్రభుత్వముచే దురాదరణ పాలగుచుండిరి, తమ సొంతభాషలను తాముబహిరంగముగా వాడరాదని నిషేధించిరి. ఇంకను అనేక ఇతరవిధములుగా వారిని పరాభవము పాలుచేయుచు హింసించు చుండిరి. పారిశ్రామికముగా రష్యాకంటెహెచ్చుగా అభివృద్ధిచెందిన పోలెండుదేశము రష్యాలో నొకరాష్ట్రముమాత్రమైనది. పోలెండు పేరు పైతము క్రియకు అంతరించినది. పోలిష్‌భాష నిషేధింపబడినది. పోలెండు ఇట్టిదురాదరణ పాలైనది. ఇతరజాతులును, అల్పసంఖ్యాక వర్గములును మరింత దురాదరణకు పాలైరి. 1859—1870 సంవత్స

రషులలో పోలెండులో తిరుగుబాటు జరిగెను. మిక్కిలిక్రూరముగా నది యణచివేయబడినది. 50,000 మందిపోలులు (పోలెండు ప్రజలు) సైబీరియాకు పంపబడిరి. జ్యూలు నిరంతరము "పొగ్రోమ్సు" పాలైరి. అనగా హత్యలపాలైరి. వారిలోపలువురు దేశాంతరముపట్టిరి. ఇట్టిజ్యూలును, ఇతరులును, తమజాతులను హింసించుచున్నజారులపై రోషోద్రిక్తులై, హింసామార్గావలంబులగు రష్యను విప్లవకారులతో చేరుట సహజమే. ఇట్టిహింసాపద్ధతికి 'నిహిలిజం' (తీవ్రవిప్లవవాదుల సిద్ధాంతము) అనిపేరు. నిహిలిజం వృద్ధినందెను. బహుక్రూరముగా, రక్తపాతముతో నది అణచివేయబడెను. రాజకీయశిక్షితులు బహు సంఖ్యాకులు సైబీరియాలోని స్టెప్పీలకు దేశాంతరవాసముచేయుటకు పోయిరి. పలువురు ఉరితీయబడిరి. ఇట్టిపరిస్థితి నెదుర్కొనుటకు జారు ప్రభుత్వ మొకపద్ధతి నవలంబించెను. ఆపద్ధతి సుతిమించి పనిచేసెను. జారుప్రభుత్వము *"ఏజెంట్సుప్రొవొకేటూర్సు"ను హింసావాదులలోను, విప్లవకారులలోను చేరపంపెను. బాంబులువిసిరి దౌర్జన్యముచేయ వారిని యీఏజెంటులు పురిగొల్పుటయేకాదు: ఒక్కొక్కప్పుడు తామే ఆ దౌర్జన్యములు ఇతరులపై పెట్టుటకై చేయుచుండెడివారు. ఇట్టి ఏజెంట్సు ప్రొవొకేటూర్సులో ప్రసిద్ధుడు అజెఫ్ అనువాడు. బాంబులువేయు విప్లవ కారులలో నొకప్రముఖుడు. అసలు అతడు రష్యన్‌రహస్యపోలీసుల నాయకుడు.

ఈ సంఘటలన్నియుజరుగుచుండగా రష్యన్ అధినివేశములు ** వ్యాపించుచునేయుండెను. నేనిదివరలో చెప్పినట్లు పసిఫిక్‌వరకు నవి పోయెను. మధ్య ఆసియాలో ఆఫ్ఘని స్థానము పొలిమేరలవరకు వచ్చెను. దక్షిణమున టర్కీ పొలిమేరలవరకు చొచ్చుకొనిపోవుచుండెను.

* "ఏజెంట్సు ప్రొవొకేటూర్సు," వీరు ప్రభుత్వోద్యోగులు. వీరు ప్రతిపక్షములోచేరి, వారిచే దౌర్జన్యకార్యములు చేయింతురు.

** Dominions.

1859 – 70 సంవత్సరములు మొదలుకొని సాగిపోయిన వేతొక ప్రధానకార్యము పాశ్చాత్యపరిశ్రమ తలయెత్తుట. ఇది కొద్ది ప్రదేశముల లోనే – పీటర్సు బర్గు ప్రాంతము, మాస్కో–వంటి ప్రదేశములలోనే– పొడచూపెను. దేశము మొత్తమంతయు పూర్తిగా వ్యావసాయకము గానే ఉండెను. కాని నిర్మించిన ఫ్యాక్టరీలు ఉత్తమశ్రేణికి చెందినవి. సామాన్యముగా నివి ఇంగ్లీషువారిచే నడుపబడుచుండెను. దీనినుండి వచ్చిన ఫలితములు రెండు. ఈ కొద్ది పారిశ్రామిక ప్రదేశములలో రష్యా పెట్టుబడిదారీ పద్ధతి వేగముగా వృద్ధినందెను. అంతవేగముగానే కార్మి కుల తరగతి వృద్ధియయ్యెను. బ్రిటిష్ ఫాక్టరీపద్ధతి తొలిరోజులలో జరిగినవిధముగానే రష్యన్ కార్మికులచే రాత్రింబవళ్లు పనిచేయించుచు స్వోపయోగమునకై వారినిట్లు ఉపయోగించుకొనుచుండిరి. కాని కొంత భేదమున్నది. నూతన భావము లిప్పుడుతలయెత్తినవి. అవి సామ్యవాద (Socialism) భావములు ; కమ్యూనిజం భావములు. రష్యన్ కార్మి కుని బుద్ధి నిర్మలముగా నుండుటచే పైభావముల గ్రహించుట కనువుగా నుండెను. బ్రిటిష్ కార్మికుడన్ననో, గతమునుండివచ్చుచున్న దీర్ఘ సంప్రదాయముచే బద్ధుడై ప్రాత భావములకే కట్టుబడియుండెను.

ఈ వినూత్న భావములు రూపొంద మొదలిడెను. "సోషల్ డిమో క్రటిక్ లేబర్‌పార్టీ" ఒకటి స్థాపించబడెను. మార్క్సు సిద్ధాంతములపై నిది యాధారపడియుండెను. మార్క్సు సిద్ధాంతావలంబులు హింసా పద్ధతి ననుసరించి చేయు దౌర్జన్యకార్యములకు వ్యతిరేకులమని ప్రకటించు కొనిరి. కారల్‌మార్క్సు సిద్ధాంతము ప్రకారము కార్మిక వర్గమును కార్యా చరణకు పురిగొల్పవలెను. అట్టి సమిష్టి కార్యాచరణమువల్లనే తమ అభీప్సి తమును పొందగల్గుదురు. హింసాపద్ధతి నవలంబించి వ్యక్తులను హత్య చేయుటద్వారా కార్మికవర్గమును కార్యాచరణకు పురిగొల్పుట సాధ్యము కాదు. వారి యభీప్సితము జారు తత్వమును తిరుగ ద్రోయుటయేగాని, జారునుగాని, అతని మంత్రులను గాని చంపుటకాదు.

1879–1890 సంవత్సరములలో నొకయువకుడు—ఇతడే తరువాత లెనిన్‌పేరుతో లోకప్రసిద్ధుడాయెను—విద్యార్థి దశయందున్నప్పుడే విప్లవకార్యములందు పాల్గొనెను. 1887 సంవత్సరమున, 17 ఏండ్ల వయస్సప్పుడు, అతనికి తీరని విపత్తు సంభవించెను. అతని అన్న అలెగ్జాండరు, లెనిన్‌కు మిక్కిలిప్రేమపాత్రుడు, జారుప్రాణములను తీయుటకు హింసావాదులు చేసిన ప్రయత్నమున పాల్గొనుటచే ఉరితీయబడెను. ఇట్టివిపత్తు సంభవించినను హింసాపద్ధతులవల్ల స్వాతంత్ర్యము చేకూరదని లెనిన్‌చెప్పెను. సమష్టికార్యాచరణమువల్లనే అది సాధ్యపడుననియు చెప్పెను. పట్టుదలతో, దృఢవిశ్వాసముతో లెనిన్ చదువు సాగించి తుదిబడి పరీక్షకు వెళ్లి గొప్పగా గెలుపొందెను. ముప్పై సంవత్సరముల తరువాత రానున్న విప్లమునకు నాయకుడు కానున్న లెనిన్ అట్టి దిట్ట!

కార్మికవర్గ విప్లవము రాగలదని మార్క్సు సూచించెను. గొప్ప కార్మికవర్గముగలట్టియు, కట్టుదిట్టముగా పనిచేయునట్టియు, పారిశ్రామికముగా నెంతోయభివృది గన్నట్టియు జర్మనీవంటిదేశములోనే, తత్కారణమున, కార్మిక విప్లవము ప్రారంభమగుననియు మార్క్సు తలచుచుండెడివాడు. ఇందుకు రష్యా ఎంతమాత్రము తగదని అతని యభిప్రాయము. కారణమది వెనుకబడ్డదేశము. మధ్యయుగసంప్రదాయములు గల దేశము కాన రష్యాలో యువకులు కొంద రతని సిద్ధాంతములపై విశ్వాసము కలవారని యతడు తెలిసికొనెను. తమదుర్భరస్థితి నంతమొందించుటకు మార్గముల నన్వేషించుచు వారు తీవ్రముగా నతని గ్రంథములు పఠించిరి. జారుల రష్యాలో బహిరంగముగ నేకార్యమును చేయరాదు కాబట్టియు, చట్టమున కనుగుణముగానైన వా రేపనియు చేయరాదు కాబట్టియు, వారీ గ్రంథ పఠనమునకు దిగిరి. తమలో తాము చర్చించు కొనుచుండిరి. వీరిలో ననేకులు కారాగారమునకు పంపబడిరి. పలువురు సైబీరియాకు గాని, దేశాంతరములకుగాని పంపబడిరి. వారెచ్చటికి వెళ్లినను మార్క్సు సిద్ధాంతములను పఠించుచునేయుండిరి. కార్యాచరణ చేయదగ్గ

తరుణమునకు సిద్ధపడుచునేయుండిరి.

---

# 144

# భగ్నమైన 1905 రష్యన్ విప్లవము

మార్చి 17, 1933

రష్యన్ మార్క్సుసిద్ధాంతావలంబులు, అనగా సోషల్ డెమోక్రటిక్ పార్టీవారు, 1903 లో ఒకసంకట పరిస్థితి నెదుర్కొనవలసివచ్చెను. ఒకప్రశ్న వారాలోచించి దానికి సమాధానము తేల్చుకోవలసియుండెను. కొన్ని నియమములమీదను, విస్పష్ట ఆదర్శములమీదను ఆధారపడి యున్న ప్రతిపార్టీవారును, ఎప్పుడో ఒకప్పుడు ఇట్టి ప్రశ్నకు సమాధానము తేల్చుకోవలసియుండును. యదార్థమునకు అట్టి నీతినియమములు, నమ్మకములు కలస్త్రీ పురుషులందరును, తమజీవితములో ననేకపర్యాయములు అట్టి సంకటపరిస్థితుల నెదుర్కొనవలసియుండును. ఆ ప్రశ్న ఏమనగా—వారు తమ నియమములకు పూర్తిగాబద్ధులై కార్మికవర్గవిప్లవమునకు తయారు అగుటా? లేదా, ఉన్ననియమములను కొద్దిగా సడలించుకొని చివరకు రానున్నవిప్లవమునకు పునాదివేయుటా? అన్నది. ఇట్టిప్రశ్న పశ్చిమ యూరోపియన్ దేశములందన్నింటనూ తలయెత్తెను. సర్వత్రా, కొంచెమెచ్చుతక్కువగా, సోషల్ డెమోక్రటిక్ పార్టీయు, అట్టి ఇతరపార్టీలును కొంతదుర్బలత్వముచూపెనవి, ఆంతరంగికకలహములు పుట్టినవి. జర్మనీలో, మార్క్సుసిద్ధాంతావలంబులు పూర్తిగా విప్లవభావములపైని అభిమానమువహించి అట్లు ప్రకటించిరి. కాని క్రియకువచ్చునరికి వారు తగ్గిరి. కొంతసాధుమార్గ మవలంబించిరి. ఫ్రాంసులో సామ్యవాదులగు నాయకులనేకులు తమపార్టీలను వదలిపెట్టి మంత్రివర్గములో మంత్రులుగా చేరిరి. బ్రిటన్‌లో మార్క్సుసిద్ధాంతము లంతగా ఎక్క

లేదు. కాన ఆప్రశ్నయే తలయెత్తలేదు. అక్కడ సైతము ఒక లేబర్ సభ్యుడు మంత్రివర్గములో మంత్రి అయ్యెను.

రష్యాలో పరిస్థితులు వేరుగా నుండెను. పార్లమెంటరీవిధానము ప్రకారము కార్యాచరణలోనికి దిగుట కందు సావకాశములేదు. అచ్చట పార్లమెంటులేదు. అట్లున్నప్పటికిని జారులతో "చట్టవిరుద్ధ"మగు పద్ధతుల నవలంబించి పోరాడుటను విరమించ సావకాశములున్నవి. కొంతకాలముపాటు శాంతముగా సిద్ధాంతప్రచారము చేయుటకును సావకాశములున్నవి. కాని లెనిన్‌కు ఈవిషయమై విస్పష్టమగు నిశ్చితాభిప్రాయములు కలవు. నియమములను సడలించుట కత డియ్యకొనడు. మధ్యేమార్గము నతడు సహించడు. అట్లు చేసినచో, ఏ ఎండకాగొడుగు పట్టు ప్రస్తుతవాదులతో (అవసరవాదులు) తనపార్టీ నిండిపోవును. పశ్చిమ సోషలిస్టుపార్టీ లవలంబించిన పద్ధతు లతడు గమనించెను. అవి అతనికి నచ్చలేదు. వేరొకసందర్భమున నతడు కొంతకాలమైనతరువాత నిట్లు వ్రాసెను- "పశ్చిమసోషలిస్టులు ఆచరణలోపెట్టు పార్లమెంటరీ విధానమునకు సంబంధించిన ఎత్తుగడలు నీతివిభగ్నముచేయుటలో సాటిలేనివి. ప్రతి సోషలిస్టుపార్టీని అవి క్రమక్రమముగా, చిన్న "టమ్మనీహాలు"గా (టమ్మనీహాల్ న్యూయార్కులోకలదు. రాజకీయదుర్నీతి కది చిహ్నమైనది) మార్చివేయుచుండెను. పైకెక్కుటకు ప్రయత్నించువారు, ఉద్యోగములకు ప్రాకులాడువారు అందుందురు. లెనిన్ తన అనుచరు లెంతమంది యున్నారన్నవిషయమును పట్టించుకోలేదు. ఒకప్పుడు తానొంటరిగా నిలబడగలనని బెదరించెను. ఉద్యమమునకు సర్వమును సమర్పించ సిద్ధులైనవారినే తీసుకొనవలయుననియు, ప్రజామోదములేకున్నను పనిచేయువారై యుండవలెననియు అతడు నొక్కిచెప్పెను. విప్లవకార్యములలో ఆరితేరిన నిపుణులను తయారు చేయవలెనని అతడుకోరెను. అట్టివా రీ ఉద్యమమును పెంపొందించి ఫలవంతము చేయగలరు. సహానుభూతిని చూపువారును, కాలము

కలిసివచ్చినప్పుడుమాత్రము మిత్రులుగా నుండదలచిన వారును అతనికి ప్రయోజనకారులు కారు.

అతడవలంబించదలచిన ఈ మార్గము కఠోరమార్గము. అనేకుల దృష్టిలో ఇది అవివేక విలసితము. ఏమైన నేమి ? మొత్తముమీద విజయముమాత్రము లెనిన్‌దే. సోషల్ డిమోక్రటిక్ పార్టీ రెండుపార్టీలుగా చీలిపోయెను. రెండుపేళ్లుపుట్టెను. ఈ పేళ్లు తరువాత తరువాత ప్రసిద్ధి కన్నవి. ఆ పేళ్లే మనగా—బోల్షివిక్, మెంషివిక్. బోల్షివిక్ పేరు కొందరికి భయావహము. కాని దాని అర్థము—అధిక సంఖ్యాకులని. మెంషివిక్ అనగా — అల్ప సంఖ్యాకులని. 1903 లో ఈ చీలిక సంభవించిన తరువాత లెనిన్ పక్షమువా రధిక సంఖ్యాకులగుటచే వారిని బోల్షివిక్‌లు అనిరి - అనగా అధికసంఖ్యాకులు గల పక్షము. విశేషమేమనగా ఆసమయమున ట్రాట్స్కీ అనువాడు—24 సంవత్సరముల యువకుడు—1917 విప్లములో లెనిన్‌తో గొప్పసహచరుడై పనిచేయనున్నవాడు, మెన్‌షివిక్కుల పక్షమున నుండెను.

ఈ చర్చలు, వాదములు అన్నియును రష్యాకు సుదూరమున లండన్‌లో జరిగెను. జారుల రష్యాలో వీలుకానందున రష్యన్ పార్టీసభ లండనులో పెట్టుకోవలసివచ్చెను. అందలి సభ్యులు అనేకులు దేశము నుండి వెళ్లగొట్టబడినవారు. లేదా, సైబీరియానుండి తప్పించుకు వచ్చిన నేరస్థులు.

ఇంతలో రష్యాలోనే ఆందోళన పేరుకొనుచున్నది. రాజకీయ సమ్మెలిందుకు చిహ్నములు. రాజకీయసమ్మె అనగా ఎక్కువకూలి కోరి ఆర్థికముగా బాగుపడవలెనని చేసిన సమ్మెకాదు. ప్రభుత్వముచేసిన యేదోయొకరాజకీయ కార్యమున కసమ్మతి తెలుపుచు చేసిన సమ్మె. కార్మికులలో కొంతరాజకీయ చైతన్యము కలిగినదని ఇది సూచించును. ఎట్లనగా, గాంధీజీని నిర్బంధించిరని కాని, దారుణముగా ప్రజాపీడ జరిగినదని కాని ఇండియాలోని ఫాక్టరీ కార్మికులు సమ్మెచేసినచో అది

రాజకీయ సమ్మె అనిపించుకొనును. ప్రబలమగు కార్మిక సంఘము (Trade unions) లున్నను, కార్మికుల సంస్థలున్నను పశ్చిమయూరోపులో ఇట్టి రాజకీయసమ్మెలు లేకుండుట వింత విషయమే. అవి అరుదుగా నుండుటకు కారణము బహుశా కార్మికనాయకులు స్వప్రయోజన పరులై, పాత్రవము వహించియుందురు. రష్యాలో జారుల రాజకీయ నిరంకుశత్వమువలన రాజకీయములు ప్రస్ఫుటముగా ముందుకువచ్చి కనిపించుచుండెను. 1903 సంవత్సరమునాటికే దక్షిణ రష్యాలో అనేక రాజకీయ సమ్మెలు అయత్నకృతముగా జరిగెను. ఉద్యమము బ్రహ్మాండమైనదైనను అది నాయకులు లేక అంతరించిపోయెను.

మరుసటిసంవత్సరమున దూరప్రాచ్యములో అల్లరులు తటస్థించెను. ఉత్తరఆసియా స్టెప్పీలకు అడ్డముగా పసిఫిక్ మహాసముద్రము వరకు నిర్మింపబడిన సైబీరియన్ రైల్వేనుగురించియు; 1894 మొదలుకొని జపానుతో సంభవించిన సంఘర్షణలగురించియు; 1904–5 లో జరిగిన రష్యా–జపానుయుద్ధమును గురించియు నీకు వేరొక జాబులో చెప్పియుంటిని. "రక్తాదిత్యవారము–" జనవరి 22, 1905 ను గురించియు నీకుచెప్పియుంటిని. ఒకపురోహితుని నాయకత్వమున కొందరు శాంతముగా ప్రదర్శనముజరుపుచు అన్నము పెట్టుమని తమ "చిన్నతండ్రి" వద్దకుపోగా జారుసైన్యములు వారిని అనాడు తుపాకులతోకాల్చి, చంపెను. దేశమందంతటను హాహాకారములు పుట్టెను.

రాజకీయసమ్మె లనేకము జరిగెను. చివరకు రష్యాఅంతటిలోనూ ఒకగొప్ప సమష్టిసమ్మె జరిగెను. నూత్నపద్ధతిని మార్క్సుసిద్ధాంతానుసారము విప్లవము ఇప్పుడు ప్రారంభమయ్యెను. సమ్మెచేసిన కార్మికులు ముఖ్యముగా పీటర్సుబర్గు, మాస్కో–లవంటి పెద్దకేంద్రములలో ప్రతియొక కేంద్రమందును ఒకక్రొత్తసంస్థను "సోవియట్" అనుదానిని స్థాపించిరి. ఇది తొలుదొల్త సమష్టిసమ్మెను నడుపుట కేర్పడిన కమిటీమాత్రమే. పీటర్సుబర్గు సోవియట్ కు ట్రాట్స్కీ నాయకు

డయ్యెను. జారు ప్రభుత్వము పూర్తిగా దిగ్భ్రమజెందెను. అది కొంత వరకు లొంగిపోయెను. ప్రజాప్రభుత్వపద్ధతిని వోటుహక్కునిచ్చుటకును, నియమబద్ధశాసనసభ నేర్పరిచుటకును అది మాట యిచ్చెను. నిరంకుశత్వదుర్గము పతనమైనట్లు కనిపించెను. వెనుకటి కర్షకులతిరుగుబాట్లు చేయలేకపోయినకార్యము, బాంబులతో హింసావాదులు నిర్వహింపలేక పోయినకార్యము, చట్టవిహితముగా పని చేయుమితవాదులు వివేచనతోచేసిన మనవులు సాధించలేకపోయిన కార్యము—సమిష్టిసమ్మెతో కార్మికులు సాధించగలిగిరి. మొట్టమొదటి సారి తమచరిత్రలో జారులు ప్రజాసామాన్యమునకు తల వంచవలసి వచ్చెను. చివరకిది శుష్కవిజయముగా పరిణమించెను. కాని దాని స్మృతిమాత్రము కార్మికులకు మార్గదర్శిగా నుండెను.

నియమబద్ధశాసనసభ—దీనినే డూమా అందురు—ఏర్పరచుటకు జారు సమ్మతించెను. డూమా అనగా ఆలోచించు స్థలము; పార్లమెంటులోవలె మాటాడు స్థలము కాదు. (ఫ్రెంచి పార్లర్ అనుమాట నుండి పార్లమెంటను పదము వచ్చినది.)ఈ వాగ్దానము మితవాదులను సంతుష్టిపరచెను. వారిపట్టుదల సడలెను. వారెప్పుడును అల్పసంతుష్టులే. విప్లవమునుచూచి భీతావహులై భూస్వాములు, భాగ్యవంతులగు కర్షకులకు లాభదాయకముగానుండు సంస్కరణముల కొన్నింటి నామోదించిరి. యదార్థవిప్లవకారు లప్పుడు ఎదుటబడగా జారుప్రభుత్వము తన దుర్బలత్వమునుగుర్తెరిగి, తదనుగుణముగా ప్రవర్తించెను. ఒకప్రక్క ఆకలిగొన్న కార్మికు లుండిరి. వారికి కావలసినది అన్నము, హెచ్చుకూలి. రాజకీయనియమములతో వారికి పనిలేదు. మరియు పేదలగు కర్షకు లుండిరి. "మాకు భూమి నిండు" అను ప్రమాదకరమగు నినాదములు వారు చేయుచుండిరి. రెండవప్రక్క విప్లవకారు లుండిరి. వారు ముఖ్యముగా రాజకీయములతో జోక్యము పెట్టుకొనిరి. పశ్చిమయూరోపియన్ నమోనా ప్రకారము పార్లమెంటును వారు వాంఛించుచుండిరి. ప్రజాసామాన్యము

కోరు అసలుకోరికలనుగాని, వారి చిత్తవృత్తులనుగాని వారు గమనించు చుండుటలేదు. హెచ్చుతరగతికిచెందిన నిపుణులగు కార్మికు లనేకులు వర్తకసంఘములుగా నేర్పడియుండుటచే, విప్లవపక్షమును చేరిరి. అందలి రాజకీయాంశ వారికి నచ్చుటచే వా రట్లుచేసిరి. నగరములలోను, గ్రామములలోను నివసించు జనసామాన్యము సాధారణముగా ఉదాసీనముగా నుండిరి. ఆటుపిమ్మట జారులప్రభుత్వమును, పోలీసులును కలిసి నిరంకుశాధికారులు చిరకాలమునుండి యవలంబించుపద్ధతులను వారిపై ప్రయోగించయత్నించిరి. వారిలో భేదములు కల్పించిరి. క్షుధార్తులగు ప్రజలను కొన్నివిప్లవసంఘములపై తిరుగబడ రెచ్చగొట్టిరి. నిర్భాగ్యులగు జ్యూలు రష్యనులచే హత్యచేయబడిరి. తార్తారులు ఆర్మీనియనులను హత్యచేసిరి. కడు బీదకార్మికులకును, విప్లవపరులగు విద్యార్థులకును మధ్య సైతము సంఘర్షణములు జరిగెను. ఈవిధముగా అనేక ప్రాంతములలో విప్లవముయొక్క నడుమును విరుగగొట్టి ప్రభుత్వమువారు విప్లవకేంద్రములగు పీటర్సుబర్గు, మాస్కోల పై విరుచుకొనిపడిరి. పీటర్సుబర్గుసోవియటు సులభముగానే చిదుకకొట్టబడెను. మాస్కోలో సైనికులు విప్లవకారులకు సహాయముచేసిరి. అయిదుదినముల యుద్ధమైనపిమ్మట చివరకు సోవియటు అణచివేయబడెను. పిమ్మట ప్రతీకారము ప్రారంభమయ్యెను. మాస్కోలో ప్రభుత్వము విచారణచేయకుండ 1000 మందిని మరణముపాలు చేసిరట. 70,000 మందిని చెరలో బెట్టిరట. అయా తిరుగుబాట్లకు ఫలితముగా దేశమంతటిలోను 14,000 మంది మడసిరట.

1905 సంవత్సరమునాటి విప్లవ మీవిధముగా పరాజితమై విపత్కరముగా పర్యవసించెను. 1917 సంవత్సరమున సంభవించిన విప్లవమున కిది నాంది యందురు. ఈ విప్లవము జయప్రదమయ్యెను. "మహాత్కార్యములశిక్ష ప్రజలకవసరము." అప్పుడే వారిచైతన్యము ప్రబుద్ధమగును. గొప్పగా కార్యాచరణ చేయగలుదురు. 1905 సంవ

త్సరమునాటి సంభవములు, కష్టపరంపరల కలిగించి, ఇట్టి శిక్షణ వారికిచ్చెను.

డూమా ఎన్నుకోబడెను. మే 1906 లో అది సమావేశమయ్యెను. అది విప్లవకూట మెంతమాత్రమునుకాదు. కాని అదిస్వేచ్ఛగా పని జేయుట జారుకు ఇష్టములేకుండెను. రెండున్నరమాసముల పిమ్మట దాని నత డింటిదారి పట్టించెను. విప్లవము నణచివేసినవాడగుటచే డూమా కోపించుననుభయ మతనికిలేదు. తొలగించబడిన డూమాప్రతినిధులు మధ్యతరగతివారు; లిబరలులు; నియమబద్ధులు (Liberal Constitutionalists). వారు ఫిన్లాండుకు పోయిరి (ఫిన్లాండు పీటర్సు బర్గుకు సమీపమందుండెను. అప్పుడది జారు ఆధిపత్యముననున్న అర్థ-స్వతంత్ర దేశము). వారు రష్యన్ప్రజలను పన్నులు చెల్లించవద్దనియు, సైనికదళమునకు, నౌకాదళమునకు పో నిరాకరించమనియు, డూమాను తొలగించినందుకు తమ అసమ్మతి నీవిధముగా తెలియజేయుమనియు పురిగొల్పిరి. ప్రతినిధులు ప్రజాసామాన్యము కష్టసుఖము లెరిగినవారు కారు. వారి ప్రార్థనను ప్రజలు మన్నించలేదు.

మరుసటిసంవత్సరము 1907 లో రెండవడూమా ఎన్నుకోబడెను. ర్యాడికల్ అభ్యర్థులు ఎన్నుకోబడకుండచేయుటకై, పోలీసులు అనేకవిధములగు ఆటంకములను కల్పించిరి. ఒక్కొక్కప్పుడు వారిని నిర్బంధించిరి. అయినను డూమా అన్న జారు కిష్టములేదు. మూడు నెలల అనంతరము దాని నతడు తొలగించెను. ఎన్నికచట్టమును మార్చి, అనర్హులు ఎన్నుకోబడకుండ చేయుటకై, జారుప్రభుత్వము పూనుకొనెను. ఇది ఫలించెను. మూడవడూమా గౌరవనీయులగు సంప్రదాయవాదులతో నిండియుండెను. కాన దానికి దీర్ఘాయుర్దాయము పట్టెను. 1905 విప్లవమును అణచివేసిన తరువాత జారు తనకిష్టము వచ్చినట్లు చేయుటకు సమర్థుడై యుండెను గదా! ఇట్టి నీరస డూమాల నేల పెట్టుకొనుటకు తంటాలుపడెనని నీ వాశ్చర్యపడవచ్చును. ఇందుకు

కారణము, రష్యాలోని చిన్న జనసమూహములను, ముఖ్యముగా భాగ్యవంతులగు భూస్వాములను, వర్తకులను సంతుష్టిపరచుటకై అట్లు చేసెను. దేశమున పరిస్థితులు విషమముగా నుండెను. ప్రజ లణచి వేయబడిరి. కాని వారు కోపముతో ధుమధుమలాడుచుండిరి. కాన పైనున్న భాగ్యవంతులనైనను చేతులోపెట్టుకొనుట ఉచితమని భావించిరి. అంతకన్న ప్రధానమైన కారణము, జారు ధారాళమగు చక్రవర్తియని పశ్చిమదేశములకు నచ్చజెప్పుట కట్లుచేసెను. పశ్చిమయూరోపులో జారులదుష్పరిపాలన, నిరంకుశత్వములనుగురించి సర్వసాధారణముగా చెప్పుకొనుచుండిరి. మొదటి డూమా తొలగింపబడి నప్పుడు, బ్రిటిష్ లిబరల్ పక్షనాయకు డొకడు, కామన్సుసభలోనను కొందును, గొంతెత్తి ఇట్లు చెప్పెనట — "డూమా చచ్చెను; డూమా చిరకాలము జీవించు గాక!" దీనినిబట్టి డూమాపై యెంతయభిమాన మున్నదో వెల్లడి కాగలదు. మరియు జారుకు ధనము, చాలాధనము, కావలసియుండెను. పొదుపుగానుండు ఫ్రెంచివా రతనికి అప్పు లిచ్చుచుండిరి. 1905 విప్లవమును, ఫ్రెంచివారివద్దనుండి గ్రహించిన అప్పుతోనే జారు అణచివేయగలిగెను. ఇది వింతవ్యత్యాసము—రిపబ్లికన్ ఫ్రాంసు, నిరంకుశమగు రష్యాకు, అందలి ర్యాడికలులను, విప్లవకారులను అణచివేయుటకై ధనసహాయము చేసినది; అయితే రిపబ్లికన్ ఫ్రాంసు అనగా ఫ్రెంచి బ్యాంకరు లని * భావము. ఏదియెట్లున్నను ఉదారముగా కనిపించవలెను కాబట్టి జా రట్లు చేసెను. అందుకు డూమా సహాయపడెను.

ఈలోపుగా యూరోపులోని పరిస్థితులు, ప్రపంచపరిస్థితులు వేగముగా మారుచుండెను. జపానుచే రష్యా ఓడింపబడిన పిమ్మట, ఇంగ్లాండు ఇదివరలోవలె రష్యానుచూచి భయపడుటలేదు. ఇంగ్లాండుకు వేరొకభయము పట్టుకొన్నది. పరిశ్రమలవిషయముననను, సము

* వడ్డీ వ్యాపారము చేయువారు; బ్యాంకులు నడపువారు.

ద్రాధిపత్యము విషయమునను జర్మనీనిచూచి భయపడుచుండెను.
కాలమునుండి ఇంగ్లాండే రెండు విషయములను తనహస్తగతము
కొనియుండెను. జర్మనీనిచూచి భయపడుటవల్లనే ఫ్రాంసుకూడ ధా
ముగా రష్యాకు అప్పులిచ్చెను. ఈ జర్మన్ భయమువల్లనే పురాణశత్రు
లిరువురు అన్యోన్యాలింగనము చేసికొనిరి. 1907 లో ఆంగ్లేయ
రష్యనులు ఆంగ్లో - రష్యన్‌సంధి చేసికొనిరి. అందు ఆఫ్ఘనిస్థానము
పర్షియాలో ఇతర ప్రదేశములలో వారివారికున్న ప్రధానవిభేదకారణ
లగు అంశములు పరిష్కారముచేసికొనిరి. కొన్నాళ్లు జరిగినపిమ
ఇంగ్లాండు, ఫ్రాంసు, రష్యాలు రాజ్యత్రయమైత్రి చేసికొనిరి. బాల్కనుల
ఆస్ట్రియా, రష్యాకు ప్రతిస్పర్థి : ఆస్ట్రియా జర్మనీకి మిత్రదేశము : ఇ
కూడ కాగితపు పత్రముమీదమట్టుకు జర్మనీకి మిత్రదేశము. ఇంగ్లాం
ఫ్రాంసు, రష్యాల రాజ్యత్రయమైత్రి, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీల ర
త్రయమైత్రికి, ఎదురునిలిచెను. తమకు సంభవించనున్న విపత్తుల
గక శాంతయుతులగు ప్రజలు నిద్రపోవుచుండ సైన్యములు య
న్ముఖములై యుండెను.

1905 సంవత్సరము తరువాత, రష్యాలో ఈ సంవత్సరవ
పశ్చాద్గతిని సూచించుచున్నవి. బోల్షివిజమును, ఇతర విప్లవకూట
లును పూర్తిగా అణచివేయబడినవి. దేశాంతరవాసముచేయుచు
లెనిన్‌వంటి కొందరుబోల్షివికులు పుస్తకములు వ్రాయుచు, కర
ములువేయుచు, మారుచున్న పరిస్థితులకు మార్క్సు సిద్ధాంత
నన్వయించుచు మిక్కిలి ఓపికతో పరదేశములందు తమకార్యవ
సాగించుచుండిరి. మార్క్సుసిద్ధాంతావలంబులలో అల్పసంఖ్యాక
మితవాదులు అయిన మెంషివికులకును, బోల్షివికులకును ప
నున్న భేదములు పెరిగిపోవుచుండెను. ఈ పశ్చాద్గతి జరుగు కాల
మెంషివిజమ్ ఎక్కువ ప్రాముఖ్యములోనికి వచ్చెను. దానికి
సంఖ్యాకులపక్షమని పేరువచ్చినప్పటికిని, విజమునకు అనేకుల

కాలమున దానిపక్షమున కనుకూలురై యుండిరి. 1912 సంవత్సరము మొదలుకొని మరల రష్యన్ ప్రపంచములో మార్పు ప్రవేశించెను. విప్లవకృషి పెరిగెను. దానితో బోల్షివిజంకూడ పెరిగెను. 1914 సంవత్సరమధ్యమునకు పెట్రోగ్రాడ్‌లో విప్లవవదంతులు ప్రబలు చుండెను. 1905 సంవత్సరములోవలెనే రాజకీయసమ్మెలు అనేకము పొడచూపెను. అయినప్పటికిని, పీటర్సుబర్గు బోల్షివిక్ కమిటీ ఏడ్గురి లోను ముగ్గురు జారు రహస్యపోలీసులు అని తరువాత తెలియవచ్చెను. విప్లవగతి ఇట్లే యుండునుగదా! డూమాలో బోల్షివికులు కొద్దిగాగలరు. వీరికి నాయకుడు మాలినోస్కి. అతడుకూడ పోలీసు ఏజెంటని తెలియ వచ్చెను; లెనిన్ అతనిని నమ్మెను.

ప్రపంచయుద్ధము ఆగస్టు 1914 లో ప్రారంభమయ్యెను. ఉన్న ట్లుండి అందరిదృష్టి రణరంగములపైకి పోయెను. నిర్బంధసైనిక శిక్షణకారణముగా ప్రధాన కార్మికులందరు గొంపోబడిరి. విప్లవోద్య మము అంతరించెను. యుద్ధముకూడదని చెప్పిన బోల్షివికులసంఖ్య బహుకొద్ది. వారు చాలానిందపాలైరి.

అనుకున్న స్థానమునకు, ప్రపంచయుద్ధము నాటికి మనము వచ్చి తిమి. ఇక్కడ మన మాగుదము. ఈ జాబును ముగించుటకుముందు రష్యన్‌కళను గురించియు, రష్యన్ సారస్వతమును గురించియు కొంత చెప్పెదను. ఎన్నిలోపములున్నప్పటికిని జారుల రష్యా (ఈ విషయ మందరికిని తెలియును) అద్భుతమగు నాట్యవిద్యను నిలుపుకొనెను. 19 వ శతాబ్దిలో ఉత్తమరచయిత లనేకులు జన్మించిరి. సారస్వత మున సాటిలేని సంప్రదాయమును వారేర్పరచిరి. దీర్ఘమగు నవలకానీ, చిన్నకథకానీ వారమోఘమగు ప్రతిభతో రచన చేసిరి. శతాబ్దిప్రారంభ మున పుష్కిన్ అమరచయిత ఉండెను. అతడు బైరన్, షెల్లీ, కీట్సు కవుల సమకాలికుడు. రష్యన్ కవులలో సత్తమోత్తముడని అతని నందురు. నవలారచయితలలో 19 శతాబ్దియందున్న ప్రముఖులు

గొగోల్; టర్జినీవ్, దోస్టోవిస్కీ, ఛెకోవ్ అనువారు. వారందరి కన్న గొప్పవాడు లియో టాల్‌స్టాయి. అతడు నవలలు వ్రాయుటలో ఉపజ్ఞ కలవాడు. అంతేకాదు; అతడు ఆధ్యాత్మికనాయకుడయ్యెను కూడ. ప్రజలపై అతనిప్రభావము అనేకవిధముల ఫలవంతమయ్యెను. అప్పటికి దక్షిణఆఫ్రికాలోనున్న గాంధీజీకికూడ అతని ప్రభావము వినవచ్చెను. ఉభయులును ఒండొరులను మెచ్చుకొనిరి. ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుకొనిరి. వీరిద్దరిని చేర్చినబంధము వారిరువురకు అహింస (అవిరోధము) పై గల దృఢవిశ్వాసము. టాల్‌స్టాయి అభిప్రాయప్రకారము క్రీస్తుమూలబోధ అదియే. ప్రాచీనహిందూశాస్త్రములు ఈ విషయమునే బోధించుచున్నవని గాంధీజీ అభిప్రాయము. టాల్‌స్టాయి ప్రవక్తగామాత్రముండి, లోకమునకు దూరముగానుండి, తాను నమ్మినవిషయముల నాచరణలో పెట్టుచుండెను. గాంధీజీ యన్ననో దక్షిణాఫ్రికా, ఇండియాదేశములందు పొడచూపిన సమష్టి సమస్యలకు, అభావార్థకముగా (Negative) కనిపించు నీ సిద్ధాంతమును, కార్యరూపముగా ప్రయోగించి, పరిష్కరించ తలపెట్టెను.

19 వ శతాబ్ది గొప్ప రష్యన్‌రచయితలలో నొక్కడు ఇంకను జీవించియున్నాడు. అతనిపేరు * మాక్సిం గోర్కీ.

---

## 145

# ఒక యుగాంతము

మార్చి 22, 1933

పందొమ్మిదవ శతాబ్దము! ఈ నూరుసంవత్సరములు కారణముగా ఎంతకాల మిచ్చట మన మాగిపోవలసివచ్చెను! నాలుగు

* గోర్కీ 1936 లో చనిపోయెను.

మాసములపాటు, అప్పుడప్పుడు, ఈ శతాబ్దినిగూర్చి నీకు వ్రాసియుంటిని. నాకు కొంచెము విసుగు పుట్టినది. ఈజాబులు చదువుసరికి నీకును విసుగు పుట్టవచ్చును. ఈశతాబ్ది ఆకర్షణీయముగానుండునని చెప్పి ప్రారంభించితిని. కాని కొంతకాలము జరుగుసరికి అట్టి యాకర్షణకూడ వెలవెలాడును. మనము 19 వ శతాబ్దిదాటి నిజమునకు 20 వ శతాబ్దిలో చాలవరకు ముందుకు పోతిమి. 1914 వ సంవత్సరము మనహద్దు. ఆ సంవత్సరమందే యూరోపుదేశమందును, ప్రపంచమందును క్షామము, ఖడ్గము, అగ్నిహోత్రము విచ్చలవిడిగా సంచరించ నవకాశములు పుట్టినవి. ఈసంవత్సరము చరిత్రలో దశాపరిణామమును సూచించు సంవత్సరము. ఆ సంవత్సరమందే ఒకయుగ మంతమయ్యెను; వేరొకయుగము ప్రారంభమయ్యెను.

పందొమ్మిదివందల పదునాలుగు! ఆ సంవత్సరమైనను ఈకాలమునకు ముందుదే. ఇంతకును అది దాదాపు 19 సంవత్సరములకు క్రితముదే. మానవజీవితమందు సైత మది దీర్ఘకాలముకాదు. చరిత్రలో అనలేకాదు. ఈకాలములో ప్రపంచ మెంతోమార్పు చెందెను; ఇంకను మార్పు చెందుచున్నది. ఒకయుగము గడచినదా యనిపించుచున్నది. 1914 వ సంవత్సరమును అంతకుముందు జరిగిపోయినకాలమును ప్రాచీనచరిత్రలోనికి పోవును. సుదూరభూతకాలములో చేరును. దానినిగూర్చి మనము చరిత్రగ్రంథములలో చదువుచుందుము. మన కాలమువంటిది కాదది. సంభవించిన యీ గొప్ప మార్పులనుగూర్చి ముందుముందు కొంతనీకు నేను చెప్పెదను. ఒకవిషయమును గమనించమని మాత్రము హెచ్చరిక చేయుచున్నాను. బడిలో భూగోళశాస్త్రము నీవు చదువుచున్నావు. నీవు చదువుచున్న భూగోళశాస్త్రము, 1914 కు పూర్వమున నేను బడిలోనున్నప్పుడు నేర్చుకోవలసివచ్చిన భూగోళశాస్త్రమునకు భిన్నమైనది. బహుశా నీవిప్పుడు నేర్చుకొనుచున్న భూగోళవిషయము లనేకము అనతికాలములోనే, నావలెనే

మరచిపోవలసివచ్చునేమో! ప్రాచీనస్థలచిహ్నములును, ప్రాచీనదేశములును యుద్ధధూమములో మాయమైపోయినవి. వానిస్థానే క్రొత్తవి, జ్ఞాపకముంచుకొనుటకు కష్టమైన పేళ్లతో వెలిసినవి. దాదాపు ఒక్క రాత్రిలో వందలకొద్ది నగరములపేళ్లు మారిపోయినవి. సెంటుపీటర్సుబర్గు పెట్రోగ్రాడు అయి తరువాత లెనిన్‌గ్రాడు అయినది. కాంస్టాంట్‌నోపెల్‌ను ఇప్పుడు ఇస్తాంబుల్ అనవలెను. పెకింగును ఇప్పుడు పీపింగ్ అనవలెను. బొహీమియాలోని ప్రేగు, ఇప్పుడు జెకోస్లొవేకియాలోని ప్రాహ అయినది. 19 వ శతాబ్దికి సంబంధించిన నా జాబులలో ఖండములగూర్చియు, దేశములగూర్చియు వేర్వేరుగా వ్రాసితిని. అది అవసరమని తోచినది. వేర్వేరు అంశములగురించియు, వేర్వేరు ఉద్యమములగురించియు కూడ ప్రత్యేకముగా మనము విచారించితిమి. కాని ఇదంతయు దాదాపు ఒక్కమారే సంభవించిన దన్నమాట నీకు జ్ఞాపకముండియుండును. చరిత్ర సహస్రపాదములతో ప్రపంచమును ఒక్కమారే చుట్టివచ్చెను. శాస్త్రము, పరిశ్రమము, రాజకీయములు, ఆర్థికములు, సమృద్ధి, లేమి, ధనికపద్ధతి, సామ్రాజ్యవాదము, ప్రజాస్వామికము, సామ్యవాదము, డార్విన్, మార్క్సు, స్వాతంత్ర్యము, దాస్యము, క్షామము, అంటువ్యాధులు, యుద్ధము, శాంతి, నాగరికత, మోటుతనము, — వీనికన్నిటికిని ఈ వింతకట్టడములో స్థానమున్నది. ఇందు ప్రతియొక్కటియు వేరొకదానితో పరస్పరసంబంధము కలిగియుండెను. ఈకాలమును మనము మనస్సుతో గ్రహించదలచితిమా — వేరొకకాలమైనను అంతే — మనకు సిద్ధించుదృశ్యము క్లిష్టమై, నిరంతర గతితో నిరంతరపరిణామము చెందుచు గోచరించును. కలైడోస్కోపులోని బొమ్మలవలె నిరంతరము మారుచు కనిపించును. ఈదృశ్యములో పలుభాగములు చూచుటకు ప్రీతికరముగా నుండవు.

ఈకాలముయొక్క ప్రధానలక్షణము—ఇదివరలో తెలిపికొని యుంటిమి—యంత్రసహాయముతో అమితముగా ఉత్పత్తిచేయు ధనిక

పద్ధతిని నడుపబడు పరిశ్రమ; అనగా నీరు, ఆవిరి, విద్యుత్తు మున్నగు శక్తులసహాయముతో చేయు ఉత్పత్తి (విద్యుత్తును జనింపజేయు యంత్రాగారమును 'పవర్‌హౌసు' అందురుకదా). వేర్వేరు ప్రపంచ భాగములలో వేర్వేరుఫలితముల నిది కలిగించెను. ఇవి ప్రత్యక్షఫలితములు. కొన్ని పరోక్షఫలితములుకూడ. ఎట్లనగా — లాంక షైరులో పవర్‌మగ్గములు వస్త్రము నుత్పత్తిచేయుటచే, ఇండియాలోని మారుమూలలపల్లెలలో పరిస్థితులు తారుమారాయెను. అచ్చటి అనేకవృత్తులు నశించెను. ధనికవర్గపరిశ్రమ శక్తివంతమైనది. స్వస్వభావము ననుసరించి అది నాటికినాడు పెరుగుచుపోయెను. దాని పిపాస కంతములేదు. దాని ప్రత్యేకలక్షణము నిరంతర ఆర్జన. అది ఎల్లప్పుడు ఆర్జించుటకే ప్రయత్నించును. ఆర్జించినది గ్రహించి మరల ఆర్జనకు దొరకొనును. వ్యక్తు లిట్లు చేయుటకు ప్రయత్నించిరి. జాతులును ప్రయత్నించెను. ఈ పద్ధతిపై వృద్ధియైన సంఘమునకు అందువల్లనే ఆర్జనసంఘమని పేరువచ్చినది. ఇంకను ఇంకను ఉత్పత్తి చేయవలెననియే దాని లక్ష్యము. ఆ ప్రకారముగావచ్చిన అదనపుధనమును పెట్టి మరికొన్ని ఫాక్టరీలు, రైల్వేలు మున్నగునవి నిర్మించుట దానిలక్ష్యము. ఇంతేగాదు. ఈ అదనపుధనముతో యజమానులు భాగ్యవంతులగుదురు. ఈ లక్ష్యమును సాధించుటకు ఎట్టిత్యాగము చేయుటకును సంకోచింపరు. పరిశ్రమద్వారా ధనము సంపాదించుటకు కారకులైన కార్మికుల కిం దుండి వచ్చులాభము బహుస్వల్పము. వారు స్త్రీలతో, పిల్లలతోసహా, వారి పరిస్థితులు బాగుపడుటకై పడరానిపాట్లు పడవలసివచ్చును. ఈ ధనికవర్గపరిశ్రమయును, దానినుండి లాభముతీయు జాతులును స్వలాభముకొరకు వలసరాజ్యములను, పరాధీనరాజ్యములనుకూడ బలిపెట్టుచున్నారు.

ఇట్లు ధనికతత్వము గ్రుడ్డిగా, దయావిహీనముగా ముందుకు పోయెను. దానిదెబ్బతిని చెడినవారు ఎందరో వెనుకపడియుండిరి.

అయినను దానిగతి జయసూచకమగు అభివృద్ధియే. శాస్త్రసాప ముతో అనేక కార్యము లది నిర్వహించెను. దీనినిచూచి ప్రపం ఆశ్చర్యచకిత మాయెను. అది కలిగించిన దుర్గతి కిది కొంతపరిహా యన్నట్లుండెను. బుద్ధి పూర్వకముగా చేయకున్నను, యాదృచ్ఛిక దానివల్ల కొన్ని మేళ్లుకూడ కలిగెను. కాని యీ మేళ్లక్రింద, ఈ తలముక్రింద ఎంతోచెడుగు చేరియుండెను. విశేషమేమనగా అది వ్యత్యాసముల కలిగించెను. అది పెరిగినకొలది వ్యత్యాసము మాయెను. కటికదరిద్రము, నింపుభాగ్యము; మురికిసందులు, ఆకా నంటు మేడలు; సామ్రాజ్యములు, పరాధీనమయి ఇతరులలాభమున వలసరాజ్యములు; యూరోపు అధికారము చెలాయింపు ఖండ ఆసియా, ఆఫ్రికాలు దాని ప్రయోజనములకై వినియోగింపబడు ఖండములు. ఈ శతాబ్దిలో చాలకాలముపాటు అమెరికా ప్రపంచ హారములలో ఐక్యము కలిగించుకొనలేదు. కాని అది వేగముగా వృద్ధి చెందుచున్నది. ద్రవ్యసాధనల నభివృద్ధి చేసికొనుచున్నది. రక్షణకు కట్టుదిట్టములు చేసికొనుచున్నది. యూరోపుఖండ ఇంగ్లాండుదేశము, సగర్వముగా, సుసంతుష్టితో ధనతత్వమునకు కత్వము వహించెను. ముఖ్యముగా సామ్రాజ్య విస్తరణకార్యభాగ కది నాయకత్వము వహించెను.

ధనికవర్గ పరిశ్రమలగతియు, వానిగ్రసనశీలమును క్లిష్టపరి తెచ్చిపెట్టెను. దానికి ప్రాతికూల్యత కలిగెను. ఆందోళన కలి చివరకు కార్మికులరక్షణకై కొన్ని ప్రతిబంధకములు ఏర్పరచ వచ్చెను. ఫ్యాక్టరీపద్ధతి మొదటిరోజులలో కార్మికులచేత — వ ముగా స్త్రీలచేత, పిల్లలచేత — కొద్దికూలికి దారుణముగా పనిచేయ కొనుచుండిరి. పురుషులకుబదులు స్త్రీలను, పిల్లలను పనికి పి చుండిరి. కారణము వారు తక్కువకూలికి వత్తురుగనుక. అనా కరమైన ప్రదేశములలో, దుర్భరపరిస్థితులలో వారిచే రోజుకు ఒ

క్కొప్పుడు 18 గంటలు పనిచేయించుచుండిరి. చివరకు ప్రభుత్వము కలుగజేసికొని చట్టములను చేసెను. ఫాక్టరీచట్టనిర్మాణ మందురు దానిని. రోజుకు పనిచేయవలసిన గంటలకు ఒకహద్దు ఏర్పరచిరి. వెనుకటికన్న మంచిపరిస్థితులలో వారు పనిచేయవలసి యుండునని చెప్పిరి. ఈచట్టములు ముఖ్యముగా స్త్రీలకు, పిల్లలకు రక్షణ నిచ్చెను. ఫ్యాక్టరీయజమానుల సంపూర్ణనిరోధమును ప్రతిఘటించి దీర్ఘకాలము పాటుపడి ఈచట్టములు చేయవలసివచ్చెను.

ధనికవర్గ పరిశ్రమము ననుసరించి సామ్యవాదభావములు, కమ్యూనిస్టుభావములు తలయెత్తెను. నూతనపరిశ్రమ నవి అంగీకరించెను. గాని ధనికతత్వమూలము నవి యాక్షేపించెను. కార్మికుల సంస్థలు, వర్తకసంఘములు, 'ఇంటర్నేషనల్సు' (అంతర్జాతీయ కార్మికసంస్థలు) కూడ వృద్ధినందెను.

ధనికతత్వమును పురస్కరించుకొని సామ్రాజ్యతత్వము వచ్చెను. పాశ్చాత్య ధనికవర్గపరిశ్రమ, చిరకాలమునుండి పాతుకొనియున్న తూర్పుదేశముల ఆర్థికపరిస్థితులను తాకుటచే ఆ యభిఘాతమువల్ల తూర్పుదేశములలో తీరని నష్టము సంభవించెను. క్రమక్రమముగా ఈ తూర్పుదేశములలో సైతము ధనికవర్గపరిశ్రమ వేళ్లుతన్ని వృద్ధికా జొచ్చెను. పాశ్చాత్య సామ్రాజ్యవాదమునకు సవాలుగా జాతీయతకూడ అక్కడ వృద్ధిచెందెను.

ఇట్లు ధనికతత్వము ప్రపంచము నుగ్రూత లూపెను. దారుణమగు మానవదుస్థితి నది కలిగించినను, మొత్తముమీద పాశ్చాత్యమునకు మట్టుకు ఉపకారకముగానే ఉండెను. దానివల్ల భోగభాగ్యములు వృద్ధి అయ్యెను. మానవసుఖము హెచ్చుస్థాయి నందుకొనెను. సామాన్య మానవునకు ఇదివరలోకన్న ప్రాముఖ్యము వచ్చెను. ఆచరణలో మాత్రము ఏ విషయముపైనను అతని అభిప్రాయములకు విలువ లేకుండెను. మిథ్యారూపముగా మాత్రము ఓటుండెను. కాని, మాట

మట్టుకు, రాష్ట్రములో అతని ప్రతిష్ఠ పెరిగెను. దానితోపాటు అతనికి ఆత్మగౌరవము హెచ్చెను. ధనికవర్గపరిశ్రమ కాలు నిలవద్రొక్కుకున్న పాశ్చాత్యదేశములకే ఇది అనువర్తించును. జ్ఞానసంపాదన గొప్పగా జరిగెను. ప్రకృతిశాస్త్రము అద్భుతకార్యములు చేయుచుండెను. వేయి విధములుగా నిత్యజీవనమునకు శాస్త్రవిషయములు ప్రయోగింపబడు చుండుటచే ప్రతిమానవునకు జీవితము సుఖాస్పదమైయుండెను. ముఖ్యముగా రోగనిరోధమునకు పనికివచ్చు మందులు, పారిశుధ్యమునకు తోడ్పడుమంచులు అనేక వ్యాధులను అణచివేయ లేదా నిర్మూలించ ప్రారంభించెను. ఇంతకుముం దీ రోగములు మానవునకు దుఃఖదాయకములై యుండెను. ఒక్క ఉదాహరణము చెప్పవలసివచ్చిన, మలేరియా చూడుడు. మలేరియాకు కారణమును దానిని నిరోధించు మార్గములును కనిపెట్టబడినవి. తీసుకొనవలసిన జాగ్రత్తలు తీసికొన్ననో మలేరియాను ఒకప్రాంతమునుండి నిర్మూలించ వచ్చుననుటకు సందేహములేదు. ఇంకను మలేరియా ఉన్నదనియు, ఇండియాలో వేలాదిజనులు దానినుండి బాధపడుచున్నారనియు చెప్పిన అది శాస్త్రముయొక్క దోషముకాదు. దోషము నిజముగా జాగ్రత్తలేని ప్రభుత్వమునకు, అజ్ఞానులయిన ప్రజలకు చెందును.

ఈ శతాబ్దియొక్క చెప్పుకోదగ్గ విశేషము రవాణాపద్ధతులందును, సంచారపద్ధతులందును కలిగిన అభివృద్ధి. రైల్వేలు, పొగయోడలు, టెలిగ్రాపులు, మోటారుకార్లు ప్రపంచస్వరూపమును పూర్తిగా మార్చివేసెను. మానవప్రయోజనములనుబట్టి చూచిన వెనుకటిప్రపంచమునకును, నేటిప్రపంచమునకును హస్తిమశకాంతరము తేడా కనిపించు చున్నది. ప్రపంచము సంకుచిత మాయెను. అందరిప్రజలు ఒకరి కొకరు సమీపమునకు వచ్చిరి. వెనుకటికన్న తరుచుగా ఒకరినొకరు చూచుకొనవచ్చును. ఒకరినొకరు తెలిసికొనుటవలన అజ్ఞానవిలసిత మగు భేదములు కూలిపోయెను. సమభావములు వ్యాపింప దొడగెను.

ప్రపంచమునకు ఒకవిధమగు సమయూపత కొంతమట్టుకు కలిగెను. మనము చర్చించుకొనుచున్న కాలభాగము అంతమున, వైర్లెస్ టెలిగ్రాఫీయును, ఆకాశయానమును వచ్చెను. ఇప్పు డివి సర్వసామాన్య మైనవి. నీ వనేకపర్యాయములు విమానములో ఆకాశయానము చేసితివి. దానినిగురించి నీ వంతగా పట్టించుకోలేదు. వైర్లెస్ టెలిగ్రాఫీయును, ఆకాశయానమును 20-వ శతాబ్ది — అనగా మనకాలమున వచ్చినవి. బెలూనులలో ఆకాశముమీదకు తరుచు వెళ్లుట కలదుగాని ఎవ్వరును గాలికంటె బరువైన యంత్రసాహాయ్యముతో పైకి వెళ్లినవారు లేరు. ప్రాతకట్టుకథలలో మాత్రము, అరేబియన్నైట్సులోని "ఎగిరే తివాసీలు," మనభారతదేశ కథలలోని కీలుగుఱ్ఱములు * ఆకాశములో ఎగురుటకలదు. తొలుదొల్త గాలికంటె బరువైన యంత్రముమీద ఆకాశయానము చేసిన వారిద్దరు అమెరికన్సోదరులు. ఈ యంత్రమే మన విమానసృష్టికి దారితీసెను. ఆ అమెరికన్సోదరుల పేళ్లు విల్బర్ రైట్, ఆర్వెల్రైట్. డిశంబరు 1903 లో వారు 300 గజములలోపుదూరము గాలిలోఎగిరిరి. అంతమట్టుకైనను ఇదివరలో ఎవ్వరును చేయలేనిపని వారుచేసిరి. తరువాత ఆకాశయానము తీయకుండా అభివృద్ధి కాజొచ్చెను. 1909 లో బ్లీరట్ అను ఫ్రెంచివాడు ఫ్రాంసునుండి ఇంగ్లాండుకు, ఇంగ్లీషుఛానల్ దాటి, ఎగురుచు వెళ్లెనన్నవార్త వచ్చినప్పుడు కలిగిన ఆశ్చర్యము నాకు జ్ఞాపకమున్నది. వెనువెంటనే, పారిస్లోని ఎఫిల్ టవర్ మీదుగా ఎగిరిన తొలివిమానమును నేను చూచితిని. ఎన్నో సంవత్సరములతరువాత, మే 1927 లో, చార్లెస్ లిండ్బెర్గు అట్లాంటిక్మీదుగా రజతబాణమువలె మెరయుచువచ్చి పారిస్ విమానాశ్రయమైన లెబూర్గెట్లో దిగినప్పుడు నీవును, నేనును పారిస్లోనే ఉంటిమి.

ధనికవర్గపరిశ్రమము, ముమ్మరముగానున్న రోజులలో పైవిష

* Urankhatola.

యములన్నియు ఆకాలమునకు మెరుగుపెట్టుచుండెను. ఈశతాబ్దిలో అనేకులు అద్భుతకార్యము లనేకము చేసియుండిరి. ఇంకొక మంచి విషయము. పేరాసతో గ్రసనశీలమై ధనికతత్వము పెరుగుచుండగా దానిని అదుపులోపెట్టుటకు సహకారోద్యమము లేవదీయబడెను. సరుకును ఉమ్మడిగాకొని అమ్ముటకును, లాభములను సమానముగా పంచుకొనుటకును ఏర్పడిన ప్రజలసంఘ మిది. సాధారణ ధనికతత్వ పద్ధతి, గొంతుకలుకోయు పోటీపద్ధతి. అందు ప్రతివాడును రెండవవానిని మోసపుచ్చి మించిపోవుటకు ప్రయత్నించును. సహకారపద్ధతి యన్ననో అన్యోన్యసహకారముపై ఆధారపడియున్నది. నీవు సహకార సంఘముల దుకాణములను, చాలా సహకారసంఘముల స్టోర్లను చూచి యుందువు. 19-వ శతాబ్దిలో సహకారోద్యమము యూరోపులో అమిత ముగా పెరిగెను. చిన్నదేశమగు డెన్మార్కులో అది నిర్విఘ్నముగా కొనసాగెను.

రాజకీయవిషయములలో ప్రజాస్వామికభావములు పెరిగెను. తమ పార్లమెంటులకును, అసెంబ్లీలకును వోటువేయు హక్కు నానాటికి అధికజనులకు ప్రాప్తించెను. కాని ఇట్టిహక్కు పురుషులకు మాత్రమే. స్త్రీలు ఇతరత్రా ఎంత సామర్థ్యము చూపినను ఈహక్కును పొందుటకుమాత్రము తగినవారనియు, వివేకముకలవారనియు భావింప బడలేదు. పలువురు స్త్రీలు ఇదిచూచి రోషపూరితులైరి. 20-వ శతాబ్ది తొలిదినములలో ఇంగ్లాండులోని స్త్రీలు పెద్దఆందోళన చేసిరి. దీనినే స్త్రీల సఫ్రేజ్ (వోటు) ఉద్యమ మందురు. పురుషులు ఈఉద్యమమును పరిగణించలేదు. దానిపై తమదృష్టి పారవీయలేదు. తత్కారణమున స్త్రీ సఫ్రజెట్లు (వోటుకొరకు పోరాడువారు) తీవ్రముగా ప్రతిఘటించిరి. పురుషులదృష్టి నాకర్షించుటకు దౌర్జన్యమునకు కూడ దిగిరి. పార్ల మెంటులో అల్లరులుచేసి దానికార్యములకు భంగము కలిగించిరి. బ్రిటిష్ కాబినెట్ మంత్రులపై పడి కొట్టిరి. అందుచే ఈమంత్రులను నిరంతరము

పోలీసులు రక్షింపవలసివచ్చెను. పెద్దపెట్టుగా దౌర్జన్యము కట్టుదిట్టముగా జరిగెను. పలుపురుస్త్రీలు జైళ్లకు పంపబడిరి. అచ్చట వారు ఉపవాసదీక్ష సాగించిరి. అందుచే వారిని వదలిపెట్టిరి. స్వస్థత చేకూరుటతోడనే వారిని మరల జైలులో పెట్టిరి. ఈచర్యను సమర్థించుటకై పార్లమెంటొక ప్రత్యేకశాసనమును పుట్టించెను. దీనికి ("Cat & Mouse Act") పిల్లి-ఎలుకా శాసన మని ప్రజలు పేరు పెట్టిరి. సఫ్రజెట్టుల* ఈపద్ధతులు విరివిగా దృష్టి నాకర్షించగలిగెను. కొద్దిసంవత్సరముల అనంతరము, ప్రపంచయుద్ధము ప్రారంభమైన పిమ్మట స్త్రీలు వోటుహక్కును పొందుటకు తగుదురని అంగీకరింపబడెను.

స్త్రీ ఉద్యమము, వోటుహక్కు నడుగుటకొరకు మాత్ర మేకాదు. అన్ని విషయములందును పురుషులతో సమానత్వముకూడ కోరబడెను. మొన్నమొన్నటివరకు పాశ్చాత్యదేశములలోని స్త్రీలస్థితిచాలాహీనముగా నుండెను. వారికున్నవి బహుకొద్ది హక్కులు. చట్టప్రకారము ఇంగ్లీషు స్త్రీలు సొంత ఆస్తి పెట్టుకొనుటకు వీలులేదు. భార్యసంపాదనతో సహా భర్త అంతయు తీసికొనును. హిందూ చట్టప్రకారము నేడున్న స్త్రీలకంటె వారు అన్యాయస్థితిలో నుండిరి. అది చాలనీచస్థితి. పాశ్చాత్య దేశములందలి స్త్రీలు, నే డనేకవిధములుగా భారతస్త్రీలున్నట్లే పరాధీన జాతిగా నుండిరి. వోట్లకొరకు ఆందోళన బయలుదేరుటకు పూర్వమే, ఇతరవిషయములలో, పురుషులతో సమానముగా స్త్రీలను కూడ చూడవలసియుండునని వక్కాణింపబడెను. చివరకు 1870-90 సంవత్సరములలో ఇంగ్లాండులో, ఆస్తిని స్త్రీలు కలిగియుండు విషయమున కొన్నిహక్కుల నిచ్చిరి. ఈ విషయమును కొంతవరకు స్త్రీలు జయప్రదముగా సాధించుటకు కారణము ఫాక్టరీ యజమానులు ఇష్టపడుటయే; స్త్రీలు తమసంపాదన తాముంచుకొనుపక్షములో, ఫాక్టరీలో

---

* వయస్సువచ్చిన ప్రతిమానవునికి ఓటుహక్కు కావలెననువారు.

పనిచేయుటకు వా రిష్టపడుదురని యజమానులు భావించిరి.

అన్నివైపుల గొప్పమార్పులు కలుగుచున్నట్లు మనము గుర్తించు చున్నాము. కాని ప్రభుత్వముల పైఖరులలోమార్పులు లేవు. పెద్దరాజ్య ములు కుట్ర, మోసముతో కూడిన పద్ధతులనే అవలంబించుచున్నారు. చిర కాలముక్రిందట ఫ్లారెంసువాసియగు మాక్యావెల్లి నిర్దేశించిన పద్ధతులవి. అతనికి 1800 సంవత్సరములు పూర్వము భారతమంత్రియగు చాణ క్యుడు నిర్దేశించిన పద్ధతులును అవే. వారిలో వారికి ఎడతెగనిస్పర్థలు చెలరేగుచుండెను. రహస్యసంధులు, రహస్యమైత్రులు వారు చేసికొను చుండిరి. ప్రతిరాజ్యమును రెండవరాజ్యము మోసగించి ఓంచవలెనని నిరంతరము ప్రయత్నించుచుండెను. మనము చూచితిమిగదా యూరోపు కార్యవాదియై కలహశీలయై పనిచేయుచుండెను. ఆసియా స్తబ్ధముగా నుండెను. ప్రపంచరాజకీయములలో అమెరికా వహించినపాత్ర స్వల్పమే. సొంతవ్యవహారములలో తగుల్కొనియుండుటయే అందుకు కారణము.

జాతీయత పెంపుచెందగా "ఒప్పో, తప్పో నాదేశము" అను భావము పుట్టి వృద్ధిజెందెను. వ్యక్తులు ఏపనిని చేసిన తప్పు, అవినీతి కరము అని అందురో అట్టి పనులనే చేయుటకు జాతులు గర్వించు చుండిరి. ఇట్లు వ్యక్తులనీతికిని, జాతులనీతికిని వింతవ్యత్యాస మేర్ప డెను. రెంటికిని పెద్దభేద ముండెను. వ్యక్తుల వ్యసనములే జాతుల సద్గుణము లయ్యెను. స్వార్థము, పేరాస, గర్వము, అసభ్యత—ఇవి స్త్రీ పురుషవ్యక్తులపట్ల చెడ్డగుణములుగాను, సహింపరానివిగాను భావింప బడుచుండెను. పెద్దసంఘముల విషయమునను, జాతులవిషయమునను ఈ గుణములే స్తుతిపాత్రములగుచుండెను. దేశభక్తి, దేశప్రేమ పేరుతో వానిని ప్రోత్సహించుచుండిరి. జాతులు పెద్దకూటములుగాచేరి ఒకరి నొకరు హత్యచేయుట, చంపుట సైతము మెప్పునొందుచున్నవి. విన్న మొన్నటిరచయిత యొక డిట్లు చెప్పుచున్నాడు. అతడు చెప్పినమాట

యదార్థము — "వ్యక్తుల దుష్టకార్యములు పెద్దపెద్దజనసంఘములు చేయవచ్చునని చెప్పుటకు నాగరికత సాధనమైనది."

—

# 146

# ప్రపంచయుద్ధ ప్రారంభము

మార్చి 23, 1933

ఒకజాతి వేరొకజాతితో వ్యవహరించునప్పుడు జాతు లెంత దుష్టముగా, అవినీతికరముగా ప్రవర్తించుచున్నవో వెనుకటిజాబులో నేను సూచించియుంటిని. వీలున్నప్పుడెల్ల ఇతరులపట్ల అసహ్యముగా, అసహనముతో ప్రవర్తించుటయును, గడ్డిమేటిలో కుక్కవలె, స్వార్థపరులై మెలగుటయును స్వాతంత్ర్యముయొక్క చిహ్నముగా వారు భావించుచుండిరి. సరిగా ప్రవర్తించమని వారితో చెప్పగల అధికారు లెవ్వరునులేరు. వారు స్వతంత్రులుకారా మరి? ఎవరు కలుగజేసికొన్నను వారు సహించరుగదా! చేసెడు కార్యములకు దుష్ఫలితములు కలుగునేమో యని వారు శంకుదురు. ఇట్లు బలవంతులు కొంతవరకు గౌరవింపబడుచుండిరి. బలహీనులు బెదరింపబడుచుండిరి.

ఇట్టి జాతీయస్పర్థ, విజమునకు, పెట్టుబడిదారీ వ్యాపారాభివృద్ధి ననుసరించి రాకతప్పని ఫలితము. ఎప్పటికప్పుడు మార్కెట్లు అధికముగా కావలెననీ, ముడిపదార్థములు కావలెననీ కోరుచు పెట్టుబడిదారీ రాజ్యములు ప్రపంచమును చుట్టివచ్చుచుండె నవి ఇదివరలో చూచియుంటిమి. ఆసియాలో, ఆఫ్రికాలో తొందరగాతిరుగుచు చేతికిచిక్కిన దేశమునంతయు, స్వప్రయోజనార్థమై, వశపరచుకొనిరి. ప్రపంచమునంతయు వారు కమ్ముకొనిరి. ఇంకా వారు పోవుటకు దేశములు లేవు.

కాన పెట్టుబడిదారీరాజ్యములు ఒకరినొకరు తీవ్రముగా చూచుకొనుచు, ఒకరిరాజ్యము లొకరు గ్రసించ చూచుచుండిరి. ఆసియాలో, ఆఫ్రికాలో, యూరోపులో, ఈ పెద్దరాజ్యములు తరుచు ఢీకొనుచుండెను. కోపములు చెలరేగెను. యుద్ధము ఏ క్షణమందైనను వచ్చునట్లుండెను. వాటిలో కొన్నిరాజ్యములు మిగతరాజ్యములకన్న మంచిస్థితిలో నుండెను. పరిశ్రమలలో ముందుదిగి సాగిపోయిన ఇంగ్లాండు, తన విశాల సామ్రాజ్యముతో అందరికన్న అదృష్టవంతముగా నున్నట్లు కనిపించెను. ఇంగ్లాండుకు సైతము సంతుష్టి లేకుండెను. ఎంతఉన్నను ఇంకను కావలయునవి కోరుట మానవస్వభావము. తనసామ్రాజ్యమును విస్తరింప జేయుటకై పెద్దపెద్దయోచనలు దాని " సామ్రాజ్య—నిర్మాతలు " చేయుచుండిరి. ఆఫ్రికాసామ్రాజ్య యోచన లవి—ఉత్తరమునుండి దక్షిణమునకు, కైరోనుండి కేప్(అగ్రము)కు విస్తరించిన ఆఫ్రికాసామ్రాజ్య యోచనలు. పరిశ్రమలో జర్మనీ, సంయుక్తరాష్ట్రములు పోటీనిలుచుట ఇంగ్లాండుకు కష్టముగా నుండెను. ఈదేశములు ఇంగ్లాండుకన్న చౌకగా వస్తువులు తయారు చేయుచుండిరి. ఇట్లు ఇంగ్లాండు మార్కెట్టులను దానినుండి వారు తస్కరించుచుండిరి.

అదృష్టవంతమగు ఇంగ్లాండుకే సంతుష్టి లేనప్పుడు మిగత రాజ్యముల కసలే సంతుష్టిలేదు. జర్మనీ పెద్దరాజ్య మగుట కాలస్యమైనది. ఉన్న పక్వఫలములన్నియు ఇతరులచేతులలో పడుటచే దానికి అసంతుష్టి మిక్కుటముగా నుండెను. శాస్త్రములో, విద్యలో, పరిశ్రమలో అది గొప్పగా అభివృద్ధియైనది. సర్వోత్కృష్టమగుసైన్యము నది తయారు చేసెను. తనకార్మికులకై, సంఘసంస్కరణచట్టనిర్మాణ విషయమునను, అది ఇంగ్లాండును, ఇతరదేశములను అతిక్రమించెను. జర్మనీ రంగమునకు వచ్చునరికి ఇతర సామ్రాజ్యవాదరాజ్యములు ప్రపంచమునంతను చాలవరకు తమ స్వాధీనములో పెట్టుకొన్నను, స్వప్రయోజనార్థ ముపయోగించుకొనుటకు దేశములు తక్కువగా నున్నను, కష్ట

పడి పనిచేసి ఆత్మ – శిక్షణ నలవరుచుకొని జర్మనీ పారిశ్రామిక ధన తత్వ యుగములో బలాఢ్యమగు దేశమైనది; సమర్థమగు దేశమైనది. ప్రతిరేవులోను దాని వర్తకనావలు దృష్టిగోచర మగుచుండెను. దాని సొంతరేవుపట్టణములైన హాంబర్గు, బ్రిమెన్‌లు ప్రపంచమందలి ఉత్తమరేవులలో గణనకు వచ్చినవి. జర్మనువర్తక నౌకాసమూహము దూరదేశములకు జర్మను సరుకును తీసికొని పోవుచుండెను. అంతే కాదు. ఇతరదేశముల రవానా – వర్తకమును కూడ స్వాధీనము చేసికొనెను.

నూతన సామ్రాజ్యదేశమగు జర్మనీ ఇట్లుకార్యసిద్ధి చెందినదై ఆత్మబలమును గుర్తెరిగినదై, ఇంకను తా నభివృద్ధిచెందుటకున్న అడ్డంకులను చూచి మండిపడుచున్న దనిన ఆశ్చర్యమేమి? జర్మన్ సామ్రాజ్యమునకు నాయకదేశము ప్రష్యా. ప్రష్యకా భూస్వామియు, అధికారములోనున్న సైనికతరగతియు వినయసంపన్నులని ఎన్నడును పేరు పొందలేదు. వారు కలహశీలము కలవారు. క్రూరముగా సంచరించుట వారికి గర్వకారణము. తమదే న్యాయపక్షమని నొక్కిచెప్పు స్వభావముగల కైజర్ విల్ హెల్ము II చక్రవర్తి, హోహెన్‌జోలెరిన్ వంశమునకు చెందినవాడు, వారికి ఆదర్శప్రాయుడగు నాయకుడయ్యెను. జర్మనీ ప్రపంచనాయకత్వము వహించబోవుచున్నదనియు, ప్రపంచమున దాని కొకస్థానము కావలెననియు, దాని భవిష్యత్తు సముద్రముపై ఆధారపడియున్నదనియు, దాని (కూల్టూర్) సంస్కృతిని ప్రపంచమందంతట వ్యాపింపజేయుట దాని ప్రధానకార్యమనియు, కైజరు పోయినచోటెల్ల చాటించసాగెను.

ఇటువంటిమాటలు ఇదివరలో ఇతరులు, ఇతరజాతులు చెప్పియుండెను. ఇంగ్లాండుయొక్క "శ్వేతమానవుని భారము," ఫ్రాంసుయొక్క "నాగరికత కలుగజేయు కార్యము," జర్మనీయొక్క "కూల్టూర్" — ఈ తరగతికి చెందిన మాటలే. ఇంగ్లాండు సముద్రము

పై. సంపూర్ణాధికారము వహించినట్లు చెప్పుకొనుచుండెను; నిజము కూడ అంతే. పలువురు ఇంగ్లీషువారు ఇంగ్లాండు పక్షమున తమదని వాదించు ప్రతివిషయమును, కైజరు మోటుగా, డంబముతో జర్మనీ పక్షమున చెప్పుచుండెను. తేడా ఏమనగా ఇంగ్లాండున కవి యున్నవి. జర్మనీకి లేవు. అయినను కైజరు గర్వోక్తులు బ్రిటిష్‌వారి కమితముగా కోపము కలిగించెను. ఏ యితరజాతియైనను తాను ప్రపంచమున నాయకత్వము వహించవలెనని యూహించుచున్నదన్న భావము సైతము బ్రిటిషువారికి కంటగింపుగా నుండెను. అది ధర్మవిరుద్ధమని వా రూహించుచుండిరి. తామే నాయకజాతియని బ్రిటిషువారు తలచుచుండిరి. గాన అట్లుచెప్పుట వారిని ప్రతిఘటించుటయే యగును. సముద్రమువిషయమున — 100 సంవత్సరములకుపూర్వము ట్రఫాల్గర్ వద్ద బ్రిటిషువారు నెపోలియన్‌ను ఓడించినప్పటినుండియు సముద్రము వారి కాణాచి యని వారు భావించుచుండిరి. కాన అది కాదనుట జర్మనీకి కాని, ఇతరజాతికిగాని మిక్కిలి అనుచితమని ఇంగ్లీషువారి తలంపు. సముద్రముపై వారు ప్రబలముగా నుండకున్నట్లయితే సుదూరవ్యాప్తమగు వారి సామ్రాజ్యము ఏమికావలసినది?

కైజరు సవాళ్లను, బెదిరింపులను సబబుగాలేవు. ఇంతకన్న తప్పుడుపని. ఈమాటలు పలుకుచునే కైజరు తననౌకాదళమును వృద్ధి చేసెను. దీనితో పూర్తిగా బ్రిటిష్‌వారికి కోపమూ వచ్చినది. బెదురూ పట్టుకొన్నది. వారుకూడ తమనౌకాదళమును వృద్ధిచేయ ప్రారంభించిరి. ఈవిధముగా వీరిద్దరికి నౌకావృద్ధివిషయమున తీవ్రస్పర్థ ఏర్పడెను. ఉభయదేశముల వార్తాపత్రికలు అధికముగా యుద్ధనౌకలు తయారు చేయవలెననుచు గోల చేయుచుండెను. ద్వేషములు రగుల్కొల్పుచుండెను.

యూరోపులో ఇదియొక ప్రమాదకరమగు రంగము. ఇంకను

నుండియు ప్రతిస్పర్థులే. 1870 వ సంవత్సరములో తాము పొందిన పరాభవస్మృతులు ఫ్రెంచివారి మనస్సులలో మెలగుచునేయుండెను. ప్రతీకారముచేయ వారు కలలు కనుచుండిరి. బాల్కనులలో అనేకులు ఆత్మప్రయోజనముల నాశించి ఒకరినొకరు ప్రతిఘటించుకొనుచు నుండిరి. ఎప్పుడును బాల్కనులు తుపాకిమందు పెట్టెవలెనే ఉండెను. పశ్చిమఆశియాలో తనపలుకుబడిని వృద్ధిచేసికొనుటకై జర్మనీ టర్కీతో స్నేహముచేయ ప్రారంభించెనుకూడ. బాగ్దాదును కాంస్టాంటినోపుల్ తోను, యూరోపుతోను కలుపుచు బాగ్దాదుకు రైల్వే నిర్మించుటకై సంకల్పింపబడెను. ఈసంకల్పము మిక్కిలి ఉచితమైనదే కాని ఈ బాగ్దాదురైల్వేను జర్మనీ తనవశమం దుంచుకొనగోరుటచే జాతులలో అనుమానములు పుట్టుకొనివచ్చెను.

క్రమక్రమముగా యుద్ధభయము యూరోపులో వ్యాపించెను. ఆత్మ రక్షణకై రాజ్యములు మైత్రిచేసికొనజొచ్చెను. పెద్దరాజ్యములు రెండు గుంపులుగా విడిపోయెను. జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీల రాష్ట్రత్రయ మైత్రి (Triple Alliance) ఇంగ్లాండు, ఫ్రాంసు, రష్యాల రాష్ట్రత్రయ మైత్రి (Triple Entente). రాష్ట్రత్రయమిత్రమండలిలో ఇటలీ ఉదాసీనముగా నుండెను. తుదకు అది మాటతప్పి ఎదిరిపక్షములో చేరెను. ఆసియా శిథిలావస్థలోనున్న సామ్రాజ్యము. పటములో చూచుటకు పెద్దదేకాని అంతైకమత్యములేదు. దానిరాజధాని వియన్నా. ఈనగరము, శాస్త్రసంగీతకళలకు కేంద్రము. ఇట్లు రాజ్యత్రయ మిత్రమండలి అనగా క్రియకు జర్మనీ అన్నమాట. కాని తరుణము తటస్థించినప్పుడు ఇటలీ, ఆస్ట్రియాలు ఎట్లు సంచరించునో ఎవ్వరికిని తెలియదు.

ఇట్లు యూరోపును భయముపట్టుకొని పీడించుచుండెను. భయమొక ఉగ్రస్వరూపము. ప్రతిదేశమును యుద్ధమునకు సిద్ధపడుచు, సాధ్యమైనంతవరకు ఆయుధాదుల సేకరించుకొనుచు పోయెను. యుద్ధ సామగ్రి సేకరణవిషయమున పోటీ జరుగుచుండెను. ఇందు వింత

ఏపనగా ఒకదేశము తనయుద్ధసామగ్రిని వృద్ధి చేసికొన్నచో మిగత దేశములుకూడ అట్లే చేసితీరవలసివచ్చెను. తుపాకులు, యుద్ధనౌకలు, మందుగుండుసామగ్రి, ఇతర యుద్ధసామగ్రి తయారుచేయు పెద్ద ప్రయివేటు వర్తకకూటములు లాభములపై లాభములు కొట్టుచుండిరి. బలిసిపోవుచుండిరి. అంతేకాదు. ఇంకను వారు ముందుకు పోయిరి. 'ఇదిగో యుద్ధము', 'అదిగో యుద్ధము' అని పుకార్లు పుట్టించుచు, తమవద్దనున్న ఆయుధము లధికముగా దేశములు కొనునట్లు చేయుచుండిరి. ఇట్టి యుద్ధసామగ్రి తయారుచేయు వర్తకకూటములు మిక్కిలి భాగ్యవంతమైనవి: బలవంతమైనవి. పెద్దపెద్ద ఉద్యోగులకును, ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీ, ఇతరదేశముల మంత్రులకును వానిలో వాటాలుండెను. కాన వారు వానిశ్రేయస్సు కోరుచుండిరి. యుద్ధసామగ్రి తయారుచేయు కూటమునకు లాభము యుద్ధ పుకార్లవల్లను, యుద్ధములవల్లను వచ్చును. ఆశ్చర్యకరమగు విషయ మిది. అనేక ప్రభుత్వముల మంత్రులును, ఉద్యోగులును ఆర్థికముగా యుద్ధమన్న ఇష్టము చూపుచుండిరి; వివిధదేశములచే యుద్ధముపేర వ్యయము చేయించుట కీకూటములు అనేక ఉపాయములను వెదకుచుండిరి. వార్తాపత్రికలను వాడుకొని, ప్రజాభిప్రాయములను తమ కనుగుణముగా మార్చుచుండిరి. గవర్నమెంటు ఉద్యోగులకు లంచము లిచ్చి ప్రజలలో నుద్రేకము పుట్టించుటకై తప్పుడు వదంతులను వ్యాపింప జేయుచుండిరి. ఇతరుల చావులకై బ్రదుకు ఈ యుద్ధసామగ్రి పరిశ్రమ ఎంతటి ఘోరమైనదో; తాము లాభములు చేసికోవచ్చునను ఉద్దేశముతో యుద్ధభయములను పుట్టించి, పోషించుటకు వెనుదీయని ఈ పరిశ్రమ ఎంతటి ఘోరమైనదో; 1914 సంవత్సరయుద్ధమును త్వరపెట్టుట కీ పరిశ్రమ కొంతవరకు సహాయపడినది. నేడుకూడ ఈ ఆటనే ఇది ఆడుచున్నది.

ఈ యుద్ధప్రసంగములో, శాంతికొరకు చేసిన ఒక వింత ప్రయత్నమునుగూర్చి నీకు చెప్పవలయును. రష్యాకురాజైన నికొలాస్

II పెద్దరాజ్యముల కొకసూచన చేసెను — ప్రపంచమున శాంతిని పాదు కొల్పుటకు వారు సమావేశము కావలెనని. ఈ జారే తనసామ్రాజ్య ములో తలయెత్తిన స్వేచ్ఛగోరు ఉద్యమముల నన్నింటిని అణచి వేయుచు, తననేరస్థులతో సైబీరియాను నింపివేయుచున్న ప్రముఖుడు! అతడు శాంతినిగురించి ప్రసంగించుట పరిహాసాస్పదముగా కనిపించు చుండెను. కాని బహుశా అతడు సద్భావముతోనే ఆపని చేసియుండును. అతనిదృష్టిలో శాంతిఅన్న వర్తమానపరిస్థితు లట్లే ఉండిపోవుట, అతని నిరంకుశత్వము అట్లే చెల్లుచుండుట. అతని ఆహ్వానఫలితముగా, హాలెండులోని హేగులో 1899, 1907 సంవత్సరములలో రెండు శాంతి సమావేశములు జరిగెను. ఈ సమావేశములవల్ల కించిత్ప్రయోజన మును లేకుండెను. శాంతియనునది ఉన్నట్లుండి ఆకాశమునుండి ఊడి పడు వస్తువుకాదు. ప్రమాదమునకు మూలమైన కారణములను తొలగించి నప్పుడే అది రాగలదు.

పెద్దరాజ్యములయొక్క అన్యోన్యస్పర్థలగూర్చియు, భీతుల గూర్చియు నీకు సవిస్తరముగా చెప్పియుంటిని. చిన్న, పేదజాతు లుపేక్షింపబడెను — మాట వినని తప్ప యూరోపులో ఉత్తరమున కొన్ని చిన్నరాజ్యము లున్నవి. పెద్దరాజ్యములవలె నవి దురాశాపూరిత ములు కావు. దేశముల కబళించువృత్తి వానికిలేదు. కాన వానినిగూర్చి కొంత విచారింతము. అవి స్కాండినేవియా లోని నార్వే, స్వీడన్ రాజ్యములును, వానికి దక్షిణముననున్న డెన్మార్కు రాజ్యమును. ఆర్కి టిక్ మండలములకవి దూరముగాలేవు. అవి శీతలప్రదేశములు కాన అచ్చటిబ్రదుకు కష్టముగానే ఉండును. కొద్దిజనసంఖ్యను మాత్రమే అవి పోషించగలవు. పెద్దరాజ్యములను పీడించు ద్వేషము, ఈర్ష్య, స్పర్థల వలయమునకు బయటనుండుటచే నవి ప్రశాంతముగా జీవించుచు, నాగరీకపద్ధతుల ననుసరించి తమ శక్తిసామర్థ్యముల వినియోగించు కొనుచుండెను. శాస్త్రమచ్చట వికసించెను. చక్కని సారస్వతము

లచ్చట అభివృద్ధిచెందినవి. 1905 వరకు నార్వే స్వీడనులు కలిసి ఒక రాజ్యముగా నుండెను. ఆ ఏట విడివడుటకు నార్వే నిశ్చయించెను. ప్రత్యేకముగా తనబ్రదుకు తాను బ్రదుకవలెనని కోరెను. కాన నార్వే స్వీడనులు శాంతముగా విడిపోవుటకు నిశ్చయించుకొనిరి. నాటి నుండియు అవి ప్రత్యేక స్వతంత్రరాజ్యములుగా నున్నవి. అవి యుద్ధములోనికి దిగలేదు. ఒకదాని నింకొకటి బలవంతము చేయలేదు. రెండుదేశములును ఇరుగుపొరుగున స్నేహముగా ఉంటున్నవి.

పెద్దరాజ్యములకు చిన్నరాజ్యములకు మార్గదర్శకముగా నుండుటకై చిన్నరాజ్యమైన డెన్మార్కు తన సైన్యదళమును, నౌకాదళమును రద్దుచేసికొనెను. అది రైతులజాతి. చిన్నరైతుల దేశము. ధనవంతులకు, పేదవారికి అంతర మచ్చట అధికముగాలేదు. ఇట్టి సమానత్వమునకు ముఖ్యకారణ మచ్చట యభివృద్ధినందిన సహకారోద్యమమే.

కాని యూరోపులోని చిన్నరాజ్యము లన్నియు డెన్మార్కువలె ధర్మసంపన్నములుకావు. హాలెండు చిన్నరాజ్యమైనను తూర్పు ఇండీసులో (జావా, సుమిత్ర. మొ.) పెద్దసామ్రాజ్యమును పాలించుచుండెను. దాని తరువాత బెల్జియం, ఆఫ్రికాలోని కాంగోను స్వప్రయోజనార్థము వినియోగించుకొనుచున్నది. యూరోపియన్ రాజకీయములలో దాని ప్రాధాన్యము దాని ఉనికినిబట్టి వచ్చుచున్నది. ఫ్రాంసు జర్మనీలమధ్య రస్తాలో అది యున్నది. ఈ దేశములు యుద్ధమునకు దిగినప్పుడు తప్పనిసరిగా నది యుద్ధములోని కీడ్వబడుట నిశ్చయము. బెల్జియంలోని బ్రస్సెల్సుకు సమీపమున వాటర్‌లూ ఉన్నమాట నీకు జ్ఞాపకమున్నదా? ఈ కారణముచేతనే బెల్జియంకు "యూరోపుయుద్ధభూమి" (Cockpit of Europe) అని పేరువచ్చినది. యుద్ధము సంభవించినప్పుడు బెల్జియం తాటస్థ్యమును మన్నించవలసియుండునని ప్రధానమగు పెద్దరాజ్యములు అంగీకారము చేసికొనెను. కాని, ఈ అంగీకారము, ఈ వాగ్దానముకూడ యుద్ధమే సంభవించినప్పుడు పటా

పంచలై పోయినవని ముందుముందు చూడగలము.

యూరోపులోగాని, ఇతరచోట్లగాని ఉన్న చిన్నరాజ్యములన్నిటిలోను మిక్కిలి పేచీకోరువి బాల్కనులలో నున్నవి. అచ్చట జాతులు, తెగలు కలగూరగంపగా ఉన్నవి. తరతరములనుండి వచ్చు వైరములతో. స్పర్ధలతో ఒకరినొకరు ద్వేషించుకొనుచు, ఒకరితోనొకరు పోరాడుకొనుచు ఉండిరి. 1912, 1913 సంవత్సరములలో జరిగిన బాల్కన్ యుద్ధములు చెప్పరానంత రక్తపాతము కలిగించినవి. కొద్దికాలములో, కొద్దిప్రదేశములో అమితమగు నష్టములు కలిగినవి. వివాసులును, వెన్నిచ్చిపారిపోవువారును అగు టర్కులను బల్గేరియనులు ఘోరహింసల పాలు చేసిరి. ఇంతకుముందు సంవత్సరములలో టర్కుల క్రూరకృత్యములుకూడ ఘోరముగానే ఉండెను. సెర్బియా (ఇప్పుడిది యూగోస్లావియాలోభాగము) హత్యలవిషయమున మిక్కిలి చెడ్డపేరు సంపాదించెను. దేశభక్తులమని పేరుపెట్టుకొని రహస్య హంతకులముఠా "బ్లాక్ హేండ్" (నల్లచెయ్యి) అను పేరుతో ఎన్నో దారుణమగు వింతహత్యల చేసెను. అందలి సభ్యులలో ఉన్నత ప్రభుత్వోద్యోగులు పలువు రుండిరి. ఆ దేశరాజు అలెగ్జాండరును, రాణీ డ్రాగాయును, రాణీ సోదరులతో, ప్రాధానితో, ఇంకను ఇతరులతో అసహ్యమగువిధమున హత్యచేయబడిరి. ఇది వగరు విప్లవము మాత్రమే. వేరొకడు రాజుగా చేయబడెను.

ఇట్లు 20 వ శతాబ్ది, ఉరుములతో మెరుపులతో యూరోపు వాతావరణమున ప్రవేశించెను. ఏటేట తుపాను ప్రబలమగుచుండెను. నానాటికి చిక్కులు పెరుగుచుండెను. యూరోపుజీవితమంతయును ముడులుపడుచుండెను. ఈ ముడులను చివరకు యుద్ధము తెగగొట్ట వలసియుండెను. రాజ్యములన్నియు యుద్ధమువచ్చునని ఎదురు చూచుచుండినవి. ఉద్రేకముతో అందుకై తయారగుచుండినవి. కాని ఎవరికిని యుద్ధము రావలెనని లేదు. వచ్చినయెడల యుద్ధఫల మె

ఋ్లండునో ఎవ్వరును నిష్కర్షగా చెప్పలేరు గాన కొంతవరకు యుద్ధాగమనమునకు వారందరు వెరచుచుండిరి. మరల ఈ వెరపే వారిని యుద్ధములోనికి త్రోయుచున్నది. నేను చెప్పితినిగదా! యూరోపులో రెండుపక్షముల రాజ్యములు ఒకరి కొకరు ఎదురుతిరిగి నిలుచుండిరి. "సమబలస్థితి" (Balance of power) అందురు దీనినే. ఇది చాల సున్నితమైన 'సమస్థితి' (Balance). చిన్నత్రోపుతో ఇది తలక్రిందు లగును. యూరోపుకు దూరముగా నున్నప్పటికిని, అచ్చటి స్థానిక సమస్యలలో తనకు ప్రసక్తిలేకున్నను, యూరోపుమిత్రమండలిలోను, "సమబలస్థితి"లోను జపాను భాగస్వామియై యుండెను. ఎందుకన జపాను ఇంగ్లాండుకు మిత్రము. తూర్పుదేశములలోను, ముఖ్యముగా ఇండియాలోను, ఇంగ్లీషుల క్షేమము సంరంక్షించుట ఈ మైత్రి అభిప్రాయము. ఆంగ్ల – రష్యన్ స్పర్థలు రేగుచున్న రోజులలో ఈ మైత్రి జరిగినది. ఇప్పుడు ఇంగ్లాండు రష్యాలు ఒకపక్షమందే యున్నను ఈ మైత్రి నిలిచియే యున్నది. యూరోపియనుల మైత్రులకు, సమస్థితులపద్ధతికి దూరముగానున్న పెద్దరాజ్య మొక్క అమెరికాయే.

1914 లో పరిస్థితు లిట్లుండెను. ఈ కాలమున ఇంగ్లాండు, ఐర్లాండులో హోంరూలుబిల్లు విషయమై చిక్కులలో తగులుకొని యుండెనన్న సంగతి మీకు జ్ఞాపక ముండును. అల్‌స్టర్ తిరుగుబాటు చేయుచుండెను. ఉత్తరమునను, దక్షిణమునను స్వచ్ఛందభటులు కవాతు నేర్చుకొనుచుండిరి. ఐర్లాండులో అంతఃకలహము పుట్టునని చెప్పుకొనుచుండిరి. యూరోపియన్ యుద్ధము తటస్థించిన పక్షమున, ఐర్లాండులోని చిక్కులలో నిమగ్నమై ఇంగ్లాండు కలుగజేసికోదని జర్మన్ ప్రభుత్వము భావించి యుండవచ్చును. నిజమునకు, యుద్ధము తటస్థించిన పక్షమున ఫ్రాంసుతో చేరుటకు ఇంగ్లాండు ప్రభుత్వము లోపాయికారీగా సమ్మతించి యుండెను. అది ఎవ్వరికిని వెల్లడి కాలేదు.

జూన్ 28, 1914 – ఈ తేదీని నిప్పు తగిలెను, జ్వాలలు లేచెను. ఆస్ట్రియన్ సింహాసనమునకు ఆర్చిడ్యూక్ ఫ్రాంసిస్ ఫెర్డినాండు వారసు. బాల్కనులలోనున్న బోస్నియా రాజధాని యగు సరజీవోను చూచుటకు అతడు వెళ్లెను. కొద్ది సంవత్సరములకు పూర్వమే, తమ సుల్తానును వదల్చుకొనుటకు యువ – టర్కులు ప్రయత్నించుచున్నప్పుడు, ఈ బోస్నియాను ఆస్ట్రియా తన దేశములో కలుపుకొన్నదని ఇదివరలో చెప్పియుంటిని. ఆర్చిడ్యూకు తన భార్య తన ప్రక్కనే కూర్చుండియుండగా, సరజీవో వీధుల వెంబడి, అనాచ్ఛాదితశకటమున నాసీనుడై పోవుచుండగా నతడు తుపాకితో కాల్చబడెను. అతడును అతనిభార్యయు హత్య చేయబడిరి. ఆస్ట్రియా ప్రభుత్వమును, ప్రజలును కోపోద్రిక్తులైరి. ఈ హత్యలో ప్రమేయమున్నదని సెర్బియన్ ప్రభుత్వముపై నేరము మోపిరి (సెర్బియా పొరుగుననే బోస్నియా ఉన్నది). సెర్బియన్ ప్రభుత్వము తనకు ప్రమేయము లేదనెను – అది సహజమే. చాలకాలముపిమ్మట చేసిన వాకబులనుబట్టి చూచిన, సెర్బియన్ ప్రభుత్వమునకు, హత్యవిషయమున బాధ్యతలేకున్నను, అందుకై చేయుచున్న ప్రయత్నములు దానికి పూర్తిగా తెలియవని చెప్పుటకు వీలులేదు. హత్యకు చాలవరకు బాధ్యత సెర్బియన్ "నల్లచేయి" సంస్థదే.

కోపము కొంత, రాజనీతి అధికముగా ప్రేరేప ఆస్ట్రియాప్రభుత్వము సెర్బియావిషయమున ముష్కరముగా ప్రవర్తించెను. ఇంక ఎన్నడు తలయెత్తకుండ సెర్బియాను అణగద్రొక్కుటకు అది నిశ్చయించెను. పెద్దయుద్ధమే సంభవించిన ప్రబలమగు జర్మనీసహాయ ముండునని అది ఆశించెను. కాన సెర్బియా చెప్పుకొన్న క్షమాపణలను ఆస్ట్రియా అంగీకరించలేదు. జూలై 23, 1914 తేదీని ఆస్ట్రియా సెర్బియాకు తన అంతిమవిజ్ఞ యమును తెలియజేసెను. అయిదు దినములపిమ్మట జూలై 28 తేదీని సెర్బియాపై ఆస్ట్రియా యుద్ధము ప్రకటించెను.

యుద్ధోన్మాదియగు అవివేకి, గర్వియగు మంత్రిచే ఆస్ట్రియన్ రాజనీతి నడుపబడుచుండెను. ముసలిచక్రవర్తి ఫ్రాంసిస్‌జోసెఫ్‌సు (ఇతడు 1848 నుండియు ఆస్ట్రియాసింహాసనాధిష్ఠితుడై యుండెను) ప్రేరేపి అంగీకరింపజేసిరి. సహాయవిషయమున జర్మనీచేసిన అర్ధ వాగ్దానమును పూర్తి అభయముగా అర్థము చేసికొనిరి. నిజమునకు, అప్పుడు ఆస్ట్రియాతప్ప ఇతరపెద్దరాజ్యము లొక్కటియు యుద్ధమునకు తొందరపడుట లేదు. జర్మనీ సంసిద్ధముగా నున్నను, కలహమునకు కాలుదువ్వునదై యున్నను, అప్పుడు ఆత్రుతతో లేదు. కైజరు విల్‌హెల్మ్ II యుద్ధమును నివారించుటకు అర్ధాంగీకారముతో ప్రయత్నించెనుకూడ. ఇంగ్లాండు, ఫ్రాంసులు కూడ ఆత్రుతతో లేవు. రష్యన్‌ప్రభుత్వ మనగా జారన్నమాట. ఇతడు దుర్బలుడు; అవివేకి. దుర్మార్గులను వివేకహీనులను ఎన్నుకొని తనచుట్టూ పెట్టుకొనెను. అతనికి వా రెంతచెప్పిన అంత. ఇతగాని చేతిలో లక్షలకొద్ది జనుల అదృష్టము నిలిచియుండెను. అతనిమట్టుకతడు యుద్ధము విషయమున విముఖుడే. కాని అతని సలహాదారులు ఆలస్యము చేసిన ప్రమాదము వచ్చునని భయపెట్టిరి. సేనసమకూర్పు సన్నాహములు చేయించుటకు సమ్మతింపజేసిరి. "సేనల సమకూర్చుట" అనగా యుద్ధరంగమున పనిచేయుటకు సేనలను పిలుచుట. పెద్దదేశమగు రష్యాలో ఇందుకై కొంతకాలము పట్టును. జర్మనులు తమపై పడుదురేమో యన్న భీతి బహుశా సేనలసమకూర్పును తొందర జేసియుండును. సేనల సమకూర్చుచున్నట్లు వార్త — ఇది జూలై 30న జరిగినది — జర్మనీని భయపెట్టెను. సేనలసమకూర్పు నిలుపుజేయవలసినదని జర్మనీ నొక్కిచెప్పెను. కాని ఇప్పుడు బృహత్‌యుద్ధయంత్రమును ఆపుటకు కుదరదు. రెండు దినముల తర్వాత ఆగస్టు 1వ తేదీని జర్మనీ తనసేనలను సమకూర్చి రష్యా, ఫ్రాంసులపై యుద్ధమును ప్రకటించెను. వెనువెంటనే పెద్ద జర్మన్‌సేనలు బెల్జియంపై దాడివెడలెను. దానిగుండా ఫ్రాంసుకు

పోవుట సులభము కాబట్టి అట్లు చేసెను. పాపము బెల్జియం జర్మనీకి అపకారము చేయలేదు. కాని జాతులు చావో బ్రదుకోయని యుద్ధమునకు దిగినప్పుడు ఈ చిన్నవిషయములను గణించవు. చేసిన వాగ్దానములను గణించవు. బెల్జియంద్వారా తనసేనలను నడిపించుకొని పోవుటకు జర్మనీప్రభుత్వము బెల్జియం అనుమతిని కోరెను. రోషముతో నట్టి యనుమతి నిచ్చుటకు బెల్జియం నిరాకరించుట సహజముకదా!

బెల్జియం తాటస్థ్యము ఇట్లు భగ్నపరచినందుకు ఇంగ్లాండులోను ఇతరదేశములలోను పెద్దగోల పుట్టెను. దీనిని పురస్కరించుకొని ఇంగ్లాండు జర్మనీపై యుద్ధమును ప్రకటించెను. నిజమునకు చాల కాలమునకుముందే ఇంగ్లాండు యుద్ధములో చేరదలచెను. బెల్జియం ఉదంతము మంచిసాకుగా దానికి దొరికెను. ఫ్రెంచిసైన్యము సైతము, అవసరమని తోచినప్పుడు, జర్మనీపై దాడిచేయుటకు, బెల్జియంగూడా తనసేనలను నడిపించుకొని పోవలెనని, యుద్ధమునకు పూర్వము నుండియు ప్లానులు వేసియున్నదని ఇప్పుడు తెలియవచ్చుచున్నది. ఏది ఎట్లున్నను ఇంగ్లాండు ధర్మము, సత్యము కాపాడు దేశమువలె నటించెను. జర్మనీబారి పడకుండ చిన్నజాతుల కాపాడు దేశమువలె నటించెను. జర్మనీ తానుచేసిన పవిత్రవాగ్దానములను చేసికొన్న సంధులకు "పనికిరాని కాగితపుముక్కల" క్రింద భావించినదని చాటించెను. ఆగస్టు 4 వ తేదీని అర్ధరాత్రివేళ జర్మనీపై ఇంగ్లాండు యుద్ధము ప్రకటించెను. కాని ఇంగ్లాండు ముందుజాగ్రత్త పడెను. తనసైన్యమును — బ్రిటిష్ దండయాత్ర సైన్యమును — రహస్యముగా, ఛానల్ మీదుగా, ఒకరోజుముందు, అనుకోనివిపత్తు సంభవించు నేమోఅని యూరోపుఖండము (ఫ్రాంసు)నకు పంపెను. ప్రపంచమింకను ఇంగ్లాండు యుద్ధములో చేరునా? మానునా యని తర్కించుకొనుచున్న సమయమున బ్రిటిష్‌సేన లప్పుడే యూరోపుఖండమును చేరుకొన్నవి.

ఆస్ట్రియా, రష్యా, జర్మనీ, ఫ్రాంసు, ఇంగ్లాండు - ఈదేశము

లన్నియు నిప్పుడు యుద్ధములో తగుల్కొనెను. చిన్నదేశమగు సెర్బియా ఈ యుద్ధమునకు కొంతవరకు సన్నిహితకారణ మగుటవల్ల నదియు తగుల్కొనెను. జర్మనీ, ఆస్ట్రియాల మిత్రమగు ఇటలీ మాట ఏమిటి? ఇటలీ తటస్థముగా నుండెను. ఏప్రక్క చేరిన అనుకూలముగా నుండునో కనిపెట్టుచుండెను. ఒడంబడికలు చేసికొనుటకు ప్రయత్నించెను. చివరకు ఆరుమాసముల తర్వాత ప్రాతమిత్రులకు వ్యతిరేకముగా, ఫ్రెంచి — ఇంగ్లీషు — రష్యన్ పక్షమును నిష్కర్షగా చేరెను.

ఇట్లు ఆగష్టు 1914 మొదటిరోజులలో యూరోపులో సేనలు సమకూడుచు, నడచిపోవుచు నుండెను. ఆ సేన లెట్టివి? ప్రాతరోజులలో సైనికవృత్తి నవలంబించినవారే సేనలలో నుండిరి. అవి శాశ్వత సైన్యములు. ఫ్రెంచివిప్లవానంతరము పరిస్థితులు మారెను. పరదేశస్థులు విప్లవము నెదిరింతురన్న ప్రమాదము కలిగినప్పుడు సామాన్య పౌరులను, అధికసంఖ్యాకులను, సేనలో చేర్చుకొని శిక్షనిచ్చిరి. నాటి నుండి పరిమితసంఖ్యగల సైన్యములకు బదులు — సైనికవృత్తికై స్వచ్ఛందముగాచేరిన సైనికులుగల సైన్యములకు బదులు — నిర్బంధ సేనలు ప్రవేశపెట్టుటకు యూరోపులో అభిప్రాయము పుట్టెను. నిర్బంధసేన అనగా దేశమందలి బలాఢ్యులగు పురుషు లందరినీ బలవంతముచేసి చేర్చిన సేనలు. కాబట్టి బలాఢ్యులగు పురుషుల సర్వతోముఖ సైనికసేవ ఫ్రెంచివిప్లవమునకు పుట్టిన బిడ్డ. యూరోపుఖండమందంతట నది వ్యాపించెను. అచ్చటి ప్రతియువకుడును రెండు సంవత్సరములలోనో, అంతకు పై బడియో క్యాంపులో సైనికశిక్షణ పొందవలెను. పిమ్మట, పిలిచినప్పుడు వెళ్లి యుద్ధములో పాల్గొని తీరవలయును. ఇట్లు యుద్ధరంగమున పనిచేయుట కేర్పడిన సైన్య మనగా — ఆదేశము యొక్క యువకులందరును అని అర్థము. ఫ్రాంసులో, జర్మనీలో, ఆస్ట్రియాలో, రష్యాలో ఇట్టి పరిస్థితులే ఉండెను. ఈ దేశములలో సేనలను సమకూర్చుట అనగా దూరగ్రామములందు, పట్టణములందు

నివసించు ఇట్టి యువకులను ఇండ్లను వదలి యుద్ధమునకు రమ్మని పిలుచుటయే. యుద్ధము ప్రారంభమైనప్పుడు ఇంగ్లాండులో ఇట్టి సర్వతోముఖయుద్ధసేవ లేదు. తనకున్న ప్రబలమగు నౌకాబలమును నమ్ముకొని ఇంగ్లాండు శాశ్వతస్వచ్ఛంద సైన్యమును మితముగా ఉంచుకొనెను. యుద్ధము జరుగుచుండగామాత్రము ఇతరదేశములతోపాటు ఇంగ్లాండును నిర్బంధసైనికసేవ ప్రవేశపెట్టెను. అనగా బలవంతముగా పురుషులను సేనలలో చేర్చుకొన మొదలుపెట్టెను.

సర్వతోముఖ సైనికసేవ అన్నప్పుడు దేశమంతయు యుద్ధమునకు సిద్ధమైనదని అర్థము. సేనలు సమకూడవలెనను ఆజ్ఞ ప్రతిపట్టణమునకు, ప్రతిపల్లెకు, ప్రతికుటుంబమునకు చెల్లును. యూరోపులో అధికభాగమందు, ఆగస్టు మొదటి రోజులలో జీవితవ్యవహారములన్నియు హఠాత్తుగా నిలిచిపోయెను. లక్షలాదియువకు లిండ్లను బాసిరి. తిరిగివచ్చు ఆశ వదలుకొనిరి. ప్రతిచోటను సైనికుల సంచారములు, ప్రయాణములు కానవచ్చుచుండెను. సైనికుల నుద్దేశించి చేయు జయజయధ్వానములు వినవచ్చుచుండెను. దేశభక్తి ప్రదర్శనము లమితముగా జరుగుచుండెను. అనురాగములు వెల్లివిరియుచుండెను. కొంత ఉల్లాసమును బొడగట్టుచుండెను. భవిష్యత్తులో సంభవించు ఘోరసంఘటనల నెవ్వరును అప్పుడు గుర్తెరుగకుండిరి.

ఇట్టి ఉద్రిక్తదేశభక్తి అందరిని ఆవరించెను. అంతర్జాతీయత యని బిగ్గరగా పలికిన సామ్యవాదులు (Socialists) ను, ప్రపంచ కార్మికులందరు ఏకమై తమ సమానశత్రువగు ధనికతత్వమును ఎదుర్కొనవలెనని చెప్పిన మార్క్సుసిద్ధాంతావలంబులును, సమస్తమును మరచి, గాఢదేశభక్తులక్రియ ధనికతత్వయుద్ధమున చేరిరి. కొందరు మాత్రము చలించలేదు. కాని అట్టివారు తూలనాడబడిరి: శపింపబడిరి. తరుచు శిక్షింపబడిరి. పలువురు శత్రువును తీవ్రముగా ద్వేషించిరి.

ఇంగ్లీషు, జర్మన్ కార్మికులొకరినొకరు చంపుకొనుచుండగా విద్వాంసులు, శాస్త్రజ్ఞులు, ఉభయదేశముల ఆచార్యులు, యుద్ధనిమగ్నులగు ఇతరదేశములవారు ఒకరి నొకరు శపించుకొనిరి. ఒకరిపై నొకరు ప్రకటించిన మిక్కిలి ఘోరవిషాద కధలను నమ్మిరి.

ఇట్లు యుద్ధాగమనముతో 19 శతాబ్ది యుగము అంతమునకు వచ్చెను. గంభీరముగా శాంతముగా ప్రవహించుచున్న పాశ్చాత్య నాగరికతయను నదిని హఠాత్తుగా యుద్ధమను సుడిగుండము మ్రింగివేసెను. ప్రాతప్రపంచము శాశ్వతముగా అంతరించెను. నాలుగు సంవత్సరముల తర్వాత ఆసుడిగుండమునుండి క్రొత్తవిషయమొకటి ఆవిర్భవించెను.

---

## 147

# యుద్ధప్రారంభమునకు ముమ్మందు ఇండియా

మార్చి 29, 1933

నీకు ఇండియానుగురించి వ్రాసి చాలకాలమయినది. ఈ విషయమునుగూర్చి నీకు వ్రాయవలెనని బుద్ధిపుట్టుచున్నది. యుద్ధప్రారంభమునకు ముమ్మందు ఇండియా ఎట్లున్నదో చెప్పదలచితిని.

19 వ శతాబ్దిలో ఇండియాలో బ్రిటిష్ పరిపాలననుగురించియు, ఇండియాలోని ప్రజల జీవితాంశములను కొన్నియు ఇదివరలో అనేక దీర్ఘలేఖలలో పరామర్శించియుంటిమి. ఈకాలమునకు సంబంధించిన ప్రధానవిషయము — ఇండియాపై బ్రిటిష్‌వారి పట్టు దృఢపడినట్లు కని

పించుట. తత్ఫలముగా ఇండియాను బ్రిటిషువారు స్వప్రయోజనములకై వినియోగించుకొనుచుండిరి. మూడుసైన్యముల సహాయముతో ఇండియాను బ్రిటిషువారణచిపెట్టి యుండిరి. ఈసైన్యము లిండియాను ఆక్రమించియుండెను. అవి యుద్ధసైనికుల సైన్యము, సివిల్ సైన్యము, వర్తక సైన్యము. బ్రిటిష్‌యుద్ధసేనలును, బ్రిటిష్ ఉద్యోగుల క్రింద పనిచేయునట్టియు, జీతముకొరకు పనిచేయునట్టియు ఇండియన్ సేనయును దేశము నాక్రమించియున్న పరదేశసైన్యమని తేటతెల్లమగుచున్నది. అంతకన్న గట్టిపట్టు సివిల్‌సర్వీస్‌ది. ఇది బాధ్యతలేని కేంద్రాధికార వర్గము (Centralised bureaucracy). ఇక మూడవసైన్యము వర్తకసైన్యము. మిగత రెంటిచే రక్షింపబడుచుండెను. ఇదియే అన్నిటికన్న మిక్కిలి ప్రమాదకరమైనది. ఇది దేశమును సంపూర్ణముగా స్వప్రయోజనమునకై వినియోగించుకొనుచున్నది. లేదా దీనిపేర అపని జరుగుచుండెను. మిగతసైన్యములు దేశమును స్వప్రయోజనమునకై వినియోగించిన మార్గములు స్పష్టముగా కానవచ్చుచుండును. వర్తకసైన్యమార్గములు గూఢముగా జరుగును. చాలకాలముపాటు, ఇప్పుడుసైతము, ప్రసిద్ధులగు భారతీయులు మొదటి రెండుసైన్యములు కూడవని ఆక్షేపించిరి. కాని మూడవదానికికూడ అంత ప్రాముఖ్యమున్నదని వారు గుర్తింపరైరి.

ఇండియాలో బ్రిటిష్‌వారి రాజనీతిలక్ష్యములలో సంగతమైనదొకటి కలదు. అది స్వార్థపరవర్గములను (Vested interests) సృష్టించుట. వారి సృష్టియే కాబట్టి అవి వారిపై ఆధారపడియుండును. వారి కవి ఇండియాలో మద్దతుగా నుండును. ఈ విధముగా, ఫ్యూడల్ రాజులు బలపరచబడిరి. పెద్దజమీందారీ తరగతియు, తాలూకాదారు తరగతియు సృష్టింపబడెను. మత విషయములలో కలుగచేసికొమనిచెప్పి సంఘముతో అంటకుండ, ముట్టకుండ బ్రిటిష్‌పాలకు లుండిరి. ఈ స్వార్థపరవర్గము లన్నియు, దేశమును స్వప్రయోజనార్థమై ఉప

యోగించువిషయమున అప్రమత్తులై యుండిరి. నిజమునకు ఇట్లు చేయుటవల్లనే వారు నిలిచియుండ గలిగిరికూడ. ఇండియాలో పెద్ద స్వార్థపరవర్గము బ్రిటిష్ పెట్టుబడివల్లనే సృష్టింపబడినది.

ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేటుగా పనిచేసిన, ఇంగ్లీషురాజకీయ వేత్తయగు, లార్డు సాలిస్‌బరీ చెప్పిన మాటలు తరచు ఉదహరించుట కద్దు. అవి ఈవిషయమును చక్కగా విశదీకరించుచున్నవి. కావున వానిని నీకొరకు ఈక్రింద ఉదహరించుచున్నాను. 1875లో అత డిట్లు చెప్పెను :

> "ఇండియానుండి రక్తముతీయుట అవసరము కాబట్టి, రక్తమే భాగములలోగూడ కట్టుకొని అధికముగా నుండునో అచ్చటికే కత్తిని పోనీయవలయును, లేదా చాలినంత రక్తమున్న భాగములకే పోనీయవలెను. రక్తవిహీనతచే దుర్బలముగానున్న భాగములకు పోనీయ రాదు."

బ్రిటిషువారు ఇండియాను ఆక్రమించుటవల్లను, అచ్చట వారవలంబించిన రాజనీతివల్లను వచ్చిన అనేకఫలితములలో కొన్ని వారికి ఇష్టమైనవి కావు. తాముచేసిన పనులకు వచ్చు ఫలితములనెల్ల వ్యక్తులే కట్టుబాటులో నుంచలేరు. ఇంక జాతులసంగతి చెప్పవలెనా? తరుచుగా కొన్నిపనులనుండి వచ్చుఫలితములలో ఆపనులనే వ్యతిరేకించునట్టియు, ఎదిరించునట్టియు, లొంగదీయునట్టియు నూతన శక్తులుండును. సామ్రాజ్య తత్వమువలన జాతీయత పుట్టును; ధనికతత్వమువలన ఫ్యాక్టరీలలో కార్మికసమూహములు చేరును. వారు ఏకమై ధనికులగు యజమానులతో పోరాడుదురు. ఒక ఉద్యమమును అణగద్రొక్కవలెననియు, ప్రజలను పీడించవలెననియు ఉద్దేశించి ప్రభుత్వము ప్రయోగించు దమన నీతినుండి యదార్థముగా వచ్చుఫలితము — వారికి బలముపోయుట, వారిని దృఢసంకల్పులనుగా చేయుట, చివరకు వారు జయము సాధించు

బ్రిటిష్‌వారి పారిశ్రామిక వైఖరివలన ప్రజలు వృత్తులులేక అధికముగా పట్టణములను వదలి గ్రామములకు తరలిపోవలసి వచ్చెను. భూమి సహించవలసిన భారము పెరిగెను. రైతుల పొలము లింకను చిన్నవి కాజొచ్చెను. రైతుల పొలములు పెద్దవి కాకుండుటవలన జీవితావసరములకు సరిపోయిన కనీస ఆదాయమునుసైతము అవి ఈయ లేకుండెను. కాని రైతుకు అన్యమార్గము లేదు. నాటికినాడు అప్పుల పాలగుచు అతడా పొలములతోనే కాలక్షేపము చేయవలెను. బ్రిటిషు వారు భూమివిషయమున అవలంబించిన పద్ధతి, ముఖ్యముగా తాలూకాదారీ. జమీందారీ ప్రదేశములలో, పరిస్థితులను మరింత పాడుచేసెను. ఇట్టి ప్రదేశములందును, రైతులే భూమికి యజమానులుగానున్న ప్రదేశములందును గవర్నమెంటుకు శిస్తు చెల్లించనప్పుడు గాని, జమీందారులకు పన్ను చెల్లించనప్పుడు గాని రైతులను వారి పొలములనుండి వెడలగొట్టుచుండిరి. ఇందులకు ఫలితముగాను, భూమికొరకై క్రొత్తగా వచ్చిన వారి నిరంతరమగు ఒత్తిడి ఫలితముగాను, పల్లెప్రాంతములలో "భూమిలేని కూలివారు" సంఖ్య పెరిగెను. నే నిదివరలో చెప్పినట్లు భయంకరమగు క్షామములు అనేకము సంభవించెను.

భూమినుండి తొలగింపబడినవా రనేకు లుండిరి. సేద్యము చేయుటకు భూమి దొరకునా? యని వారు తహతహలాడుచుండిరి. కాని అందరికిని సరిపోవునంత భూమి లేదు. జమీందారీ ప్రదేశములలో భూమికామందులు ఇదే సందని పన్నులు వృద్ధిచేసిరి. రైతుల సంరక్షణ కొరకు కొన్ని కౌలుపరిష్కారచట్టములు చేయబడెను. వానిప్రకారము కొంత ప్రమాణమును మించి, హఠాత్తుగా పన్నులను పెంచరాదు. కాని అనేకమార్గములుగా ఈ చట్టమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నించిరి. చట్టబద్ధముకాని అన్యాయపుపన్ను లనేకము వసూలు చేయబడుచుండెను. ఔధ్(అయోధ్య) తాలూకాదారీ యెస్టేటులో ఇట్టి అన్యాయపు పన్నులు ఏబదిరకములు వసూలుచేయుచున్నట్లు నేనొకమారు విన్నాను.

ఇంకు ముఖ్యమైనదానికి 'నజ్‌రానా' అనిపేరు. తొలుదొల్త రైతు ఒకవిధమగు పారితోషికముగా దీనిని చెల్లించును. బీదరైతు లెట్లీ పవిధరకముల పన్నులు చెల్లించగలరు? బనియా (గ్రామఋణదాత) నుండి బదులుతీసికొని వారు చెల్లించగలరు. తిరిగి ఇచ్చుటకు సామర్థ్యము లేనప్పుడును, సందర్భములేనప్పుడును బదులుతెచ్చుట అవివేకమే. కాని పేదరైతు ఏమి చేయగలడు? ఏ మూలను అతనికి ఆశలేదు. అతడు పొలమును ఏమివచ్చినను దున్నకోరును. ఏదోఒక లాభమురాగలదని అడియాశ పెట్టుకొనును. ఇందుకు పర్యవసాన మేమనగా అప్పు తెచ్చుకొన్నప్పటికిని తరుచు రైతు భూస్వామి బాకీలను చెల్లించలేకపోవుట, భూమినుండి తొలగింపబడుట, భూమిలేని కూలీల జాబితాలో చేరుట.

భూమికియజమానియగు రైతును, రైతును, భూమిలేని కూలివారనేకులను "బనియా" చేతులలో చిక్కియున్నవారే. వారెన్నడును ఋణవిముక్తులు కానేరరు. కొంత ఆదాయము వచ్చినప్పుడెల్ల కొంత ఋణము తీర్చుదురు. కాని ఇది వడ్డీకి సరిపోవును. ప్రాత అప్పు అట్లే నిలిచియుండును. అనేక విధములుగా "బనియా" అతనిని పీడించుచుండును. అతనిని నిరోధించువా రెవరునులేరు. చివరకు వారు అతనికి దాసులుగా బద్ధులగుదురు. పేదరైతు ఒకవిధముగా దాసు డిద్దరికి — జమీందారుకును, బనియాకును.

ఇట్టి పరిస్థితులు చిరకాలము నిలువజాలవు. రైతులు తమబాకీలను ఎంతమాత్రమును ఇచ్చుకోలేని కాలమును, బనియాలు ఇంకను ధనము నప్పుగా ఇచ్చుటకు నిరాకరించు కాలమును, జమీందారులు సైతము చితికిపోవు కాలమును వచ్చును. ఈ పద్ధతిలోనే క్షయబీజములు, అస్థిరత్వబీజములు ఇమిడియున్నవి. భూవిషయమై దేశమందంతటను ఈమధ్య సంభవించిన అల్లరులనుబట్టి చూచిన ఈ పద్ధతి బీటలువారుచున్నదనియు, చిరకాల ముండజాలదనియు తోచుచున్నది.

బహుశా వెనుకటి ఒక జాబులో, వేరువిధముగా చర్చించిన విష యములే ఈ జాబులో మరల చెప్పుచున్నాను. ఇండియా అన్నప్పుడు లక్షలాది ఇట్టి దురదృష్టవంతులగు వ్యవసాయదారులే కాని, మధ్యతర గతి కొద్దిప్రజలు కారని నీవు గ్రహించవలె ననియే నా కోరిక.

భూమినుండి తొలగింపబడుటచే భూమిలేక కూలిపనులు చేసి కొనువా రధికముగా నుండుటవల్లనే పెద్దఫాక్టరీలు సులభముగా లేచుట జరిగినది. కూలిపనిచేయుటకు సిద్ధముగా తగినంతమంది (అవసరముల కధికముగా) ఉన్నప్పుడే అట్టి ఫాక్టరీలు నడిపించుటకు సాధ్యపడును. ఏ కొద్దిభూమి ఉన్నవాడైనను దానినివదలడు కదా? ఫాక్టరీపద్ధతి అవిచ్ఛి న్నముగా నడుచుటకు భూమిలేక, ఉద్యోగములేక అల్లాడు వా రనేకు లుండుట అవసరము. ఇట్టి వా రెంత అధికముగా నున్న ఫాక్టరీయజ మాను లంత సులభముగా కూలిని తగ్గించవచ్చును. కూలినిర్ణయము తమచేతులలో నుంచుకోవచ్చును.

సరిగా ఈ కాలమునందే — ఇదివరలో నీకు చెప్పియుంటినను కొందును — ఇండియాలో ఒక నూతనమధ్యతరగతి క్రమముగా తల యెత్తెను. కొంతధనము పెట్టుబడికై అది సేకరించెను. ధనమా ఉన్నది, కూలివాండ్రా ఉన్నారు, కాన ఫలితము ఫాక్టరీలు లేచుట. కాని ఇండియాలో పెట్టుబడిపెట్టిన విశేషధనము పరదేశపు (బ్రిటిష్) వారిది. పై ఫాక్టరీలను బ్రిటిష్ ప్రభుత్వము ప్రోత్సహించలేదు. బ్రిటిష్ వ్యవహారపద్ధతి కీ ఫాక్టరీలు వ్యతిరేకముగా నుండెను. ఇండియాను పూర్తిగా వ్యవసాయదేశముగా నుంచవలెననియు, అది ముడిపదార్థము లను ఇంగ్లాండుకు సరఫరా చేయుచుండవలెననియు, వారు తయారు చేసిన సరుకు నది కొనుచునుండవలెననియు బ్రిటిష్‌వారి ఉద్దేశము. కాని పైని నేను సూచించించిన పరిస్థితు లెట్లున్నవనగా ఇండియాలో పెద్దయంత్రముల తయారుచేయుట ప్రారంభము కావలెను. బ్రిటిష్ ప్రభుత్వము దీనిని సులభముగా ఆటంకపరచజాలదు. ప్రభుత్వ మం

గీకరించకున్నను ఇట్లు ఫాక్టరీలు వృద్ధియైనవి. బ్రిటిష్‌వారి అనంగీకార ప్రకటనమున కొకమార్గము—ఇండియాలో ప్రవేశించు యంత్రములపై పన్ను విధించుట. రెండవమార్గము ప్రత్తిపై ఎక్సైజు సుంకము విధించుట. ఈపన్ను ఇండియన్ ప్రత్తిమిల్లులలో తయారైన సరుకుపై వేసిరి.

తొలిభారతీయపారిశ్రామికులలో అగ్రగణ్యుడు జంషేడ్జీ నసర్వాంజీ తాతా. ఆత డనేక పరిశ్రమలను నెలకొల్పెను. అన్నింటికన్న పెద్దది బీహారులో సాక్చిపద్ద స్థాపించిన తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ. 1907 లో అది స్థాపింపబడెను. 1912 లో అది పనిచేయుటకు ప్రారంభించెను. ఇనుముపరిశ్రమ, మూలపరిశ్రమలలో (Basic Industries) ఒక్కటి. ఈ కాలమున ఇనుము మిక్కిలి ప్రధానస్థాన మాక్రమించుచున్నది. ఇనుముపరిశ్రమ లేనిదేశము, ఇతరదేశములపై అధికముగా ఆధారపడియుండవలసివచ్చును. తాతా ఇనుపఫాక్టరీ బ్రహ్మాండమైనది. సాక్చిగ్రామము నేడు జంషెడ్‌పూరు నగరమైనది. దానికి కొద్దిదూరములోనున్న రైల్వేస్టేషన్ పేరు తాతానగర్. ముఖ్యముగా యుద్ధసమయమున ఇనుముచేయు ఫాక్టరీలు చాలాప్రయోజనకరమైనవి. యుద్ధసామానును తయారుచేయుట కవి పనికివచ్చును. ప్రపంచయుద్ధము ప్రారంభమైనప్పుడు తాతా ఇనుము ఫాక్టరీ పనిచేయుచుండుట బ్రిటిష్ ప్రభుత్వమున కెంతో లాభించినది.

ఇండియన్ ఫాక్టరీలలోని కార్మికుల పరిస్థితులు చాలాపాడుగా ఉండెను. 19 శతాబ్దితొలిరోజులలో ఇంగ్లీషు ఫాక్టరీ లెట్టి దుస్థితిలో నుండెనో ఇదియు నట్లుండెను. ఉద్యోగములేని, భూమిలేని జను లనేకులుండుటచే కూలి తక్కువగానుండెను. పనిచేయవలసిన గంటలు అధికముగా నుండెను. 1911 లో మొట్టమొదటి ఇండియన్ ఫాక్టరీస్ ఆక్టు అమలు జరుపబడెను. ఈ ఆక్టు అయినను పురుషునకు దినమునకు 12 గంటలు పనిచేయుకాల మనియు, పిల్లలకు 6 గంటలు పనిచేయు

కాల మనియు నిర్దేశించెను.

భూమిలేని కూలివాండ్రందరికిని ఈ ఫ్యాక్టరీలు పని కల్పించ లేదు. అనేకులు అస్సాంలోను, ఇండియా ఇతరభాగములందును ఉన్న తేయాకుతోటలకును, ఇతరతోటలకును కూలిపనికై పోయిరి. ఈ తోటలలో కూలిపరిస్థితు లెట్లున్నవనగా అచ్చట వారు పనిచేసినంత కాలమును, యజమానుల బానిసలుగా వారుండిరి.

20,00,000 పైబడిన పేదలగు భారతీయకార్మికులు పరదేశములకు వలసపోయిరి. అందు పలువురు సిలోన్, మలయాలలోని తోటలలో పనిచేయుటకు వెళ్లిరి. (హిందూమహాసముద్రములో, మడగాస్కారుకు దూరముగానున్న) మార్షస్‌దీవులకును, దక్షిణఅమెరికాకు ఉత్తరముననున్న ట్రినిడాడ్‌కును, ఆస్ట్రేలియా సమీపమందున్న ఫిజీకిని, దక్షిణఆఫ్రికాకును, తూర్పుఆఫ్రికాకును, దక్షిణఅమెరికాలోని బ్రిటిష్ గయానాకునుకూడ అనేకులు వెళ్లిరి. ఇందనేక ప్రదేశములకు వారు 'ఇండెంచర్‌డు' కూలివాండ్రుగా వెళ్లిరి. అనగా క్రియకు వారు బానిసలన్నమాట. "ఇండెంచర్" అనగా ఒకపత్రము. అందు ఈకూలివాండ్రతో చేసికొన్న ఒప్పందముండును. దీనిప్రకారము యజమానులకు వారు బానిస లగుదురు. ఈ ఇండెంచర్‌పద్ధతికి సంబంధించిన దారుణగాథలు, ముఖ్యముగా ఫిజీనుండి ఇండియాకు చేరెను. అప్పుడిచ్చట ఆందోళన జరిగెను. అంత నాపద్ధతి రద్దు చేయబడెను.

రైతులు, కార్మికులు, వలసపోయినవారు — వీరికి సంబంధించిన కథ ఇది. వీరు బీదలు, నోరులేనివారు. చిరకాలమునుండి బాధపడుచున్న భారతీయప్రజలు. నిజముగా నోరున్నవారు నూతనమధ్యతరగతిప్రజలు. ఇది బ్రిటిష్‌సంసర్గమువల్ల ప్రభవించిన తరగతి. అయినను అది బ్రిటిష్‌వారిని విమర్శించ ప్రారంభించెను. అది వృద్ధిచెందెను. దానితోపాటు జాతీయోద్యమము వృద్ధిచెందెను. 1907—8 సంవత్సరమున జాతీయోద్యమము పరిపక్వస్థితికి వచ్చెను. అప్పుడు ప్రజోద్యమ

మవతరించి, బెంగాలును ఉద్రూతలూగించెను. అప్పుడే జాతీయమహా సభ రెండుపక్షములుగా, అతివాదులనియు — మితవాదులనియు, చీలి పోయెను. బ్రిటిషువా రప్పుడు అతివాదుల నణచివేయుచు, మితవాదుల వీపు చరచుచు చిల్లరసంస్కరణలు ప్రవేశపెట్టుచు, ఎప్పటివలె తమ రాజ్యవ్యవహారధోరణి నవలంబించిరి. ఈకాలమందే ఒక క్రొత్త విశేషము జరిగెను. ముస్లిములు అల్పసంఖ్యాకులుగా నుండుటచే హిందువులకు భిన్నముగా, ప్రత్యేకముగా తమ్మాదరించవలసి యుండు నని రాజకీయహక్కులను వాంఛించిరి. భారతీయులలో విభేదము కలిగించుటకును, ఈవిధముగా జాతీయతాభివృద్ధి నరికట్టుటకును నాటి ప్రభుత్వము ముస్లిములవాంఛలను ప్రోత్సహించిరన్న విషయము ప్రసిద్ధమే.

అప్పటిమట్టుకు బ్రిటిష్‌రాజనీతి నిర్విఘ్నముగా సాగినది. లోక మాన్యతిలకు చెరసాలలో నుండెను. అతని రాజకీయపక్ష మణచివేయ బడెను. మితవాదులు, పరిపాలనలో కొన్నిసంస్కరణలను మనః పూర్వకముగా ఆమోదించిరి (వానికి మింటో - మార్లీ సంస్కరణ లనిపేరు. అప్పటి రాజప్రతినిధి, సెక్రటరీ ఆఫ్ స్టేటుల పేళ్లను బట్టి ఈపేరు వచ్చెను). ఈ సంస్కరణలవల్ల భారతీయుల కెట్టిఅధికార మును సంక్రమించలేదు. కొన్నాళ్లైనతర్వాత బెంగాలువిభజన రద్దు చేయబడుటచే వారు స్వస్థచిత్తులైరి. 1907 సంవత్సరమునుండియు సాగిన రాజకీయోద్యమము, కార్యరంగములోనికి దిగకుండ రాజకీయ ములలో పనిచేయువారు విశ్రాంతిసమయమున అవలంబించు ఉప వృత్తిగా తయారైనది. 1914 లో యుద్ధము వచ్చునరికి దేశములో రాజకీయచైతన్యము మృగ్యమయ్యెను. మితవాదులతోకూడిన జాతీయ మహాసభ పాలు కొకసారి సమావేశమై విద్వత్ తీర్మానములు చేయు చుండెను. అంతకన్న అదిచేసినపని ఏమియులేదు. జాతీయత

మందగించి పోయెను.

రాజకీయరంగముమాట అటుండగా, పాశ్చాత్యసంసర్గవల్ల ఇతర విపరీతకార్యములుకూడ సంభవించెను. నూతన మధ్యతరగతి ప్రజల మతాభిప్రాయములు (ప్రజాసామాన్యమువారివి మాత్రముకావు) మార్పు చెందెను. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము అనుపేర్లతో నూతనోద్యమములు తలయెత్తెను. వర్ణధర్మముల కాఠిన్యము సడలిపోయెను. ముఖ్యముగా బెంగాలులో సంస్కృతి ప్రబోధము కూడకలిగెను. బెంగాలు రచయితలు బెంగాలుభాషను నేటి భారతదేశభాష లన్నింటిలోను ఉత్తమశ్రేణి కందుకొనునట్లు తీర్చిదిద్దిరి. ఈ కాలమందలి సర్వోత్తమపురుషులలో నొక్కని, రవీంద్రనాథ ఠాకూరుకవిని బెంగాలు కన్నది. మన యదృష్టముకొద్దీ అతడింకను బ్రదికియుండెను. శాస్త్రజ్ఞులలో ఘనులనుకూడ బెంగాలు కన్నది. వారు జగదీశచంద్ర బోసు, ప్రఫుల్లచంద్రరాయి. భారతీయులూ ఘనులు అగు శాస్త్రజ్ఞుల మరియిద్దరిని నే నిచ్చట పేర్కొందును. వారు రామానుజం, సర్ చంద్రశేఖర వేంకటరామన్. ఈ విధముగా భారతదేశము ప్రకృతి శాస్త్రమున ఔన్నత్యము నందుచుండెను. యూరోపు గొప్ప కిదియే గదా మూలకారణము !

ఇంకొకపే రిచ్చట నే నుదహరింతును. అది సర్ మహమ్మద్ ఇక్బాల్. అతడు ఉర్దూలో, అందు ముఖ్యముగా పరిషియన్‌భాషలో, ఉపజ్ఞ గల కవి. జాతీయతపై అతడు చక్కని కవిత్వమును కొంతరచించెను. దురదృష్టవశమున నతడు కవిత్వమును వదలి అన్యకార్యములందు నిమగ్నుడయ్యెను.

యుద్ధమునకు పూర్వమందు, ఇండియా రాజకీయ విషయములందు నిద్రావస్థలోనుండగా దూరదేశములో ఇండియాగౌరవమును కాపాడుటకై అద్వితీయము, సాహసోపేతమునగు పోరాటము జరుగుచుండెను. ఈ దేశము దక్షిణ ఆఫ్రికా. అచ్చటకు కూలివాం డ్రనే

కులు, వర్తకులు కొందరు వలసవెళ్లిరి. అనేకవిధములుగా వారు అచ్చట అవమానింపబడుచుండిరి. దౌర్జన్యము పాలగుచుండిరి. కారణము, అచ్చట జాతిగర్వము పుట్టలుపోసికొని యుండెను. ఒక లా - కేసులో (వ్యాజ్యములో) పనిచేయుట కొకయువకుడగు భారతీయ బారిష్టరు దక్షిణ ఆఫ్రికాకు కొంపోబడుట తటస్థించెను. తనదేశస్థుల అవస్థ నతడు గమనించెను. సిగ్గుజెందెను. దుఃఖించెను. వారికి సహాయము చేయుటకై శాయశక్తుల పాటుపడుట కతడు సంకల్పించెను. అనేక సంవత్సరముల పాటతడు శాంతముగా కష్టపడి పని చేసెను. తన వృత్తిని వదలుకొనెను. తన ఆస్తిని వదలుకొనెను. తాను సంకల్పించిన కార్యము నిర్వహించుటకు పూర్తిగా పనిచేసెను. ఇతడే మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ. ఈనాడు భారతభూమిలో ప్రతిబాలుడును బాలికయు నతనినెరుగుదురు. అతనిని ప్రేమింతురు. కాని అప్పుడుమాత్రము దక్షిణ ఆఫ్రికాలో తప్ప అతనిపేరెవరికిని తెలియదు. ఉన్నట్లుండి అతని పేరు ఇండియాకు మెరుపుమెరిసినట్లు ప్రాకివచ్చెను. అతనిని గూర్చియు, అతని సాహసోపేతమగు పోరాటమునుగూర్చియు ప్రజలు ఆశ్చర్యముతో, గర్వముతో, ప్రశంసాపూర్వముగ చెప్పుకొనసాగిరి. దక్షిణ ఆఫ్రికాప్రభుత్వము అచ్చటి భారతీయనివాసులను ఇంకను అవమానపరుప ప్రయత్నించెను. గాంధీ నాయకత్వమున భారతీయులు లొంగుటకు నిరాకరించిరి. బీదలు పీడితులు, అజ్ఞానులు అగు కార్మికుల సముదాయమును, సామాన్యవర్తకుల సముదాయమును, స్వదేశమున కెంతోదూరములో నిట్టి సాహసవృత్తికి దించుట మిక్కిలి ఆశ్చర్యకరమగు విషయము. అంతకన్న వింతవిషయము వా రవలంబించిన పద్ధతి. రాజకీయసాధనముగా నుపయోగించిన ఈ పద్ధతి ప్రపంచ చరిత్రలో వినూత్నమైనది. నాటినుండి దానినిగూర్చి మనము తరుచు వినుచున్నాము. అది గాంధీ సత్యాగ్రహము - అనగా సత్యమును పట్టుకొని యుండుట. దీని నప్పు

దప్పుడు సాత్విక నిరోధము (Passive resistance) అనుటకలదు. ఇది సరియైన అనువాదము కాదు. అది రాజసమే (Active). అహింస దాని ముఖ్యలక్షణము. అయినప్పటికిని, నిరోధించకుండుట మాత్రమే కాదది. ఈ దౌర్జన్యరహిత యుద్ధమును సాగించి గాంధీ భారత దేశమును, దక్షిణ ఆఫ్రికాను ఆశ్చర్యచకితులను చేసెను. వేలకొలది మన దేశస్థులును, స్త్రీలును ఐచ్ఛికముగా దక్షిణ ఆఫ్రికా జైళ్లలో ప్రవేశించిరన్న వార్త తెలిసికొని గర్వముతో, సంతోషముతో భారతదేశ ప్రజలు పులకించిరి. మన దేశములోనే మన బాని సత్వముచూచి మనమన్నసులలో మనము సిగ్గుపడుచుంటిమి. మన నిస్సహాయతకు లజ్జించుచుంటిమి. మనప్రజలే ధైర్యముగానిలిచి ఎదిరి వారిని ధిక్కరించిరన్న విషయము మన ఆత్మగౌరవమును పెంపొందించెను. ఈ సంఘటనను పురస్కరించుకొని ఇండియాలో ఒక్కమాటుగా రాజకీయప్రబోధము కలిగెను. దక్షిణ ఆఫ్రికాలోనికి ధనము ప్రవహించెను. గాంధీజీయు, దక్షిణ ఆఫ్రికాప్రభుత్వమును ఒడంబడిక చేసికొన్న తర్వాత పోరాట మాగెను. అప్పటికి భారతీయులకది సందేహములేని విజయమే అయినను, భారతీయుల ఇబ్బందు లనేకమింకను తొలగిపోలేదు. దక్షిణ ఆఫ్రికాప్రభుత్వము ఒడంబడిక ప్రకారము ఆచరించలేదని చెప్పుదురు. అన్యదేశములందున్న భారతీయుల సమస్య మనకు ఉండనే ఉన్నది. భారతదేశము స్వేచ్ఛ సాధించువరకు నది అట్లే ఉండును. తమ మాతృదేశములోనే భారతీయులకు గౌరవప్రపత్తులు లేనప్పుడు అన్యదేశములం దెట్లుండును? మనదేశములో మనము స్వాతంత్ర్యము సాధించలేని సందర్భములో వారికెట్లు మనము సహాయము చేయగలము?

యుద్ధమునకు పూర్వము భారతదేశపరిస్థితు లిట్లుండెను. 1911 లో ఇటలీ టర్కీపై దాడి వెడలినప్పుడు టర్కీపట్ల ఇండియాలో

---

* Passive—స్తబ్ధమైన; Active చురుకైన.

సానుభూతి అధికముగా నుండెను. టర్కీ దేశము ఆసియాలోని దేశమనియు, ప్రాగ్దేశమనియు తలపబడుచుండుటయు, తత్కారణమున భారతీయుల సద్భావము నది చూరగొనుటయు నందుకుకారణము. టర్కీసుల్తాన్ తమ కాలిఫ్ (కాలిఫా), అనగా ఇస్లాంమతాధికారి యని విశ్వసించుటచే భారతదేశమందలి ముస్లిములకు మరింత కష్టముగా నుండెను. ఆ రోజులలో, టర్కీకిచెందిన సుల్తాన్ అబ్దుల్ హమీద్ సర్వమహమ్మదీయ ఐక్యత అను విషయమును లేవనెత్తెనని చెప్పుకొనుచుండిరి. 1912, 1913 సంవత్సరములలో జరిగిన బాల్కన్ యుద్ధములుకూడ అంతకన్న అధికముగా ఇండియన్ ముస్లిములను చలింపచేసెను. స్నేహసద్భావసూచకముగా వైద్యసంఘమొకటి, రెడ్ క్రెసెంట్ మిషన్ అనుపేరుతో, గాయపడ్డ టర్కీ సైనికులకు సహాయము చేయుటకై ఇండియానుండి వెళ్లెను.

వెంటనే ప్రపంచయుద్ధము ప్రారంభమాయెను. టర్కీ అందు చిక్కుకొని ఇంగ్లాడుకు శత్రువయ్యెను. అది యుద్ధకాలమునకు తీసికొనిపోవుచుగాన ఇక్కడ ఆగెదము.

---

# 148

# యుద్ధము 1914-18

మార్చి 31, 1933

ఈ యుద్ధమును గురించి నీకు నే నేమి వ్రాయవలెను? ప్రపంచయుద్ధమనియు, మహాయుద్ధమనియు దీని నందురు. నాలుగు సంవత్సరములు పైబడి ఇది యూరోపును, ఆసియా, ఆఫ్రికా

లలో కొన్నిభాగములను ధ్వంసము చేసెను. నడివయస్సులోనున్న లక్షలకొద్ది యువకులను తుడిచి వేసెను. యుద్ధమునుగురించి యోచించుట కది యంత ఆహ్లాదకరమగు విషయము కాదు. యుద్ధ మసహ్యస్వరూపము కలది. కాని తరుచువానిని ఆకాశమున కెత్తి వేయుదురు. అగ్ని బంగారమును పరిశుద్ధము చేయునట్లే, సుఖలాలసయై సోమరిబ్రతుకున కలవాటై చెడి దుర్బలమైన సోమరిజాతిని యుద్ధము పరిశుద్ధముచేసి దృఢపరుచుననని చెప్పుటకలదు. అమోఘ సాహసమునకు, హృదయమునార్ద్రముచేయుత్యాగమునకు నిదర్శనములను అందు చూపుదురు. ఈ సద్గుణములకు యుద్ధము కాణాచియన్నట్లు కొందురు భావింతురు.

యుద్ధమునకు గల కారణములను కొన్నింటిని నీతో కలిసి విచారించియుంటిని; ధనికతత్వావలంబులగు పారిశ్రామికదేశముల పేరాశయు, సామ్రాజ్యవాదరాజ్యముల స్పర్థలును సంఘర్షణ చెందుటచే యుద్ధ మనివార్యమైనది. యుద్ధమున పాల్గొన్న ప్రతిదేశమందలి, పరిశ్రమలనాయకులు, స్వప్రయోజనార్థమై ఎక్కువపావకాశములను, భూములను కోరుచున్నసంగతియు, ధనికులు ఎక్కువధనము కోరుచున్న సంగతియు, యుద్ధసామగ్రిని తయారుచేయు వా రధికలాభముల కోరుచున్న సంగతియు విచారించియుంటిమి. ఇట్టి జనులు యుద్ధములోనికి దుమికిరి. వారి పంపునను, వారికిని వారి తరగతులకును ప్రతినిధులగు పెద్దరాజకీయవేత్తల పంపునను ఈ దేశముల యువకులు మారణకృత్యములకు తలపడిరి. ఇట్టి యువకులలో బహుసంఖ్యాకులును, అన్ని దేశములందలి ప్రజాసామాన్యమును, యుద్ధమునకు దారితీసిన ఈ కారణముల నేమియు ఎరుగరు. విజమునకు వారికందు ప్రసక్తిలేదు. విజయము చేకూరినను పరాజయము వచ్చినను నష్టపడువారు వారే. అది ధనవంతుల ఆట — ప్రజల జీవితములతో ముఖ్యముగా పడుచువారి జీవితములతో ఈ ఆట సాగినది. కాని

సామాన్యప్రజలు పోరాడుటకు సమ్మతించిన తప్ప యుద్ధమే ఉండదు. యూరోపుఖండమందలి దేశములన్నింటిలో నిర్బంధసైనిక సేవయుం డెనని ఇదివరలో చెప్పియుంటిని. ఇంగ్లాండులో యుద్ధము కొంత జరిగిన పిమ్మట అది వచ్చెను. నిజముగా ఎవ్వరికిని పూర్తిగా ఇష్టములేకున్నచో, నిర్బంధము అందరిని సైన్యములో బలవంతముగా చేర్చనేరదు.

కాన యుద్ధమాడుచున్న దేశములలో ప్రజలదేశభక్తిని ఉత్సాహమును ప్రేరేపుటకై ఎంతోజాగ్రత్తతో ప్రయత్నములు చేయుచుండిరి. యుద్ధప్రారంభమునకు కారణభూతులని ఉభయపక్షముల వారును ఒకరినొకరు నిందించుకొను చుండిరి. ఆత్మరక్షణకొరకే పోరాడుచున్నట్లు ఉభయపక్షములవారును నటించిరి. తాను శత్రుమధ్యముననున్నట్లును, ఆశత్రువులు తన్ను హతమార్చ ప్రయత్నించుచున్నట్లును జర్మనీ చెప్పుకొనెను. తనదేశముపై దండయాత్ర మొట్టమొదట రష్యాఫ్రాంసులు చేసెనని జర్మనీ వానిని నిందించెను. బెల్జియం తాటస్థ్యమును సిగ్గుమాలి జర్మనీ భగ్నముచేసెను గనుక ఇంగ్లాండు చిన్నదేశమగు బెల్జియమును రక్షించుటకై యుద్ధములోనికి దిగినట్లు ధర్మపన్నములు చదివెను. యుద్ధములోనికి దిగిన దేశములన్నియు తాము నీతిపరుల మనియు ఎదిరివారు దోషార్హులనియూ చెప్పుకొను చుండిరి. తమ స్వాతంత్ర్యమునకు ప్రమాదము కలుగనున్నదనియు, దానిని నిలుపుకొనుటకు పోరాడి తీరవలెనని ప్రతిదేశమునందలి ప్రజలను విశ్వసించునట్లు చేయబడినది. శత్రుదేశములను మనస్ఫూర్తిగా ద్వేషింపజేయుటకై వార్తాపత్రికలెంతోశ్రమపడినవి. యుద్ధవాతావరణమును సృష్టించినవి.

ఇట్టిజబ్బు ఉద్రేకము ప్రబలముగా తరంగరూపమున లేచి సమస్తమును ముంచివేసినది. ప్రజలలో ఉద్రేకముపుట్టించుట సులభమే. కాని తెలివితేటలు, ఇంగితజ్ఞానము గల జనులును, శాంతముగా సమచిత్తతతోనుండు స్త్రీ పురుషులును, చింతకులును, గ్రంథకర్తలును,

ఆచార్యులును, శాస్త్రజ్ఞులును – యుద్ధమునందు తగులుకొన్న దేశము లలోని వీరందరును సైతము తమ సమచిత్తతను గోల్పోయి రక్తపిపాసతో, శత్రువిద్వేషముతో నిండియుండిరి. క్రైస్తవమతాచార్యులును, ఆధ్యాత్మికజీవితము గడపువారును శాంతపురుషులని యనుకొందుము గదా! వారుసైతము, అన్యులకన్న అధికముగా, రక్తపిపాసకు లోనైయుండిరి. శాంతికాములు, సామ్యవాదులుసైతము మతిచెడి తమసిద్ధాంతముల మరచిరి. అందరు నా – కాదు అందరునుకాదు – ప్రతిదేశమునందును బహుకొద్దిమంది జనులు దురుద్రేకపూరితులగుటకు నిరాకరించిరి. యుద్ధజ్వరము తమ్ము సోకకుండ చేసికొనిరి. అట్టి వారు పరిహాసమునకు పాత్రమైరి. పిరికిపంద లనిపించుకొనిరి. యుద్ధ సేవచేయనందుకు అట్టి వారనేకులు చెరసాలలకు పంపబడిరి. ఇందు కొందరు సామ్యవాదులు, కొందరు క్వేకరులవంటి ఆధ్యాత్మికపరులు. యుద్ధములోనికి దిగుటకు వారి అంతరాత్మ సమ్మతించదు. ఈ కాల మున, యుద్ధము ప్రారంభమైనప్పుడు, అందుతగుల్కొన్న ప్రజలు మతిభ్రష్టులగుదురని చెప్పినమాట నిజము.

యుద్ధము ప్రారంభముకాగానే ఆయా దేశముల ప్రభుత్వ ములు, సత్యమును మరుగుపరుచుటకును, సర్వాబద్ధములను వ్యాపింప జేయుటకును యుద్ధమునే సాకుగా పెట్టికొనిరి. ప్రజల వ్యక్తి గతస్వాతంత్ర్యములుకూడ అణచివేయబడినవి. రెండవ పక్షము పూర్తిగా మరుగుచేయబడినది. ఇందుచే ప్రజలకు ఒకపక్షము వృత్తాంతమే తెలియవచ్చుచుండెను. అదియైనను రూపముచెడిన అబద్ధపువృత్తాంతమే. ఈ విధముగా ప్రజలను మోసపుచ్చుట కష్టము కాదు.

శాంతిసమయమునకూడ సంకుచిత జాతీయప్రచారమును, వార్తా పత్రికల విరూపవార్తలును ప్రజలను మోసపుచ్చియుద్ధమునకు అను కూలవాతావరణమును కలిగించెను. యుద్ధ మమితముగా శ్లాఘింప

బడినది. జర్మనీలో, లేదా ముఖ్యముగా ప్రష్యాలో యుద్ధశ్లాఘనము, కైజరుమొదలుకొని క్రిందివరకు నున్నపాలకులకు మతసిద్ధాంతము వంటిదయ్యెను. యుద్ధమును సమర్థించుటకును, అది "జీవశాస్త్రావసరమని" - అనగా మానవజీవితమునకు, మానవాభివృద్ధికి అదియవసరమని - సిద్ధాంతము చేయుటకును విద్వద్గ్రంథము లనేకము వ్రాయబడెను. సర్వులకు తెలియుటకై కొంతమొరటుగా కైజరు తరుచు కనబడుచుండుటచే ఆతనికి కావలసినంతప్రసిద్ధి వచ్చెను. ఇంగ్లాండులోను, ఇతరదేశములలోను, సైన్యమునందును, పైతరగతిజనులందును ఇట్టిభావములే ప్రచారమందుండెను. పందొమ్మిదవ శతాబ్దిలో ఇంగ్లాండులో రస్కిన్ ఉత్తమరచయితలలో నొక్కడు. గాంధీజీ కతడు అభిమానపాత్రుడు. బహుశా నీ వతనిగ్రంథములు కొన్ని చదివియుండవచ్చును. ఉదారభావములుగల ఇతగాడు తనగ్రంథములం దొక్కదానిలో ఇట్లు వ్రాసెను.

"నేను తెలిసికొన్న విషయము, సంక్షిప్తముగా నిది - యుద్ధములోనే మహాజాతులన్నియు వాక్కులో సత్యమును, భావములో బలమును నేర్చుకొన్నవి; శాంతిసమయమున నవి నీరసించినవి; యుద్ధము వానికి సదోబ్ధ చేసినది, శాంతి వానిని మోసగించినది; యుద్ధము వానికి సుశిక్ష నిచ్చినది, శాంతి వానికి ద్రోహము చేసినది; ఒక్కమాటలో వానికి జీవముపోసినది యుద్ధము, మరణముకూర్చినది శాంతి."

రస్కిన్ దాపరికములేని సామ్రాజ్యవాది యనుటకు అతని వాక్యములు మరికొన్ని ఉదహరింతును—

"ఇంగ్లాండు చేసితీరవలసిన కార్యమిదియే. లేకున్న నది నశించును; తాను కాలుమోపగలిగిన గయాళుభూమినంతయు లాభకరమైనచో గ్రహించవలెను. అచ్చటికి వలసపోయిన తనప్రజల ప్రధానలక్ష్యము - ఇంగ్లాండు అధికారమును భూమిమీదను, సముద్రము

వివాదను పెంపొందింపజేయుటయే - అవి బోధించవలెను."

ఇంకొకవాక్యము నుదహరింతును. బ్రిటిష్ సైన్యములో ఇంగ్లీషు ఉద్యోగిగా చేరి మేజర్ జనరల్ పదవి నందినవాని గ్రంథములోని దిది. అతడు చెప్పువిషయ మేమనగా - "ఉద్దేశపూర్వకముగా అబద్ధమాడిన తప్పు, అసత్యముగా ప్రవర్తించినతప్పు సత్యమును కప్పిపుచ్చి సందిగ్ధముగా మెలగినతప్పు" యుద్ధములో విజయము సాధించుట దాదాపు అసంభవము. అతని మతప్రకారము ఏ పౌరుడైనను "పైని చెప్పిన ప్రకారము చేయ నిరాకరించినచో అతడు తనసహచరులపట్ల, తన తాబేదారులపట్ల ఉద్దేశపూర్వకముగా ద్రోహబుద్ధితో ప్రవర్తించుచున్న వాడగును." "అట్టివాడు తుచ్ఛుడగు పిరికిపందయని చెప్పవచ్చును." "మహాజాతులకు ఆపత్సమయమున నీతి, అవినీతి అనువానితో ప్రసక్తి ఏమి?" "శత్రువు మరణించువరకును కొట్టుచునే పోవలెను." పై విషయములను గురించి రస్కిన్ ఎట్టి అభిప్రాయము వెల్లడిచేసెడివాడో? ఇదంతయు ఇంగ్లీషువారి హృదయగతాభిప్రాయమని అనుకోకు. అట్లే కైజరుగర్వోక్తులు సామాన్యజర్మన్ పౌరుని అభిప్రాయములును కావు. దురదృష్టమేమనగా ఆలోచించగలవారు తరుచు అధికారములో నుందురు. యుద్ధసమయమున తప్పనిసరిగా వారు ముందుకు వత్తురు.

సామాన్యముగా అట్టి ధీరవాక్యములు బహిరంగముగా చేయరు. యుద్ధమునకు పవిత్రస్వరూపము కల్పింతురు. యూరోపులోను, ఇతర ప్రదేశములందును వందలకొలదిమైళ్ల మేర వ్యాపించిన యుద్ధరంగమున బ్రహ్మాండమైన జనసంహారము జరుగుచుండగా, ఇంటివద్ద చక్కని దంభోక్తులు పేనుచుండిరి. జనసంహారము సబబే అని లోకులను భ్రమపెట్టుట కిట్లు చేయుచుండిరి. ఈ యుద్ధము - స్వాతంత్ర్యగౌరవములను నిలబెట్టుకొనుటకు చేయుచున్న యుద్ధము; ఇది "యుద్ధము నంతమొందించు యుద్ధము;" ఈ యుద్ధము ప్రజాస్వామికమును కాపాడు యుద్ధము; ఈ యుద్ధము స్వయంనిర్ణయముకొరకును, చిన్నరాజ్య

ముల స్వాతంత్ర్యము కొరకును. ఈ కాలమున ఇంటిపద్దకూర్చుండి, దేశభక్తిపూర్వకముగా చక్కని పై వాక్యముల నుచ్చరించుచు యువకు లను యుద్ధాగ్నిలోనికి దుముకునట్లు చేయుచున్న ధనికులును, పరిశ్రమల యజమానులును ధనమును కొల్లలుగా గడించుచు కోటీశ్వరులైరి.

నెలదాటినెల, సంవత్సరముదాటి సంవత్సరము యుద్ధము గడచు చుండగా ఇతరదేశము లనేకము యుద్ధములోని కీడ్వబడినవి. తటస్థ దేశములకు రహస్యముగా లంచములిచ్చి తమపక్షమున చేర్చుకొను టకు ఉభయపక్షములవారు ప్రయత్నించిరి. ఈ లంచములే బహి రంగముగా ఇచ్చినచో వారి ఉన్నతాదర్శములకు, చాటించుచున్న వారి చక్కని వాక్యములకు భంగముకలుగును. ఇంగ్లాండు, ఫ్రాంసులకు లంచమిచ్చుశక్తి అధికముగా గలదు. జర్మనీ కంత లేదు. కాన యుద్ధమున ప్రవేశించిన తటస్థరాజ్యము లనేకము ఆంగ్లో - ఫ్రెంచి - రష్యన్ పక్షమున చేరినవి. జర్మనీ ప్రాతమిత్రమైన ఇటలీ, మిత్ర మండలిపక్షము చేరెను. కారణము - మిత్రమండలి ఇటలీతో, ఆసియా మైనరులోను, ఇతర చోట్లను భూభాగమునిచ్చుటకు వాగ్దానముచేయుచు రహస్యసంధి చేసికొనుటయే. వేరొక రహస్యసంధిప్రకారము కాంస్టాంటి నోపుల్ రష్యాకు వాగ్దానముచేయబడెను. ప్రపంచమును తమలో తాము పంచుకొనుట ఎంతసరదాపని! ఈ రహస్యసంధులు, మిత్ర మండలిలోని రాజకీయవేత్తలు బహిరంగముగా చేసిన ప్రకటనలకు పూర్తిగా వ్యతిరేకము. బహుశా ఈసంధులవృత్తాంత మితరులకు తెలి యకపోయెడివి - రష్యన్ బోల్షివిక్కులు అధికారము చేజిక్కించు కొన్న పిమ్మట ప్రకటించకపోయినట్లయితే. మిత్రమండలి పక్షమున (ఆంగ్లో - ఫ్రెంచి పక్షమును టూకీగా మిత్రమండలియందును) చివరకు ఒకడజనో, పైగానో దేశములుండెను. బ్రిటను దాని సామ్రాజ్యము, ఫ్రాంసు, రష్యా, ఇటలీ, అమెరికాసంయుక్తరాష్ట్రములు, బెల్జియం, సర్బియా, జపాను, చైనా, రుమేనియా, గ్రీసు, పోర్చుగల్ - ఇవి ఆ

దేశములు. (ఇంకను ఒకటిరెండు ఉండవచ్చును. నాకు జ్ఞాపకములేదు). జర్మన్ పక్షమున ఉన్నదేశములు జర్మనీ, ఆస్ట్రియా, టర్కీ, బల్గేరియా. అమెరికా సంయుక్తరాష్ట్రములు మూడవసంవత్సరమున యుద్ధములో ప్రవేశించెను. అమెరికానువదలిపెట్టినప్పటికిని మిత్రమండలికి జర్మన్ పక్షమునకన్న ఎక్కువస్తోమతు ఉన్నట్లు స్పష్టము. వారికి ఎక్కువమనుష్యు లుండిరి. అధికధనముండెను. యుద్ధసామగ్రిని, ఆయుధములను చేసికొనుటకు ఎక్కువ ఫాక్టరీలుండెను. అన్నిటికన్న ప్రధానవిషయము వారికి సముద్రాధిపత్యముండెను. అందుచే తటస్థదేశములనుండి లభ్యమగు పదార్థములను సులభముగా పొందవచ్చును. సముద్రాధిపత్య ముండుటవలన మిత్రమండలి వారిట్లు యుద్ధసామగ్రినిగాని, ఆహారమునుగాని పొందవచ్చును. అమెరికానుండి ధనము బదులు తెచ్చుకొనవచ్చును. జర్మనీ దేశమును, దాని మిత్రదేశములును అన్నిపైపులా శత్రువులచే చుట్టబడియుండెను. జర్మనీ మిత్రములు దుర్బలదేశములు. వానినుండి జర్మనీకి వచ్చినసహాయము పరిమితము. వానివల్ల జర్మనీకి ఖర్చు ఎక్కువాయెను. జర్మనీ వానికి ఆలంబనముగా నుండవలసివచ్చెను. ఇట్లు క్రియకు జర్మనీ ఒక్కదేశమే ప్రపంచమండలి పెక్కుదేశముల నెదిరించవలసివచ్చెను. ఏవిధముగా ఆలోచించినను ఇది అసమయుద్ధముగా తోచుచుండెను. అయినను నాలుగేండ్లపాటు జర్మనీ ప్రపంచమును నిలబెట్టి ఎదిరించెను. ఉండుండియు విజయము సాధించినట్లే కనిపించెను. సంవత్సరము దాటి సంవత్సరము విజయము అనిర్దిష్టముగా నుండెను. ఒక్కదేశము ఇట్టి కృషిచేయుట ఆశ్చర్యకరమగు విషయము. అట్టిది సాధ్యమగుటకు కారణము జర్మనీ నిర్మించిన దివ్యమగు సేనా నివహము. జర్మనీ మిత్రసహితముగా పరాజితమైనప్పుడు జర్మన్ సేనలు చెక్కుచెదరకుండ చివరవరకు నుండెను. అం దధికభాగము పరభూములయం దుండెను.

మిత్రమండలి పక్షమునందు యుద్ధముచేయు భారమంతయు ఫ్రెంచిసేనపై బడెను. ఈ ఫ్రెంచిసేనయే జర్మనీ సేనా నివహమున కెదురునిలిచి యువకసైనికుల నమితముగా బలియిచ్చుకొన్నది. ఇంగ్లాండు తనవంతుకుచేసిన పెద్దసహాయము - నౌకాదళమును, సముద్రాధిపత్యమును. అంతేకాదు మంత్రాంగమును (Diplomacy) నడిపించుట, ప్రచారముచేయుట, జర్మనీ తనసైన్యమునుచూచి గర్వించినది. కాన తటస్థదేశములతో అది నడపినమంత్రాంగమును, ప్రచారపద్ధతులను బొత్తిగ మొరటుగా నుండెను. యుద్ధకాలమున, అన్నిదేశములకన్న మిన్నగా ఇంగ్లాండు జుణ్ణముగా, సామర్థ్యముతో అసత్య ప్రచారము సాగించెననుటకును, సత్యవిషయముల కపార్థములు కల్పించెననుటకును సందేహములేదు. రష్యా, ఇటలీ, ఇతరమిత్రదేశములు పోరాటమున కొద్దిగా పాల్గొన్నవి. అదియైనను చెప్పుకోదగ్గదికాదు. అయినప్పటికిని అన్నిదేశములకన్న హెచ్చుగా పోరాటమున నష్టము చెందినది రష్యా. చిట్టచివరభాగమున యుద్ధములో ప్రవేశించిన అమెరికా సంయుక్తరాష్ట్రములు, జర్మనీని పరాజితముచేయుటకు చివరకు కారణమయ్యెను.

యుద్ధము ప్రకటింపబడిన తొలిమాసములలో ఇంగ్లాండు అమెరికాలమధ్య వైషమ్య మధికముగానుండెను. రెండుదేశములమధ్య పోరాటము సిద్ధించు ననుకొనుచుండిరి. జర్మనీకి సరుకు తీసికొనిపోవుచున్నవన్న అనుమానముతో అమెరికన్ ఓడలను ఇంగ్లాండు అడ్డగించుటయే ఈ వైషమ్యమునకు కారణము. అంతట బ్రిటిష్ ప్రచారయంత్రము చురుకుగా పనిచేసెను. అమెరికా సద్భావమును సంపాదించుటకు ప్రత్యేక ప్రయత్నములు చేసెను. మొట్టమొదట చేసినది "దురంతముల" ప్రచారము. బెల్జియంలో జర్మనీచేసినదన్న దారుణగాథలు ప్రచారముచేయబడినవి. "జర్మన్ హూనుల లేదా బోషుల బీభత్సము" అని దానికి పేరు. ఇంచు కొన్నిగాథలు. లోవాన్ లోని

విశ్వవిద్యాలయమును, పుస్తకభాండాగారములను నాశనముచేసిన గాథ వంటివి, సత్యప్రతిష్ఠితములే. కాని పెక్కుగాథలు పుక్కిటిపురాణములు. జర్మనులు శవాలఫాక్టరీని నడుపుచున్నారనే అత్యాశ్చర్యగాథ యొకటికద్దు! శత్రుదేశములలోని ప్రజలు ఒకరి నొకరు అమితముగ ద్వేషించుకొనుచు, ఎట్టిగాథనైనను నమ్ముచుండిరి.

అమెరికాకుపంపిన బ్రిటిష్ యుద్ధప్రచారకసంఘములో 500 ఉద్యోగులు, 10,000 సహాయులు ఉండిరని చెప్పినచో బ్రిటిష్‌వారు ఎంతవిరివిగా ప్రచారముచేసినది నీకు తెలియవచ్చును. అధికారరీత్యావచ్చిన లెక్కలివి. ఇదిగాక అనధికారరీత్యా బ్రహ్మాండమగు కృషిజరిగెను. ఈప్రచారకార్యమునకై అన్నివిధముల పద్ధతులు, మంచివి - చెడ్డవి, అవలంబించబడెను. స్వీడన్‌లోనున్న స్టాక్‌హోంలో బ్రిటిష్‌వారు అధికారరీత్యా ఒక ఇంగ్లీషు మ్యూజిక్ - హాల్ *ను స్థాపించిరి. స్వీడన్ దేశస్థుల సద్భావమును గడించుటకై అచ్చట చౌచౌ వినోదములు కావించిరి!

మిత్రమండలి పక్షములో అమెరికాచేరుటకు, ఈ ప్రచారమును, జర్మను సబ్ మెరైనుల అలజడియు కారణములైనవి. సబ్‌మెరైను అలజడినిగూర్చి ముందుముందు కొంతచెప్పెదను. అట్టి నిర్ణయమునకసలు కారణము — ధనము.

యుద్ధము డబ్బుతోకూడినపని. దారుణముగా ఖర్చుచేయవలసియుండును. విలువగల సామగ్రిని, కొండంత సామగ్రిని అది మ్రింగివేయును. పర్యవసానము విధ్వంసము. ధనమునార్జించుకార్యముల నన్నింటిని అది ఆపివేయును. ప్రజలశక్తినంతయు వినాశకార్యములపై త్రిప్పును. ఈ ధనమంతయు ఎచ్చటనుండి రావలెను? మొట్టమొదట మిత్రమండలి పక్షములో ఇంగ్లాండు, ఫ్రాంసులు మాత్రమే

* మ్యూజిక్‌హాల్‌లో సంగీతము, నృత్యము ఇతర వినోదములు జరుగును.

పచ్చపచ్చగా ఉన్నవని భావించవచ్చును. యుద్ధఖర్చులో తమ భాగమును తాము వహించుటయేగాక, తమమిత్రదేశములకు డబ్బుబదులిచ్చియు, సామగ్రిబదులిచ్చియు వారి ఖర్చునుకూడా తాముభరించుచుండిరి. కొన్నాళ్లైనపిమ్మట ఫ్రాంసు కాళ్లుపారచాపినది. దానికి డబ్బువచ్చుమార్గములు కట్టుబడ్డవి. అప్పుడు లండన్ ఒక్కటే మిత్రమండలి యుద్ధవ్యయమునంతయు భరించెను. రెండవ సంవత్సరము పూర్తి అగుసరికి లండన్‌కూడ కన్నులుతేలవేసెను. ఇట్లు 1916 సంవత్సరాంతమునకు ఇంగ్లాండుఫ్రాంసుల పరపతి అంతమయ్యెను. అప్పుడు ప్రసిద్ధరాజకార్యధురంధరులగు ఇంగ్లీషు రాయబారులు ధనసహాయము నర్థించుటకై అమెరికాకువెళ్లిరి. ధనమునప్పిచ్చుటకు అమెరికను లంగీకరించిరి. నాటినుండి మిత్రమండలి యుద్ధమును అమెరికన్ ధనముతోనే నడిపించిరి. మిత్రమండలి వారమెరికాకీయవలసిన యప్పు అమితముగా పెరిగిపోజొచ్చెను. అది అట్లు పెరుగుచుండగా అప్పిచ్చిన పెద్ద బ్యాంకులును, అమెరికన్ ధనికులును మిత్రమండలికి విజయము కలుగవలెనని కోరుచుండిరి. జర్మనీవల్ల మిత్రమండలి వారు ఓడిపోవుటయే తటస్థించినచో అమెరికా ఇచ్చిన బ్రహ్మాండమైన అప్పుమొత్తములు ఏమికావలెను ? అమెరికన్ బ్యాంకర్లడబ్బు కీ విషయము లంకెపడినది. వారందుకు అనుగుణముగానే ప్రవర్తించిరి. మిత్రమండలి పక్షమున యుద్ధములో చేరుటకు అమెరికాలో ఉద్దేశము కలిగెను. చివరకు అమెరికా యుద్ధములో చేరెను.

ఇప్పుడు మనము తరుచు అమెరికన్ అప్పునుగురించి వినుచుందుము. వార్తాపత్రికలనిండ దానివిషయమే. ఇంగ్లాడు ఫ్రాంసులకంతమునుండి వ్రేలాడుబండరాయి అగు ఈ ఋణము, వారు చెల్లించలేని ఈ ఋణము యుద్ధకాలమున ప్రోగుపడ్డది. అప్పుడు వారికాడబ్బు చిక్కకపోయినట్లయితే వారి పరపతి నేలపాలై యుండెడిది. బహుశా అమెరికా యుద్ధములో చేరియుండెడిది కాదు.

## 149

# యుద్ధగతి

ఏప్రిల్ 1, 1933

1914 ఆగస్టులో యుద్ధము ప్రారంభమైనప్పుడు ప్రపంచదృష్టి బెల్జియంమీదను, ఫ్రాంసు ఉత్తరసరిహద్దుపైని ప్రసరించెను. పెద్ద పెద్ద జర్మన్ సేనా నివహములు ముందుకు సాగిపోవు చుండెను. మార్గమధ్యమున తగిలిన అడ్డంకులను తుడిచివేయుచుండెను. బెల్జియమ్ వారిని కొద్దికాలమే ఆటంకపరచగలిగెను. ఇందుకు బెల్జియంపై కోపించి హింసాకార్యములతో దానిని భయపెట్ట ప్రయత్నించిరి. మిత్రమండలి వారి 'దురంతముల' గాథల కిదియే ఆధారము. వారు పారిస్ వైపుకు వెళ్లిరి. ఫ్రెంచిసేన వారిముందు నిలువలేక ప్రక్కకు పోయెను. చిన్నదైన బ్రిటిష్‌సేన ప్రక్కకు తుడిచివేయబడెను. యుద్ధము ప్రారంభమైన నెలరోజులలో పారిస్ పట్టణము శత్రువుల హస్తగత మగునట్లు తోచెను. ఫ్రెంచి ప్రభుత్వము తమ కార్యాలయములను, విలువగల వస్తువులను బోర్డోకు గొంపోవ సిద్ధపడెనుకూడ. యుద్ధమున తమకు విజయముచేకూరినదని కొందరు జర్మనులు తలచిరి. పశ్చిమ యుద్ధరంగమున (అనగా ఫ్రెంచి రంగమున) ఆగస్టు మాసాంతమునకు పరిస్థితు లిట్లుండెను.

ఇంతలో రష్యన్‌సేనలు తూర్పు ప్రష్యాపై దాడి చేయుచుండిరి. పశ్చిమరంగమునుండి ఏదో యొక విధముగా జర్మనుల దృష్టిని మరల్చుటకు ప్రయత్నము చేయబడెను. ప్రాంసులోను, ఇంగ్లాండులోను, రష్యన్ "ఆవిరి రోలర్" బెర్లిన్‌పై దొర్లుకుపోవునని పెద్ద ఆశలుపెట్టుకొనిరి. కాని రష్యన్ సైనికులకు తగిన ఆయుధములు లేవు; వారి అధికారు లెంతమాత్రము సమర్థులుకారు; వారి వెనుక దుష్టమగు జారు

ప్రభుత్వముండెను. హఠాత్తుగా జర్మనులు వారిపైకి తిరిగిరి. తూర్పు ప్రష్యా చెరువుల కడను, తేమప్రదేశములకడను పెద్దరష్యన్ సైన్యమును ఇరికుకనపెట్టించి దానిని జర్మనులు పూర్తిగా నాశముచేసిరి. జర్మనుల ఈ గొప్పవిజయమునకు టన్నెన్‌బర్గు యుద్ధము అని పేరు. దీనితో సంబంధమున్న ఒక ప్రధానసేనాని వాన్‌హిండెన్‌బర్గు. పిదపకాలమున నితడే జర్మన్ రిపబ్లిక్‌కు అధ్యక్షుడయ్యెను.

అదిగొప్ప విజయమే కాని జర్మన్ సైన్యముల కెంతో నష్టదాయకమయ్యెను. ఈ విజయమును సాధించుటకై, తూర్పున రష్యనులు ముందుకు చొచ్చుకు పోవుచున్నారన్న కొద్దిభయముతో ఫ్రెంచిరంగము నుండి కొన్నిసైన్యములను జర్మనులు రష్యన్‌రంగమునకు తెచ్చిరి. ఇట్లు చేయుటచే పశ్చిమరంగమున కొంతఒత్తిడి తగ్గినది. ఇదిసందు చూచుకొని ఫ్రెంచిసైన్యము జర్మనులను వెనుకకుకొట్టుటకు బ్రహ్మాండమగు ప్రయత్నము చేసెను. 1914 సెప్టెంబరు తొలిభాగమున, మార్నియుద్ధములో, సుమారు 50 మైళ్లదూరము జర్మనులను వారు వెనుకకు నెట్టగలిగిరి. ఇట్లు పారిస్ శత్రువులబారినుండి రక్షింపబడెను. ఫ్రెంచివారికి, ఇంగ్లీషు వారికి కొంతవిశ్రాంతి చిక్కెను.

ఫ్రెంచిసైన్యమును చీల్చి ముందుకు పోవుటకు జర్మనులు వేరొక ప్రయత్నము చేసిరి కృతార్థులు కావలసినదే కాని, వారచ్చట నిలువబడిరి. అప్పుడు ఉభయసైన్యములును గోతులు త్రవ్వుకొనిరి. క్రొత్తరకముపోరు ప్రారంభమాయెను. దానికి "ట్రెంచియుద్ధము" (కందకయుద్ధము) అనిపేరు. యుద్ధ మొకవిధముగా స్తంభించిపోయినది. మూడు సంవత్సరములకు పైగా, కొంతవరకు యుద్ధాంతమువరకు, కందకయుద్ధము పశ్చిమరంగమున జరుగుచునేపోయెను. పెద్దపెద్ద సైన్యములు పందికొక్కులవలె కాలువలుత్రవ్వుకొని ఒకరినొకరు అలిసిపోగొట్ట ప్రయత్నించిరి. మొదటినుండియు జర్మన్ సైన్యములు, ఫ్రెంచిసైన్యములు లక్షలాది ఈ రంగమున

నుండెను. ఈ రంగముననే ఉన్న బ్రిటిష్‌వారి చిన్నసైన్యము వేగముగా పెరిగిపోయి పదిలక్షల సంఖ్యలోనికి తేలెను.

తూర్పురంగమున అనగా రష్యన్‌రంగమున అంతకన్న ఎక్కువ చలన ముండెను. రష్యన్ సేనలు అనేక పర్యాయములు ఆస్ట్రియనులను ఓడించెను. కాని అవి జర్మనులచే తప్పనిసరిగ ఓడింపబడుచుండెను. ఈ రంగమున నష్టములు, మృతులైన సైనికులసంఖ్య, గాయములు తిన్నవారిసంఖ్య, బ్రహ్మాండముగా నుండెను. కందక యుద్ధము కారణముగా పశ్చిమరంగమున నష్టములు తక్కువయని ఊహించబోకు. మానవులజీవితము లచ్చట తృణప్రాయముగా చూచుచుండిరి. ఉండుండియు వేలకొద్ది సైనికులు ఎదతెగకుండ కందకస్థ సైనికులమీదికి దుముకుచు ప్రాణముల గోల్పోవుచుండిరి. ఫలమూ లేకుండెను.

ఇంకను యుద్ధరంగము లనేకముండెను. టర్కులు సూయజ్ కాలువపై దాడిచేయప్రయత్నించి వెనుకకు కొట్టబడిరి. నే నిదివరలో చెప్పియున్నప్రకారము ఈజిప్టు, డిశంబరు 1914 లో బ్రిటిష్‌వారి రక్షిత రాజ్యముగా ప్రకటింపబడెను. వెంటనే బ్రిటిష్ వా రచ్చటి క్రొత్త శాసనసభను విలుపుదలచేసి, తమ కనుమానమున్నవారి నందరిని చెరసాలలోపెట్టిరి. జాతీయవార్తాపత్రికలు అణచివేయబడెను. అయిదుగురికంటె నెక్కువమంది ఒకచో సమావేశము కాకూడదని శాశించిరి. అచ్చట ప్రవేశపెట్టిన పరిశోధనము (Censorship) ను లండన్ టైమ్సు పత్రిక "కనికరములేని కిరాతకత్వ" మని వర్ణించినది. యుద్ధకాలమంతయు దేశము, విజమునకు, సైనికపరిపాలనముక్రింద ఉండెను.

శిథిలమైన టర్కీసామ్రాజ్యమందలి బలహీనముగానున్న ప్రదేశము లనేకముపై, ఇరాక్, కొన్నాళ్లకు పాలస్తీన్, సిరియాలపై బ్రిటన్

చేసికొని, బహుళముగా ధనము, సామగ్రి లంచమిచ్చి, టర్కీపై అరబ్బులు తిరుగుబాటు చేయునట్లు బ్రిటిషువారు తోడ్పడిరి. అరేబియాలో బ్రిటిష్ ఏజెంటుగానున్న కర్నల్ టి. యి. లారెన్సు ఈ తిరుగుబాటుకు ముఖ్యకారకుడు. కొన్నాళ్లకు ఆసియాలోని అనేక ఉద్యమములను తెరచాటుననుండి నడిపించు నిగూఢవ్యక్తి (Mystery man) అను పేరు అతడు సంపాదించెను.

ఫిబ్రవరి 1915 లో బ్రిటిష్ నౌకాదళము డార్డినెల్సును నిర్బంధించి, కాంస్టాంటినోపుల్‌ను వశముచేసికో ప్రయత్నించి నప్పుడే టర్కీ హృదయస్థానముపై ప్రత్యక్షదాడి ప్రారంభమయ్యెను. ఇందు వారు కృతకృత్యులైయుండినచో యుద్ధములో టర్కీని అంతమొందించుటయే కాదు, పశ్చిమ ఆశియాలో జర్మన్ పరపతి లేకుండ చేయగలిగి యుండెడివారు. కాని వారు కృతకృత్యులు కాలేదు. టర్కీలు సాహసముతో పోరాడిరి. ఇందుకు చాలవరకు కీర్తి ముస్తఫా కమాల్ పాషాకు దక్కినది. సుమారు సంవత్సరకాలముపాటు గల్లిపోలీలో బ్రిటిష్ వారీప్రయత్నము చేయుచునే యుండిరి. నష్టము లమితముగా పొంది చాలించుకొనిరి.

పశ్చిమతూర్పు ఆఫ్రికాలోని జర్మన్ వలసలమీద కూడ మిత్రమండలివారు పడిరి. ఈ వలసలు జర్మనీ కెంతో దూరములో నుండుటచేత ఎట్టి సహాయమును వాని కందలేదు. కాన అవి క్రమముగా లొంగిపోయెను. చీనాలో, కియాచౌ అను ప్రదేశము జర్మనీవారు ఉంచుటకును, ఉపయోగించుకొనుటకును దత్తముచేయబడెను. అది ఇప్పుడు సులభముగా జపాన్ వశమయ్యెను. దూరప్రాచ్యములో చేయవలసినపని ఏమియు లేకుండుటచే జపాను సుఖముగా కాలక్షేపము చేయుచుండెను. కాన అది చీనాను బెదిరించుచు తనకు అన్నిరకముల హక్కులు ఇమ్మని అల్లరి పెట్టుచుండెను.

అనేకమాసములపాటు ఇటలీ యుద్ధగతిని పరిశీలించుచుండెను.

ఏ పక్షము విజయమునందునో అని చూచుచుండెను. చివరకు విజయము మిత్రమండలివారినే వరించునని నిశ్చయించి, వారిచ్చెదమన్న లంచములను తీసికొనుట కంగీకరించెను. వారితో రహస్యసంధి చేసికొనెను. 1915 మే నెలలో ఇటలీ మిత్రమండలి పక్షమున యుద్ధములో ప్రవేశించెను. రెండు సంవత్సరముల పాటు ఇటలీవారు, ఆస్ట్రియనులు ఒకరినొకరు లొంగదీసికొనుటకు ప్రయత్నించిరి. కాని లాభించలేదు. అప్పుడు ఆస్ట్రియనుల సహాయార్థమై జర్మనులు వచ్చిరి. వారి దెబ్బకు ఇటలీవారు కూలిపోయిరి. ఆస్ట్రియన్ — జర్మన్ సైన్యము సుమారు వెనీసువరకు పోయెను.

1915 అక్టోబరులో బల్గేరియా జర్మన్ పక్షము చేరెను. వెంటనే ఆస్ట్రియన్ — జర్మన్ సైన్యము, బల్గేరియాతో సహకరించి సెర్బియాను పూర్తిగా అణగద్రొక్కెను. సెర్బియారాజు మిగతసేనతో దేశమును వదలిపెట్టి మిత్రమండలివారి నౌకలలో తలదాచుకోవలసి వచ్చెను. సెర్బియా జర్మనీపరిపాలన క్రిందకు వచ్చెను.

బాల్కన్ యుద్ధములలో ప్రవర్తించిన ప్రకారముగానే, రుమేనియా ఎప్పటి కేది ప్రస్తుతమో విచారించి అట్లుచేయు ప్రత్యేకమగు నేర్పు కలిగియుండెను. రెండు సంవత్సరములపాటది, మహాయుద్ధ గతిని పరిశీలించి, చివరకు 1916 ఆగస్టులో మిత్రమండలి పక్షము చేరెను. వెంటనే దానికి శాస్తి కలిగెను. జర్మన్ సైన్యము దానిని తుడిచివేసెను. నిరోధనంతయు అణచివేసెను. రుమేనియాకూడ ఆస్ట్రియన్ — జర్మన్‌వారిచే ఆక్రమింపబడెను.

ఇట్లు మధ్యరాజ్యములగు జర్మనీ ఆస్ట్రియాలు, — బెల్జియంను, ఫ్రాంసు ఈశాన్యమున కొంతభాగమును, పోలెండును, సెర్బియాను, రుమేనియాను ఆక్రమించుట తటస్థించెను. అనేక చిల్లరయుద్ధరంగములలో వారు విజయము సాధించిరి. కాని యుద్ధప్రాధాన్యమంతయు పశ్చిమయుద్ధరంగమందును, సముద్రములమీదను ఉండెను. అక్కడ

మాత్రము వారు ముందుకు పోవుటలేదు. ఆ రంగమున శత్రుసైన్యములు రెండును మృత్యువు కౌగిలిలో బిగిసియుండెను. సముద్రములపై మిత్రమండలి సర్వాధీశ్వరులై యుండిరి. యుద్ధము తొలిరోజులలో జర్మను క్రూజర్ నౌకలు కొన్ని సముద్ర సంచారముచేయుచు మిత్రమండలినౌకల కాటంకములు కలిగించుచుండిరి. అందొక్కటి ప్రసిద్ధికెక్కిన ఎమ్డన్. అది మద్రాసుపై సైతము ఫిరంగులు పేల్చెను. కాని ఇదిచిన్న అంతర్నాటిక. మిత్రమండలి సముద్రమార్గములను తన చేతిలో పెట్టుకొనియే యుండెను. సముద్రమార్గములు తన స్వాధీనమందున్నవి కాబట్టి మిత్రమండలి బయటినుండి మధ్యరాజ్యములకు ఆహార పదార్థములును, ఇతరసామగ్రియు పోకుండ పూర్తిగాఆటంక పరుచుటకు ప్రయత్నించిరి. ఈ ముట్టడి జర్మనీ ఆస్ట్రియాలకు దారుణమగు కఠిన పరీక్ష అయ్యెను. తినుటకుతిండి వారికి కరవగుచుండెను. ప్రజలందరు క్షుధాపీడితులు కావలసివచ్చెను.

జర్మనీ అన్ననో సబ్ మెరీనులతో మిత్రమండలివారి ఓడలను ముంచివేయుటకు ప్రారంభించెను. ఈ సబ్ మెరీన్ యుద్ధము జర్మనులకు జయము కూర్చుచుండెను. ఇంగ్లాండు దేశమునకు ఆహార పదార్థములు వచ్చుట క్షీణించెను. కాటకము వచ్చునునుభయ ముదయించెను. 1915 మే నెలలో ఒక జర్మన్ సబ్ మెరీన్ ఇంగ్లీషువారి గొప్ప అట్లాంటిక్ నౌకను (ప్రయాణీకుల నౌకను) ముంచివేసెను. అనేకులు ప్రయాణీకులు సముద్రమున మడిసిరి. అమెరికను లనేకులు కూడ దానిలో మరణించిరి. ఇందుచే అమెరికాలో క్రోధము ప్రజ్వలించెను.

వాయుమార్గమునకూడ జర్మనీ ఇంగ్లాండును కొట్టెను. బ్రహ్మాండమగు జెప్పెలిన్ వాయునౌకలు వెన్నెలరాత్రులలోవచ్చి లండన్మీదను, ఆయుధములు తయారుచేయు ఫాక్టరీలమీదను బాంబులనువేసెను. కొన్నాళ్ళైన తర్వాత ఈపని వాయు విమానములు చేసెను (Aero-

planes). వాయువిమానముల బర్రుమను శబ్దము వినిపించుట, విమానవ్న ఫిరంగుల (Anti - aircraft guns) ప్రేల్పుళ్లు, ప్రజలు రక్షణార్థము భూమిలోని సొరంగములలోనికి పర్వులెత్తుట అప్పుడు సర్వసామాన్యమై పోయెను. (యుద్ధరంగమునలేని) పట్టణవాసులపై బాంబులనువేయుట బ్రిటిష్ ప్రజలకు మిక్కిలి కోపము పుట్టించినది. న్యాయమేకదా! అది దారుణకృత్యము. కాని బ్రిటిష్ వాయువిమానములు ఇండియా వాయవ్యసరిహద్దునను, ఇరాక్‌లోను బాంబులను వేసినప్పుడు, ముఖ్యముగా కాలనియమబాంబులను (Time - delayed bombs), ఆ రాక్షససాధనములను — వేసినప్పుడు బ్రిటన్‌లో కోపము పుట్టలేదు. దీనిని పోలీసు కార్యమనిరి. శాంతికాలమని చెప్పబడునప్పుడు సైతం ఇట్లు జరిగినది.

నెలదాటినెల ఈ విధముగా యుద్ధము సాగిపోవుచుండెను. దావాగ్నిలో మిడుతలదండు నశించినట్లు, మానవులు యుద్ధములో నశించుచుండిరి. యుద్ధము సాగినకొలదియు అది ఎక్కువ వినాశహేతువును, క్రూరమును కాజొచ్చెను. జర్మనులు విషవాయువును ప్రవేశపెట్టిరి. కొద్దికాలములోనే ఉభయపక్షములును దానిని వాడజొచ్చిరి. బాంబులను విసరుటకు వాయువిమానము లధికముగా వినియోగింపజొచ్చిరి. అప్పుడు వచ్చినవి మొట్టమొదట బ్రిటిష్‌పక్షమున, టాంకులనుపేర యంత్రనిర్మిత రాక్షస కారులు. గొంగళీపురుగులవలెనవి యున్నింటిమీదను ప్రాకుచు పోవును. వేలకొద్ది మనుష్యులు రణరంగములలో మడియుచుండిరి. వారివెనుక్షమున, వారివారి దేశములలో స్త్రీలును, పిల్లలును తిండిలేక మలమలమాడుచుండిరి. ముఖ్యముగా జర్మనీ, ఆస్ట్రియాలలో, ముట్టడికారణముగా, ఆహారలోపము భయంకరముగానుండెను. ఇది సహనపరీక్ష అయ్యెను. ఈ కఠినపరీక్షలో ఏ పక్షము రెండవపక్షముకన్న ఎక్కువకాలము తట్టుకోగలదో? ఏ సైన్యము రెండవ సైన్యమును సహన పరీ

క్షలో ఓడింపగలదో? మిత్రమండలివారి ముట్టడివల్ల జర్మనీ ధైర్య స్థైర్యముల కోల్పోవునా? లేదా, జర్మనుల సబ్ మెరీన్ యుద్ధమువల్ల ఇంగ్లాండు తిండలేక ధైర్యస్థైర్యములను, వీటిని కోల్పోవునా? ప్రతి దేశమును బ్రహ్మాండమైన త్యాగమును చేసెను. దుఃఖము పాలాయెను. ఈ త్యాగమును, ఈ దుఃఖమును వ్యర్థముగా పోవలసినదేనా? యని ప్రజలు రిచ్చపడిరి. స్వదేశమునకై పోరాడి మృతులైనవారిని మరచి పోవలసినదేనా? శత్రువునకు లొంగిపోవలసినదేనా? యుద్ధమునకు పూర్వమందలి కాలము దూరమైనట్లుండెను. యుద్ధకారణములుసైతము విస్మరింపబడెను. స్త్రీ పురుషుల హృదయములు ప్రతీకార విజయ కాంక్షలతోమాత్రమే నిండియుండెను.

తమకుప్రియమైన కార్యములో ప్రవేసించి ఆహుతియైపోయిన మృతవీరుల పిలుపు దుస్సహముగా నుండెను. ధైర్యసాహసములు గల స్త్రీగాని, పురుషుడుగాని దానిని కాదనగలడా? యుద్ధముచివర రోజులలో అంధకార మంతట అలముకొనెను. యుద్ధమున చిక్కు కొన్న దేశములలో ప్రతి ఇంటియందును దుఃఖము, అలసట తాండ వించుచుండెను. భ్రమలు తొలగిపోయెను. కాని ఎవ రేమిచేయ గలరు? జ్యోతి (దివిటీ) ఎత్తియే ఉంచవలెను. మేజరు మాక్ క్రే అను బ్రిటిష్ ఉద్యోగి వ్రాసిన జాలిపుట్టించు ఈ పద్యమును చదు వుము. ఆశ చచ్చిన ఆ చీకటిరోజులలో స్వజాతికిచెందిన స్త్రీ పురుష లీ పద్యమును చదివిన ఎట్టి మనఃప్రవృత్తి పాలగుదురో ఊహించుటకు ప్రయత్నించుము. ఇట్టి పద్యములే వివిధదేశములలో, వివిధభాషలలో వ్రాయబడినవనుమాట జ్ఞప్తియందుంచుకొనుము.

మృతులమండీ మేము నిన్న మొన్నటిదాక
నిండు జీవములోడ ఉదయసంధ్యాశోభ
అస్తమయశోభలను మోదమున గ్రోలితిమి

ప్రేమించితిమి తిరిగి ప్రేమింపబడితిమి
పడియుంటిమిప్పుడిట ఫ్లాండర్సు పొలములన్.
పగవారితోడ మాపగను సాధించండి
వ్రాలు చేతులనుండి అందుకొను డీజ్యోతి
నిండు స్థైర్యముతోడ ఎత్తిపట్టుడు జ్యోతి
చనిపోవుచున్న మాపూట చెల్లించరా?
మాకంటికెన్నడును నిద్ర రానేరాదు
* పాపీలు మొలిచినను ఫ్లాండర్సు పొలములన్.

1916 సంవత్సరాంతమునకు మిత్రమండలి వారిదే పై చేయిగా కనిపించుచుండెను. వారి క్రొత్తటాంకులమూలమున పశ్చిమరంగములో శత్రువుల ఇష్టమువచ్చినట్లు చేయుటకు వీలులేకుండెను. ఇంగ్లాండుపై బాంబులను విసరు జెప్పెలిన్ గాలియోడలు ప్రమాదముల పాలాయెను. తటస్థనౌకలద్వారా ఇంగ్లాండుకు, జర్మన్ సబ్‌మెరీనులు పనిచేయుచున్నను, చాలినంత ఆహారము చేరుచుండెను. 1916 మే నెలలో ఉత్తరసముద్రములో (జట్లాండుయుద్ధము) నౌకాయుద్ధము జరిగెను. మొత్తముమీద విజయము బ్రిటిష్‌వారిదే. ఇది యిట్లుండ జర్మనీముట్టడివల్ల ఆస్ట్రియకా — జర్మన్ ప్రజలకు నానాటికి తిండి కరవగు చుండెను. మధ్యరాజ్యములకు వ్యతిరేకముగా కాలము పని చేయుచున్నట్లు తోచెను. శీఘ్రఫలముల సాధించుట అవసరమని తోచెను. శాంతికి మిత్రమండలి సుముఖులేమో కనుగొనుటకు జర్మనీ సూచనలు పైతము చేసెను. కాని మిత్రమండలివారు నిరాకరించిరి. అనేకదేశములను తమలో తాము పంచుకొనుటకై మిత్రమండలి ప్రభుత్వములు సంధు లనేకముచేసికొనెను. కాన సంపూర్ణవిజయము వినా వారి నితర మేమియు సంతుష్టి పరుపజాలదు. అమెరికా సంయుక్త

---

* పాపీ ఒకవిధమగు ఎర్రనిపువ్వుల గసగసాలమొక్క. మహాయుద్ధమున మరణించిన వారిపేర పవిత్రముగా ఎన్నబడుచున్నది.

రాష్ట్రముల అధ్యక్షుడు. ప్రెసిడెంటు విల్సన్, శాంతినిచేకూర్చుటకు కొన్ని ప్రయత్నములను చేసి విఫలుడయ్యెను.

అందుపై జర్మన్‌నాయకులు సబ్ మెరీన్ యుద్ధమును తీవ్రతరముచేసి, ఇంగ్లాండుకు తిండిముట్టకుండచేసి, లొంగదీయ సంకల్పించిరి. 1918 జనవరిలో కొన్ని సముద్రదేశములలో తటస్థనౌకలను సైతము ముంచివేయుదుమని వారు ప్రకటించిరి. తటస్థరాజ్యములు ఇంగ్లాండుకు తిండిపంపకుండ జేయుటకే ఇట్లు చేతుమనిరి. ఈ ప్రకటన అమెరికాకు కోపకారణమయ్యెను. తమ నౌకల నీ విధముగా ముంచుట వారికి సహింపరానిపని. అమెరికా యుద్ధములో తప్పనిసరిగా ప్రవేశించవలసివచ్చెను. నియమరహితముగా సబ్ మెరీసుల నుపయోగించ నిర్ణయించినప్పుడీ విషయము జర్మన్ ప్రభుత్వమునకు తెలిసియే యుండవలెను. బహుశా వారి కింతకన్న అన్యమార్గము లేదనుకొని యుందురు. అందుచే నిట్టి సాహసమునకు వారు దిగవలసివచ్చెను. లేదా అప్పటికే అమెరికన్ ధనికులు మిత్రమండలికి చాలినంత ధన సహాయము చేయుచునే యున్నారని వారు భావించియుండవచ్చును. ఏది యెట్లున్నను 1917 ఏప్రిల్ నెలలో అమెరికా సంయుక్త రాష్ట్రములు యుద్ధమును ప్రకటించెను. అమితమగు స్తోమతుతో, అలపులేనిస్థితితో, మిగిలిన దేశములన్నియు అలిసిపోయి యున్నప్పుడు అమెరికా యుద్ధప్రవేశము చేసినప్పుడే జర్మన్ రాజ్యములు పరాజితమగునమట స్థిరమయ్యెను.

అయినను అమెరికా యుద్ధమును ప్రకటించుటకు పూర్వమందే ప్రముఖమగు వేరొక సంఘటన సంభవించెను. 1917 మార్చి 15 తేదీని, ప్రధమరష్యన్ విప్లవఫలితముగా, జారు తన సామ్రాజ్యమును త్యజించెను. ఈ విప్లవమునుగూర్చి నేను వేరుగా నీకు వ్రాయగలను. నీ విప్పుడు గుర్తించవలసిన విషయ మేమనగా, ఈ విప్లవము కారణముగా యుద్ధగతి పూర్తిగా మారిపోయెను. జర్మనీ రాజ్యములకు వ్యతి

రేకముగా ఇప్పుడు రష్యా పోరాడజాలదు కదా! అనగా తూర్పు రంగమునుగురించి జర్మనీకి బెంగ తీరినదన్నమాట. తూర్పురంగము నుండి తన సేనల నన్నియో, కొన్నియో జర్మనీ పశ్చిమరంగమునకు తరలించుకొనిపోయి ఫ్రెంచి, బ్రిటిష్ సేనలపై పడవచ్చును. ఉన్నట్లుండి పరిస్థితులు జర్మనీకి అనుకూలముగా మారెను. రష్యన్ విప్లవము ను గురించి అది సంభవించుటకు ఆరేడువారములముందుగా జర్మనీకి తెలిసియుండినచో ఎంతగా యుద్ధగతి మారియుండెడిదో! సబ్ మెరీన్ యుద్ధములో మార్పుఉండకపోయెడిది. బహుశా అమెరికా తటస్థముగానే యుండెడిది. రష్యా యుద్ధభూమినుండి తప్పుకొని, అమెరికా తటస్థముగా నుండియున్నచో, జర్మనీ, బ్రిటిష్ — ఫ్రెంచి సైన్యములను పూర్తిగా అణగద్రొక్కియుండెడిది. అప్పటికైనను పశ్చిమరంగమున జర్మనుల బలము వృద్ధి అయ్యెను. జర్మన్ సబ్ మెరీనులు మిత్రమండలి నౌకలను, తటస్థదేశ నౌకలను అపారముగా ముంచి నాశనము చేయుచుండిరికూడ.

రష్యన్ విప్లవము జర్మనీకి సహాయకరముగా నున్నట్లుండెను. కాని అదియే జర్మనీ అంతర్దుర్బలమునకు పెద్దకారణముగా పరిణమించెను. మొదటి విప్లవము జరిగిన ఎనిమిది మాసములలోపుగా రెండవవిప్లవము తటస్థించెను. దీని మూలమున సోవియట్లకును, బోల్షివిక్కులకును అధికారము సంక్రమించెను. వీరు శాంతిని కోరుచుండిరి. యుద్ధమున తగులొన్న దేశములయొక్క సైనికులనందరినీ, కార్మికులనూ ఉద్దేశించి శాంతిని నిలుప వేడికొనిరి. అది పెట్టుబడిదారుల యుద్ధమనియు, సామ్రాజ్యలక్ష్యముల సాధించుపట్ల శతఘ్నుల కాహారముగా తమ్ము వినియోగించుటకు సమ్మతింపకూడదనియు వారు చెప్పిరి. ఈ మాటలు, ఈ వేడికోళ్లు యుద్ధరంగమందున్న ఇతరదేశ సైనికుల చెవులను పడెను. మనస్సుల నాటెను. ఫ్రెంచిసైన్యములలో అనేక తిరుగుబాట్లు సంభవించెను. అధికారులు వానినెట్లో అణచివేసిరి. జర్మన్

సైనికులలో ఇంతకన్న అధికముగా అలజడిపుట్టెను. అనేక పటాల భాగములు, విప్లవానంతరము, రష్యన్ సైన్యముతో సోదరభావము నెరిపినవి. ఈ పటాలభాగములను, పశ్చిమరంగమునకు బదిలీచేసినప్పుడు, ఈ నూతన సందేశమును వారు తమతో కొంపోయి ఇతరపటాలభాగములలో వ్యాపింపచేసిరి. జర్మనీ యుద్ధశాంతి చెందియుండెను. పూర్తిగా నిరుత్సాహ పడియుండెను. రష్యానుండివచ్చిన బీజములు అందుకై తయారుచేసిన భూమిపై బడెను. ఈ విధముగా రష్యన్ విప్లవము జర్మనీకి అంతర్దుష్ఫలము కలిగించెను.

కాని జర్మన్ సైనికాధికారు లీ యుత్పాతములను గమనించకుండిరి. 1918 మార్చిలో సోవియట్ రష్యాపై వారు బలవంతముగా సంధిని రుద్దిరి. అది అవమానకరమగు సంధి. సోవియట్లకు మార్గాంతరములేకుండుట చేతను, ఎట్లైనను వారు శాంతిని కోరుటచేతను, సంధిచేసికొనక తప్పినదికాదు. 1918 మార్చిలోనే పశ్చిమరంగములో తుదిసారి బ్రహ్మాండమగు ప్రయత్నమును జర్మనులు చేసిరి. ఆంగ్ల — ఫ్రెంచి సైనిక వివహముల చీల్చుకొని జర్మనులు ముందుకు చొచ్చుకొని పోవుచు శత్రుసైన్యముల నాశము చేసిరి. మరల వారు మార్నీ నదిని చేరిరి. మూడున్నర సంవత్సరములకు పూర్వమందు వారిచ్చట నుండియే వెనుకకు కొట్టబడియుండిరి. అది బ్రహ్మాండమగు ప్రయత్నమే కాని తుదిప్రయత్నము. జర్మనీ అలసిపోయెను. ఇంతలో అమెరికానుండి, అట్లాంటిక్ దాటి సైన్యములు వచ్చెను. వెనుక తాము విషాదావస్థల పాలైన విషయము జ్ఞప్తియందుంచుకొని వారిప్పుడు పశ్చిమరంగమందలి మిత్రమండలి సైన్యము లన్నింటికిని — బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి సైన్యములన్నింటికిని ఏకైక నాయకత్వమేర్పరిచిరి. పూర్తిగా సహకారముచేసికొనుటకును, ప్రయత్న మేకముఖము చేయుటకును ఇట్లు చేసికొనిరి. ఫ్రెంచి దేశీయుడైన మార్షల్ ఫాక్

పశ్చిమమందలి మిత్రమండలి సర్వసైన్యమునకును సర్వసేనాధిపతి అయ్యెను. 1918 సంవత్సరమధ్యమునకు మిత్రమండలి అదృష్టరేఖ బయల్పడెను. మిత్రమండలి సైన్యములు జర్మనుల నెదుర్కొనిరి. జర్మనులను వెనుకకునెట్టుచు ముందుకుపోయిరి. అక్టోబరుకు యుద్ధాంతము సమీపములో నుండెను. యుద్ధమువిరమించి తాత్కాలికసంధి చేసికొందురను వదంతిపుట్టెను.

నవంబరు 4 తేదీని కీల్‌వద్ద జర్మన్ నౌకల తిరుగుబాటు సంభవించెను. మరి అయిదుదినముల తర్వాత బెర్లిన్‌లో జర్మన్ రిపబ్లిక్ స్థాపించినట్లు ప్రకటింపబడెను. ఆ దినముననే, నవంబరు 9 వ తేదీని, కైజర్ విల్‌హెల్మ్ II జర్మనీనుండి హాలెండుకు అమర్యాదగా, అవమానకరముగా నిష్క్రమించెను. అతనితోకూడ హోహెన్‌జోలెరిన్ వంశాధిపత్యము అంతరించెను. చీనాలో మంచూలవలె "వారు శార్దూలగర్జనముతో ప్రవేశించి, పాముతోకవలె అదృశ్యమైరి."

1918 నవంబరు 11 తేదీని యుద్ధవిరమణపత్రముపై చేవ్రాళ్లు చేసిరి. అప్పుడే యుద్ధ మంతమయ్యెను. యుద్ధవిరమణము పదునాలుగు అంశములపై ఆధారపడియుండెను. అమెరికా అధ్యక్షుడు విల్‌సన్ వీనిని నిర్దేశించెను. చాలావరకీ క్రిందిసూత్రములబట్టి అవి నిర్మించబడినవి — చిన్నదేశములకు స్వయం నిర్ణయాధికారము, ఆయుధవిసర్జనము, రహస్యరాజ్యతంత్రము నడిపించకుండుట, అగ్రరాజ్యములు రష్యాకు సహాయముచేయుట, నానాజాతిసమితి. ఈ పదునాలు గంశములలో నెన్నిటిని విజేతలు స్వప్రయోజనపరులై విస్మరించిరో ముందుముందు తెలిసికొందము.

యుద్ధమంతరించెను. కాని ఇంగ్లాండు నౌకాదళము జర్మనీని ముట్టడించుచునే యుండెను. తిండిలేకమలమల మాడుచున్న జర్మన్ స్త్రీలకు, పిల్లలకు ఆహారపదార్థములు చేరకుండ నది ఆటంకపరుచుచుండెను. ఎంతటిద్వేషము! పసిపిల్లలను పైతము దండించ

వలెనను ఎంతటిదారుణక్రోధము ! అత్యాశ్చర్యకరమగు ఈ క్రోధ, ద్వేష ప్రదర్శనమును ప్రసిద్ధివడసిన బ్రిటిష్ రాజకార్యదురంధరులు, పెద్దమనుష్యులు, పెద్దపెద్దవార్తాపత్రికలు, లిబరల్ అని చెప్పబడు పత్రికలుసైతము ఆమోదించెను. అప్పటి ఇంగ్లాండు ప్రధాని లిబరల్ అయిన లాయడ్ జార్జి. నాలుగుంపావు సంవత్సరముల ఈ యుద్ధ చరిత్ర ఉన్మత్తపకృత్యములతో, దురంతములతో నిండియుండెను. అయినను యుద్ధ విరమణానంతరము జర్మనీ ముట్టడి సాగించుట యను వట్టిక్రూరపకార్యము కని, విని ఎరుగనిది. యుద్ధమంతరించినను, ఒకదేశము తిండిలేక బాధపడుచుండెను. అందలి పసిపిల్లలు ఆకలితో దారుణముగా బాధపడుచుండిరి. ఉద్దేశపూర్వకముగా, బలవంతముగా, ఆహారము వారికి చేరకుండ ఆటంకపరచబడుచుండెను. యుద్ధమెట్లు మన మనస్సులను వికృతపరచునో ! ఉన్మత్తద్వేషముతో నెట్లు నింపునో ! జర్మనీ ప్రాత ఛాంసెల్లరగు బెత్మన్ హాల్వెగ్ చెప్పినదేమనగా : "ఇంగ్లాండు మాపై బలవంతముగా ప్రయోగించిన ఈ ముట్టడీ చిహ్నములు మా బిడ్డలపైనను, మా బిడ్డల బిడ్డలపైనను నిలిచియుంటవి — రాక్షసత్వమునకు తీసిపోని క్రౌర్య సార మీ ముట్టడి."

గొప్పరాజకార్య దురంధరులును, గొప్పస్థానములందున్న ఇతరులును ఈ ముట్టడి నామోదించగా, బ్రిటిష్ సామాన్యసైనికుడు, యుద్ధమున పోరాడిన సైనికుడు, ఈ దృశ్యమును చూడలేకపోయెను. యుద్ధవిరమణానంతరము ఒక బ్రిటిష్ సేనను రైనులాండులోని కొలోన్‌వద్ద పెట్టిరి. ఈ సేనకు నాయకుడైన ఒక బ్రిటిష్ జనరల్, ప్రధాని లాయడ్‌జార్జికి ఒక టెలిగ్రాం పంపవలసివచ్చెను — బాధపడుచున్న జర్మన్ స్త్రీలను, పిల్లలను చూచుటవలన బ్రిటిష్ సేనపై యెట్టి దుష్ఫలితములు కలుగుచున్నవో అందు సూచింపబడినది. యుద్ధ విరమణమైన పిమ్మట ఏడుమాసములు పైబడి ఈ జర్మన్ ముట్టడి సాగిపోయెను.

దీర్ఘకాలము యుద్ధము జరుగుటచే యుద్ధదేశములు పశుప్రాయము లయ్యెను. బహుసంఖ్యాకుల నైతికబుద్ధి నవి నాశముచేసెను. సామాన్యపురుషు లనేకము నేరములు చేయువారైరి. హింసకు ప్రజ లలవాటు పడిరి. ఉద్దేశపూర్వకముగ సత్యమును మరుగుపరచుట కలవాటుపడిరి. ద్వేషభావముతో, ప్రతీకారభావముతో నిండియుండిరి.

యుద్ధమువల్ల కలిగిన మంచి చెడ్డల జాబితా ఏమి ? అది ఎవరికిని ఇంకను తెలియదు. దాని నింకను తయారుచేయుచున్నారు. నేటి యుద్ధ మనగా నేమో నీకు తెలియుటకై కొన్ని అంకెలను ఉద హరింతును.

యుద్ధమున ప్రమాదములపాలైన వారి మొత్త మీ విధముగా గుణింపబడినది.

| | |
|---|---|
| ఎరిగినంతవరకు మృతసైనికులు | 10,000,000 |
| చనిపోయినట్లు భావింపబడ్డవారు | 3,000,000 |
| యుద్ధమున పాల్గొనకున్నను మృతులైనవారు | 13,000,000 |
| గాయపడినవారు | 20,000,000 |
| చెరబడ్డవారు | 3,000,000 |
| యుద్ధమున తల్లిదండ్రుల పోగొట్టుకొన్నవారు | 9,000,000 |
| యుద్ధమున భర్తల పోగొట్టుకొన్న స్త్రీలు | 5,000,000 |
| కాంది శీకులు | 10,000,000 |

దారుణమగు పై సంఖ్యలను పరీక్షింపుము. పడ్డమానవ బాధ ఎంతో వానివిబట్టి ఊహించుకొనుము. ఈ అంకెలనన్నిటిని కలిపి చూడుము. చనిపోయినవారిసంఖ్య, గాయపడ్డవారిసంఖ్య కలిపిన 46,000,000 అగును.

రూపాయలు, అణాలు, పైసలలో యుద్ధవ్యయ మెంతయినట్లు ? ఇంకను దానిని గుణించుచునేయున్నారు. ఒక అమెరికన్ మదింపును బట్టి మొత్తముయుద్ధఖర్చు మిత్రమండలి కయినది పౌ. 40,999.

600,000 — అనగా సుమారు 41 వందల కోట్ల పౌనులు. జర్మనుల కయిన యుద్ధఖర్చు పౌ. 15,122,300,000 — అనగా 15 వందల కోట్ల పౌనులు. మొత్తమయిన ఖర్చు 56 వందల కోట్ల పౌనులు. ఈ అంకెలను మనము పూర్తిగా అర్థము చేసికోలేము. మన నిత్య జీవితమున కెంతమాత్రమును సంబంధములేని వీ అంకెలు. ఈ అంకెలు జ్యోతిశ్శాస్త్ర సంఖ్యలను — సూర్యునిదూరము, నక్షత్రముల దూరమువంటివి — జ్ఞప్తికితెచ్చును. యుద్ధమున తగుల్కొనిన దేశములు, విజేతలు, పరాజితులు కూడ యుద్ధఖర్చుకు సంబంధించిన యుద్ధానంతర చిక్కులలో తీరని విధముగా తగుల్కొని కొట్టుకొను చున్నారు.

"యుద్ధము నంతమొందించు యుద్ధము," "ప్రజాస్వామికమును కాపాడుయుద్ధము," "చిన్నరాజ్యముల స్వాతంత్ర్యమునకు భంగము రానీనియుద్ధము," "స్వయంనిర్ణయ సూత్రమునకైన యుద్ధము," సామాన్యముగా స్వాతంత్ర్యమునకు, ఉన్నతాదర్శములకు పోరాడిన యుద్ధము అంతమయ్యెను. ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా, ఇటలీ, వీని నాశ్రయించిన చిన్నరాజ్యములు (రష్యా అందులో లేదు కదా!) విజయము సాధించెను. ఇట్టి ఉన్నత, ఉదార ఆశయము లెట్లు కార్య రూపము ధరించెనో ముందు చూడగలము. ఇప్పుడు సౌథే యను ఇంగ్లీషుకవి వేరొక ప్రాచీనవిజయమును గూర్చి వ్రాసిన పంక్తులను స్మరింతము.—

"గొప్పయుద్ధము గెలిచెనంటూ
డ్యూకు నందరు ప్రశంసించిరి,"
"ఏమిలాభము దాన చివరకు
కలిగె"నని పీటర్‌కిన్ బాలుడు
అడిగె; "నాకది తెలియ దయ్యా,
కాని అది ఘనవిజయమే" నని

పలికె నాతండు.

—

# 150

# రష్యాలో జారుల అస్తమయము

ఏప్రిల్ 7, 1933

యుద్ధగతిని గూర్చి వ్రాయుచు రష్యన్ విప్లవమును, దానిఫలితములను స్పృశించితిని. యుద్ధగతిపై దాని ఫలితముమాట అటుండగా, ఆ విప్లవము, ప్రపంచచరిత్రలో విశిష్టమైన యొక గొప్ప సంఘటన. అట్టి విప్లవములలో నది ప్రథమవిప్లవమే అయినప్పటికిని, అది యొక్కటిగానే చిరకాలము నిలిచిపోదు. ఏలయన అది ఇతర దేశముల దృష్టి నాకర్షించినది. ప్రపంచమందలి విప్లవము లనేకమునకు అది మార్గదర్శకమైనది. కావ సవిస్తరముగా దానినిగురించి తెలిసికొనవలెను. యుద్ధమునుండి కలిగిన ఫలములలో ఇది ఉత్కృష్టమనుటకు సందేహములేదు. కాని యుద్ధనిమగ్నులగు రాజ్యతంత్రజ్ఞులుగాని, ప్రభుత్వములుగాని ఇది యిట్లు జరుగునని ఎంతమాత్రము అనుకొనలేదు, కోరనులేదు. లేదా దాని పుట్టుకనుగూర్చి యిట్లును చెప్పవచ్చును — రష్యాలో వ్యాపించియున్న చారిత్రక, ఆర్థికపరిస్థితులు, యుద్ధిమందు కలిగిన అపరిమిత నష్టములకును, దుఃఖమునకును ప్రస్ఫుటములైనవి. ఈ పరిస్థితులను కనిపెట్టి, అదనుచూచి లెనిన్‌తల యెత్తెను. అతడు నాయకశిఖామణి. విప్లవముల నడపుటలో ప్రతిభాశాలి.

1917 సంవత్సరమున రష్యాలో పొడచూపినవి నిజమునకు రెండువిప్లవములు. ఒకటి మార్చిలోను, వేరొకటి నవంబరులోను సంభవించెను. లేదా ఈ కాలమంతయు, ఒకే విప్లవము జరుగు చున్నట్లును పరిగణించవచ్చును. అందు ఉచ్ఛదశలు రెండు.

ఇదివరలో నీకు రష్యానుగురించి వ్రాసిన జాబులో 1905 విప్లవ మునుగురించి చెప్పియుంటిని. అదియును యుద్ధపరాజయకాలమున సంభవించెను. ఇది బహుక్రూరముగా అణచివేయబడినది. జారుల ప్రభుత్వము అడ్డులేని నిరంకుశత్వముతో సాగిపోవుచుండెను. పురో గతినిచూపు అభిప్రాయములు నిలుచుటకు నీడలేదు. వానిని వెదకి పట్టి కొని అణచివేయుచుండిరి. మార్క్సుసిద్ధాంతావలంబులు, అందు ముఖ్య ముగా బోల్షివికులు, అణచివేయబడిరి. అందలి ప్రధాన స్త్రీ పురుషులు సైబీరియాలోని నేరస్థులవలసలలో క్రుగ్గుచుండిరి. లేదా దేశాంతరముల తిరుగుచుండిరి. అన్యదేశములసంచరించు ఈ కొద్దిమంది సైతము లెనిన్ నాయకత్వముననే ప్రచారమును సాగించుచుండిరి. క్రొత్తవిషయముల నేర్చుకొను చుండిరి. మార్క్సుసిద్ధాంతమున గాఢవిశ్వాసము గలవారు వారందరును. కాని మార్క్సుసిద్ధాంతము ఇంగ్లాండు, జర్మనీలవంటి పారిశ్రామికోన్నతిచెందిన దేశములకే ఉద్దేశింపబడినది. రష్యా ఇంకను మధ్యయుగకాలస్థితిలోనే ఉండెను. వ్యవసాయదేశముగా నుండెను. పెద్దపట్టణములందు మాత్రము కొద్దిపాటి పరిశ్రమలు తలయెత్తెను. అప్పటిరష్యాకు మార్క్సుమూల సిద్ధాంతములను అనుసంధించుటకు లెనిన్ పూనుకొనెను. ఈ విషయముపై అత డమితముగా వ్రాసెను. దేశాంతరవాసులలో వాదప్రతివాదములు చెలరేగెను. ఈ విధముగా వారు విప్లవసిద్ధాంతము లలవరచుకొనుచుండిరి. శిక్షనందిన నిపుణు లే కార్యమైనను చేయసమర్థులని అతని నమ్మకము. ఉత్సాహవంతులు మాత్రమే చేయజాలరు. విప్లవము లేవనెత్తించదలచినచో ప్రజ లందుకై సంపూర్ణముగా శిక్షనందవలెననియు, తరుణమువచ్చినప్పుడు

తమ కర్తవ్యమును వారు చక్కగా తెలిసియుండవలెననియు అతని అభిప్రాయము. ఇట్లు లెనిన్, అతని సహచరులు, 1905 సంవత్సరాంతమున వచ్చిన హింసాకాలమున భవిష్యత్తులో చేయుచున్న కార్యమునకు శిక్షణ గ్రహించుచు తయారగు చుండిరి.

1914 సంవత్సరమునాటికే రష్యాలోని పట్టణవాసులగు కార్మికులు మేల్కొనుచున్నారు. తిరుగుబాటుతనము మరల వారిలో తల యెత్తుచుండెను. అనేకమగు రాజకీయ – సమ్మెలు జరిగెను. అప్పుడు యుద్ధమువచ్చెను. అందరి బుద్ధులను అటుతిరిగెను. ప్రగతిశీలు లగు కార్మికులు సైనికులుగా రణభూమికి పంపబడిరి. ప్రారంభము నుండియు లెనిన్, అతని సహచరులు (నాయకులనేకులు రష్యాకు బయట దేశాంతరవాస మనుభవించుచుండిరి) యుద్ధమునకు ప్రతికూలురుగా నుండిరి. ఇతరదేశములలోని సామ్యవాదు లనేకులవలె (Socialists) వారు మైమరచిపోలేదు. వారు దానిని పెట్టుబడిదారుల యుద్ధమనిరి. తాము దానిద్వారా స్వాతంత్ర్యము సాధించగలిగినప్పుడే దానివల్ల తమకు ప్రయోజనమున్నది. కాని లేనిచో వారికి దానితో ప్రసక్తి లేదనిరి.

రణభూమిలో రష్యన్ సేనలు అమితనష్టముల పాలాయెను. బహుశా ఏసేనలును ఇంతనష్టము పాలయి ఉండవు. సామాన్యముగా సైనికోద్యోగులు ఎక్కువతెలివితేటలు కలవారు కారు. అందును రష్యాసేనానులు మిక్కిలి అసమర్థులై యుండిరి. రష్యన్ సైనికులకు కావలసినన్ని ఆయుధములు లేవు. మందుగుండుసామాను లేదు. ప్రక్కసహాయము లేదు. ఇట్టి వారిని శత్రువుపైనెట్టుచుండిరి. వేలాదిగా వారు మడయుచుండిరి. ఇదియిట్లుండ పెట్రోగ్రాడు (సెంటుపీటర్సుబర్గు కిప్పుడు వచ్చిన పేరు) లోను, ఇతర పెద్దనగరములలోను లాభదృష్టితో వ్యాపారముచేయువారు అమితముగా లాభము లార్జించుచుండిరి. ఇట్టి "దేశభక్తులు," ఇట్టి ధనార్జనపరులు, లాభములు

కొట్టుకుపోవువారను, పర్యవసానము తేలువరకు యుద్ధము జరుగు చుండవలసినదే అని గట్టిగా అరచుచుండిరి. నిరంతర యుద్ధ మున్న వారికెంతో సదుపాయముగా నుండును. కాని సైనికులును, కార్మికులును, రైతులును (వీరేసైనికులగుదురు) అలసిపోయిరి. ఆకలి దప్పిడతో బాధపడుచుండిరి. అసంతృప్తితో నిండియుంకిరి.

నికోలాస్ పేరు గల జారు మిక్కిలి తెలివితక్కువవాడు. అతనికి భార్య ఎంతచెప్పితే అంత. అతని భార్య (జారినా)కూడ తెలివితక్కువదే. కాని దీపటిమ కలది. వారిద్దరిని ఆశ్రయించుకొన్నవారు దుర్మార్గులును, మూర్ఖులును. వారిని ఎవరును ఏమియును అనుటకు సాహసించరు. పరిస్థితులు చివరకు ఎంతవరకు వచ్చినవనగా, నీచుడగు దుర్మార్గుడొకడు, గ్రిగరీరస్‌పుటిన్ అనువాడు జారినాకు ప్రీతిపాత్రుడయ్యెను. ఆమెద్వారా జారుకును ప్రీతిపాత్రుడయ్యెను (రస్‌పుటిన్ అనేమాటకు మురికి కుక్క అని అర్థము). అసలు రస్‌పుటిన్ ఒక బీదరైతు. గుర్రముల దొంగిలించినందుకు అతడు చిక్కులలో పడెను. పవిత్రదుస్తులు ధరించి లాభదాయకమగు సన్యాసివృత్తి నవలంబించుటకు అతడుపూనుకొనెను. ఇండియాలోవలెనే రష్యాలోఁజాత ధనము నార్జించుట కిది యొక సులభ మార్గము. అతడు తనజుట్టు పెంచెను. జుట్టుతోకూడ అతని కీర్తియు పెరిగెను. చివర కతనికీర్తి చక్రవర్తిసభకు ప్రాకెను. జారుకును, జారినాకును ఒక్కడే కొడుకు. అతనిని జారెవిచ్ అందురు. అతడు కొద్దిగా రోగగ్రస్తుడై యుండెను. ఆ పిల్లవాని రోగము తాను కుదిర్చెదనని ఎట్లో రసపుటిన్ జారినాకు నమ్మకము పుట్టించెను. అతని భాగ్యము పండెను. త్వరలోనే జారును, జారినాను తనవశముచేసికొనెను. ఎంతటి గొప్ప ఉద్యోగమైనను అతని సలహాతోనే చేయుచుండిరి. అతడు దుర్నీతిపరుడై సంచరించెను. పెద్దపెద్దలంచములు పుచ్చుకొనెను. కొన్ని సంవత్సరములకాల మిట్లు ఓతడు ప్రబలుడై యుండెను.

ప్రతివానికిని ఇది అసహ్యముగా నుండెను. మితవాదులును, కులీనులునుకూడ అనిష్టముచూప మొదలు పెట్టిరి. బలవంతముగా జారును పదవీభ్రష్టుని చేయుదు రనుమాట పుట్టెను. ఇది యిట్లుండ నికోలాస్ జారు సర్వసేనాధిపతియై సర్వమును భ్రష్టము చేయుచుండెను. 1916 సంవత్సరము ముగియుటకు కొద్దిరోజులుముందు, జారుకుటుంబములో నొకడు రస్‌పుటిన్‌ను హత్యచేసెను. భోజనమునకుపిలిచి రస్‌పుటిన్‌ను తన్నుతాను తుపాకితో కాల్చుకొమ్మని చెప్పిరి. అతడు నిరాకరించెను. ఒక డతనిని కాల్చి చంపెను. రస్‌పుటిన్‌ను హత్య చేయుటవల్ల పీడవదలినదని అందరును సంతోషించిరి. కాని జారు యొక్క రహస్యపోలీసుల ఒత్తిడి అధికమయ్యెను.

నానాటికి పరిస్థితులు విషమించెను. పెట్రోగ్రాడులో తిండికి కరువువచ్చెను. తిండికై అల్లరులు తలయెత్తెను. అప్పుడు మార్చి మొదటిరోజులలో, కార్మికుల దీర్ఘబాధకు ఫలముగా, అనుకోకుండ, దానంతట అది విప్లవము తలయెత్తెను. 8 వ తేదీ మొదలు 12 తేదీవరకు మార్చినెలలో 5 రోజులు ఈ విప్లవము విజయవంతముగ సాగెను. ఇది జారులను పదభ్రష్టులను చేయు "నగరువిప్లవము" కాదు. నాయకులు జాగ్రత్తగా ఆలోచించి పన్నిన విప్లవమును కాదిది. అమితపీడితులగు కార్మికులనుండి, క్రింది తరగతులనుండి అది లేచి వచ్చుండెను. ఒక ప్రణాళికగాని, ఒక నాయకుడుగాని లేకుండ ఇది తడుముకొనుచు గ్రుడ్డిగా ముందుకు సాగిపోయెను. వివిధ విప్లవ పక్షములు, స్థానిక బోల్షివికులుసహా, ఇది ఇట్లువచ్చునని అనుకొనలేదు. ఎట్లు దీనిని నడిపించవలెనో వారికి తోచలేదు. ప్రజాసామాన్యము ప్రథమమున దీనిని ప్రారంభించెను. పెట్రోగ్రాడులోని సైనికులను వారు తమపక్షమునకు త్రిప్పుకొనిరి. తోడనే వారికి విజయమువచ్చెను. వెనుకటికాలమందు సంభవించిన రైతుల తిరుగుబాట్లవలె ఈ విప్లవకారులగు ప్రజాసామాన్యము, సమస్తమును నాశముచేయు, కట్టుదిట్ట

ములులేని ప్రజలగుంపులుమాత్రమే అని భ్రమపడకూడదు. మార్చి విప్లవమునుగూర్చి ముఖ్యముగా గమనించవలసిన విషయ మేమనగా, చరిత్రలో ప్రప్రథమపర్యాయము కార్మికవర్గము (ప్రోలిటేరియట్ అని దీనిని పిలిచెడివారు) దీనికి నాయకత్వము వహించెను. చెప్పుకోదగిన సమర్థులగు నాయకులు వారికప్పుడు లేరు. కాని (లెనిన్ ప్రభృతులు జైలులోనో, దేశాంతరమందో ఉండిరి) పేరుతెలియని కార్మికులు పలువురు లెనిన్‌వర్గముచే శిక్షణ పొందియుండిరి. ఇట్టి పేరుతెలియని కార్మికులు, అనేక ఫాక్టరీలలో పనిచేయువారు, ఈ ఉద్యమమునకు వెన్నెముకగా నుండి, దానిని నిర్ణీతమార్గముల నడిపించిరి.

పారిశ్రామిక ప్రజలు చేసినకార్య మిందు మనకు గోచరించును. ఇట్టి దెబ్బటను సంభవించియుండలేదు. రిష్యా ప్రధానముగా వ్యవసాయదేశము. ఈ వ్యవసాయమైనను మధ్యయుగమునాటి వ్యవసాయమే. మొత్తముదేశమున నేటిపరిశ్రమలు బహుతక్కువ. ఉన్నకొద్ది పరిశ్రమలైనను కొన్ని పట్టణములందుండెను. పెట్రోగ్రాడులో ఇట్టి ఫాక్టరీలు అనేక ముండెను. కాన పారిశ్రామిక కార్మికుల సంఖ్య ఇచ్చట అమితముగానుండెను. మార్చి విప్లవము పెట్రోగ్రాడు కార్మికులయొక్కయు, ఆ నగరమున నుంచబడిన సైనికదళము యొక్కయు పని.

మార్చి 8 తేదీని విప్లవప్రథమధ్వనులు వినవచ్చెను. స్త్రీలు ముందంజ వేసిరి. నేత ఫాక్టరీలలో పనిచేయు స్త్రీ కార్మికులు బయటకువచ్చి వీధులలో ప్రదర్శనములు చేసిరి. మరునటిదినమున సమ్మె వ్యాపిలచెను. పురుషులగు కార్మికులు అనేకులుకూడ బయటికివచ్చిరి. తిండిపెట్టమని వా రందరు గోలచేసిరి. " నిరంకుశత్వము " నశించవలె నని కేకలువేసిరి. వెనుకటినుండియు జారుల కండగానుండిన కోసకు (Cossacks) లను, అధికారులు, ప్రదర్శనముచేయు కార్మికులను అణచివేయుటకై పంపిరి. కోసకులు వచ్చి ప్రజలను ఇటుత్రోసి,

అటుత్రోసిరే గాని తుపాకులను పేల్చలేదు. అధికార వేషములు వేసికొన్నను కోసకులు నిజముగా స్నేహభావముతో వర్తించుచుండిరని కార్మికులు గ్రహించి ఆనందించిరి. వెంటనే ప్రజల ఉత్సాహము పెరిగెను. కోసకులతో స్నేహమునెరప వారు ప్రయత్నించిరి. కాని పోలీసులన్న ప్రజలకు ద్వేషము. వారిపై రాళ్లు రువ్వుచుండిరి. మూడవదినమున — మార్చి 10 వ తేదీని — కోసకులతో భ్రాతృభావము పెంపొందెను. ప్రజలపై తుపాకులుకాల్చుచున్న పోలీసులపై కోసకులు తుపాకులుపేల్చిరను వదంతి కూడపుట్టెను. వీధులనుండి పోలీసులు తొలగిపోయిరి. స్త్రీ కార్మికులు సైనికులకడకుపోయి కాళ్లావేళ్లాపడి ప్రార్థించిరి. సైనికుల సన్నీలు పైకెత్తబడెను.

మరుసటిదినము, మార్చి 11 వ తేది, ఆదివారము. నగర మధ్యమున కార్మికులు సమావేశమైరి. పోలీసులు దాగుకొని ప్రజలపై తుపాకులు కాల్చుచుండిరి. కొందరుసైనికులుకూడ ప్రజలపై కాల్చిరి. అంతట ప్రజలు ఆ దళము బారక్కులకువెళ్లి తమ సైనికు లిట్లు చేయుచున్నారని ఫిర్యాదుచేసిరి. దళముకదలివచ్చెను. నాన్‌కమిషన్డు ఆఫీసర్ల నాయకత్వమున ప్రజలను రక్షించుటకై వచ్చెను. పోలీసులపై దళము కాల్చెను. ఆదళము పట్టుకొనబడెను. కాని చేతికిమించిన పరిస్థితులు కల్గెను. మార్చి 12 తేదీని ఇతర దళములుకూడ తిరుగుబాటుచేసెను. తుపాకులతోను, మరఫిరంగులతోను వారు బయటికి వచ్చిరి. వీధులలో తుపాకులకాల్పు లమితముగా నుండెను. కాని ఎవరు ఎవరిని కాల్చుచున్నారో చెప్పుటకష్టము. పిమ్మట సైనికులును, కార్మికులును వెళ్లి, పారిపోగామిగిలిన మంత్రులను, పోలీసులను, రహస్యముగా పనిచేయువారిని పట్టుకొనిరి. జైళ్లలోనున్న ప్రాతరాజకీయ బంధితులను వారు వదలిపెట్టిరి.

పెట్రోగ్రాడులో విప్లవము విజయవంతమయ్యెను. వెంటనే మాస్కోకూడ [illegible]

కార్యములను గ్రామస్థులు కనిపెట్టి చూచుచుండిరి. మెల్లమెల్లగా రైతు వర్గము నూతన పరిస్థితులను అంగీకరించెను. కాని ఉత్సాహముతో అంగీకరించలేదు. వారి దృష్టిలో ప్రధానమైన విషయములు రెండే — భూమి తమ కరగతమగుట ; శాంతి.

ఇక జారు మాటేమి ? ఈ కార్యము లిచ్చట జరుగుచుండగా అత డేమిచేయుచున్నట్లు ? అతడు పెట్రోగ్రాడులో లేడు. దూరముగా ఒక చిన్నపట్టణములో అతడుండెను. సర్వసేనానికాన అచ్చటినుండి సైన్యములను అతడు నడుపుచున్నట్లు లెక్క. అయితే అతనిదశ అంత రించెను. మిగలముగ్గిన పండువలె ఆతడు, ఎవరికిని తెలియకుండ, జారి పోయెను. ప్రబలుడగుజారు, రష్యా నేలిన గొప్పనిరంకుశుడగు జారు, లక్షలకొద్ది జనమును గడగడలాడించిన జారు, "పవిత్రరష్యా"కు "చిన్న తండ్రి" యగు జారు "చరిత్రయొక్క చెత్తబుట్టలో" అదృశ్యుడయ్యెను. గొప్పప్రభుత్వ విధానములు, పనిచేసినంతకాలము పనిచేసి కాలము తీరుట తోడనే ఎట్లు నమసిపోవుచున్నవో చూచిన ఆశ్చర్యముకలుగును. పెట్రో గ్రాడులో కార్మికులు సమ్మెలుచేసినట్లు జారువినినతోడనే సైనికపరిపాల నము (Martial law) ప్రకటించుట కుత్తరువు జారీచేసెను. అధికార మందున్నసేనాని మాటవరుసకు ప్రకటించెను. కాని ఈ ప్రకటనమును, నగరము నాలుగుమూలల అందరికి తెలియునట్లు ప్రకటించలేదు. ఎక్కడను నోటీసు లంటించలేదు. ఈ పనులు చేయుట కెవరును లేకుండిరి. ప్రభుత్వయంత్రము విచ్ఛిన్నమైపోయెను. ఏమిజరుగు చున్నదో తెలియక జారు పెట్రోగ్రాడు తిరిగివచ్చుటకు ప్రయత్నించెను. రైల్వేపనివారు అతనిబండిని త్రోవలో నిలిపివేసిరి. జారినా అప్పుడు పెట్రోగ్రాడులోని ఒక పేటలో నుండెను. ఆమె జారుకు తంతి పంపగా అది టెలిగ్రాఫ్ ఆఫీసునుంచి తిరిగివచ్చెను. దానిపై పెన్సి లుతో వ్రాసిన ఈ మాట లుండెను. " చిరునామాదారు ఎక్కడ ఉన్నది తెలియదు."

రణరంగముననున్న సేనానులును, పెట్రోగ్రాడులోని లిబరల్ నాయకులును, పరిస్థితులుచూచి భీతావహులై, సర్వనాశనముకాకుండ చూడవలెనని ఉద్దేశించి రాజ్యమును వదలుకొమ్మని జారును వేడుకొనిరి. తన స్థానే ఒక బంధువును నియమించి అతడు రాజ్యత్యాగము చేసెను. కాని ఇకముందు జారులుండుట అసంభవము. రొమనోఫ్ వంశము, 300 సంవత్సరముల కాలము నిరంకుశ పరిపాలనము సాగించి, రష్యారంగమునుండి అంతరించెను.

కులీనవర్గము, భూమికామందులు, మధ్యతరగతి, పై అంతస్థులోని వర్గము, లిబరలులు, సంస్కర్తలు సైతము, కార్మికవర్గ మున్నట్లుండి తిరుగుబాటు చేయుట చూచి భీతావహులైరి. సైన్యము వారి కండగా నుండుననుకొనిరి గాని ఆ సైన్యమే కార్మికవర్గముతో చేరినప్పుడు వారేమియు చేయలేమనుకొనిరి. ఎవరి పక్షమున జయము మ్రొగ్గునో వారి కింకను నిర్ధారణగా తెలియలేదు. ఒకవేళజారు, యుద్ధభూమి నుండి సైన్యముతో తిరిగివచ్చి విప్లవకారుల నణచివేయునేమో ? ఇట్లు ఒకవైపు కార్మికులనుచూచి భయము, ఒకవైపుజారునుచూచి భయము. ఆత్మక్షేమమునకై ఎక్కడాలేని ఆదుర్దాతో వీరి అవస్థ దుఃఖపూరితమై యుండెను. ఇక రష్యాదేశపు శాసనసభ యుండెను. దానికి డూమా అనిపేరు. భూమికామందుల వర్గములకును, పై తరగతి బూర్జువాలకును అది ప్రాతినిధ్యము వహించియుండెను. కార్మికులు సైతము దానిపై కొంతవిశ్వాసముతో నుండిరి. కాని విషమపరిస్థితులలో నాయకత్వమువహించి ఏదియోయొకటి చేయుటకుబదులు దాని అధ్యక్షుడును, సభ్యులును భయభ్రాంతులై ఏమి చేయుటకును మనస్కరించక ఊరకొని యుండిరి.

ఇదియిట్లుండ సోవియట్‌కు ఒక ఆకారము వచ్చెను. కార్మికుల ప్రతినిధులతో సైనికుల ప్రతినిధులు చేరిరి. ఈ క్రొత్తసోవియట్ టారైడ్ రాజభవనములో ఒకభాగము నాక్రమించెను. ఇందొకభాగమున

డూమా నెలకొనియుండెను. విజయము సాధించినందుకు కార్మికులును, సైనికులును అమితోత్సాహముతో నుండిరి. అయితే ఈ విజయముతో వారేమిచేయవలె నను ప్రశ్న పుట్టెను. వారికి అధికారము వచ్చెను. కాని అధికారమును ఎవరు చెలాయించవలెను? సోవియట్టే అధికారము చెలాయించవచ్చునని వారికి తట్టలేదు. మధ్యతరగతి బూర్జువాలు అధికారమునకు తగినవారని వారు నిశ్చయించిరి. కాన సోవియట్ ప్రతినిధులు కొందరు డూమా ఎద్దకువెళ్లి పరిపాలన ప్రారంభించమని కోరిరి. డూమా అధ్యక్షుడును, సభ్యులును, సోవియట్ ప్రతినిధులు తమ్ము నిర్బంధించుటకు వచ్చిరని తలచిరి! అధికారభారము వహించుటకు వారి కిష్టములేదు. అందువచ్చు ప్రమాదములు తలచుకొని వారు భయపడిరి. కాని వారేమి చేయగలరు? సోవియట్ ప్రతినిధులు బలవంతము చేసిరి. కాదనుటకు వారు భయపడిరి. ఇట్లు ఎంతమాత్రము ఇష్టములేకపోయినప్పటికిని, కాదన్న ఏమి జరుగునోయని భయపడి, డూమా కమిటీ యొక్కటి అధికారము చెలాయించుటకు ఒడబడెను. బహిఃప్రపంచమునకు డూమాయే విప్లవము నడిపించుచున్నట్లు కనబడెను. ఈ అపోహ ఎంత అసాధారణమైనదో! కథలో ఇట్టి సంభవములు కలిగిన మనము విశ్వసించము. కాని కల్పనకన్న యదార్థమే వింతగా నుండును.

డూమాకమిటీ ఏర్పాటుచేసిన తాత్కాలిక ప్రభుత్వము మిక్కిలి సాంప్రదాయకముగా నుండెను (Conservative). దాని ప్రధాని ఒక రాజపుత్రుడు. అభవనము వేరొకభాగమున సోవియట్ ఉండెను. తాత్కాలిక ప్రభుత్వచర్యల కది నిరంతరము అడ్డుతగులుచుండెను. తొలుత సోవియట్ మితము (Moderate) గానే ఉండెను. అందలి బోల్షివికులు కొద్దిమందిమాత్రమే. ఇట్లు ఒక విధమగు ద్వంద్వపరిపాలనము — తాత్కాలిక ప్రభుత్వమును, సోవియట్ నుకలిసి — అప్పుడు జరుగుచుండెను. ఈ రెంటికిని వెనుక విప్లవముసాగించిన విప్లవపరు

లగు జనసామాన్యముండెను. ఈ ప్రభుత్వము మహత్కార్యములు చేయునని వారాశించిరి. యుద్ధములో అలిసి, క్షుత్పీడితులగు వీరికి వచ్చిన ఆజ్ఞ — జర్మనులు పరాజితులగువరకు యుద్ధము సాగించవలసిన దని. ఇందుకేనా వారు విప్లవము లేవనెత్తినది? ఇందుకేనా వారు జారును తరిమివేసినది? అని వాపోయిరి.

అప్పుడే ఏప్రిల్ 17 వ తేదీని లెనిన్ రంగమునకు వచ్చెను. యుద్ధ కాలమంతయు అతడు స్విట్జర్లాండులో గడపెను. విప్లవవార్తచేరగానే రష్యాకు రావలెనని అతడు ఆత్రపడుచుండెను. ఇది ఎట్లు సాధ్యమగును? ఇంగ్లీషువారుగాని, ఫ్రెంచివారుగాని, జర్మనులుగాని, ఆస్ట్రియనులుగాని తమ దేశములగుండా అతనిని పోనీయరు. చిట్టచివరకు ఎందువల్లనో జర్మను ప్రభుత్వము, ఒక సీలువేసిన రైలుబండిలో స్విట్జర్లాండు పొలిమేరనుండి రష్యాపొలిమేరకు లెనిన్ ప్రయాణముచేసిపోవుటకు సమ్మతించిరి. లెనిన్ రష్యాలో ప్రవేశించినచో తాత్కాలిక ప్రభుత్వము బలహీనమగు ననియు, యుద్ధమునకు లెనిన్ వ్యతిరేకి కాబట్టి యుద్ధపక్షముకూడ బలహీనమగుననియు, తత్కారణమున తమకు లాభముచేకూరగల దనియు వారూహించియుండిరి. అది సమంజసమే. ఒక విధముగా అనామకుడగు ఈ విప్లవపరుడు యూరోపును, ప్రపంచమును ముందు ముందు దద్దరిల్లజేయునని వారూహించి యుండలేదు.

లెనిన్ మనస్సులో సందేహమునకుగాని, సంధిగ్ధతకుగాని తావులేదు. ప్రజలమనోభావములను కనుగొనగలిగిన తీక్ష్ణదృష్టి అతనిది. మారుచున్న పరిస్థితుల నెదుర్కొని చక్కగా ఆలోచించిన సిద్ధాంతము లను ప్రయోగించగల ప్రసన్నబుద్ధి అతనిది. సద్యఃఫలము లెట్టిదైనను నిర్ణయించిన కార్యక్రమమును తూచా తప్పకుండ నడిపించగల దృఢ సంకల్ప మతనిది. వచ్చిన దినముననే అతడు బోల్షివిక్‌పార్టీని తీవ్ర ముగ చీవాట్లుపెట్టెను. చేతులుకట్టుకు కూర్చుండి ఉన్నందుకు వారిని మందలించెను. వారి ధర్మమేమో తీక్ష్ణమగుభాషలో నిరూపించెను.

అతని ఉపన్యాసము విన్నవారికి విద్యుత్తు సోకినట్లుండెను. అది వారిని బాధపెట్టినను వారిలో జీవముపోసెను. "మనము ప్రజలుపలుకు డాంబికులము కాము. ప్రజాసామాన్యము మనోభావములనుబట్టియే మనము నడుచుకొనవలెను. మనము అల్పసంఖ్యాకులమై యుండవలసివచ్చినను సరే. నాయకత్వపదవి కొంతకాలముపాటు వదలిపెట్టియుండుట కూడ మంచిదే." ఇట్లు లెనిన్ తన ధర్మములకంటిపెట్టికొని యుండెనే కాని ఎక్కడికక్కడకు సమాధానపడ నిరాకరించెను. నాయకుడులేకుండ, మార్గదర్శిలేకుండ కొట్టుకొని పోవుచున్న విప్లవమునకు చిట్టచివరకు నాయకుడు దొరికెను. తరుణము వచ్చునరికి నాయకుడు సిద్ధముగా నుండెను.

ఇప్పుడు మెన్‌షివిక్కులు మొదలైన ఇతర విప్లవకూటములకును, బోల్షివికులకును సిద్ధాంతములలో విభేదము లెక్కడ? లెనిన్ రాకపూర్వము స్థానిక బోల్షివికుల స్తబ్ధతకు కారణమేమి? ఇంతేకాదు. అధికారము తమ చేతులలోనికి వచ్చినప్పటికిని సోవియట్ ఆ అధికారమును ప్రాతసంప్రదాయములకు కట్టువడ్డ డూమాకు వశముచేయుటకు కారణమేమి? ఈ సమస్యలనుగూర్చి విపులముగా చర్చించజాలను. కాని 1917 సంవత్సరములో పెట్రొగ్రాడు, రష్యాలలో నిరంతరము మారుచున్న నాటకమును అర్థముచేసికోవలెనన్న పై సమస్యలనుగూర్చి కొంత ఆలోచించ వలసియుండును.

మానవులమార్పును, వృద్ధిని గూర్చిన కాగల్ మార్క్సు సిద్ధాంతమునకు "చరిత్రనుగూర్చి భౌతికదృష్టి" * అనిపేరు. కాలదోషము పట్టుటచేత సాంఘికరూపములస్థానేవచ్చు క్రొత్తసాంఘిక రూపములపై ఈ సిద్ధాంత మాధారపడియున్నది. ఉత్పత్తిచేయు సాంకేతికపద్ధతులు వానికెక్కుగా సంఘముయొక్క ఆర్థికరాజకీయరచన తదను గుణముగా మార్పుచెందును. అధికారవర్గమునకును, అధికారులస్వలాభమునకై

---

* Materialist conception of history.

పీడింపబడు వర్గమునకును నిరంతరవర్గకలహములవల్ల ఇది సంభవించును. ఎట్లన – పశ్చిమయూరోపులో ప్రాచీన ఫ్యూడల్ వర్గము స్థానమును బూర్జువా (మధ్యతరగతి) ఆక్రమించెను. నేడు ఇంగ్లాండులో, ఫ్రాంసులో, జర్మనీ మున్నగు దేశములలో ఆర్థికరాజకీయ రచనలనది నడిపించుచుండెను. దాని స్థానమును ముందుముందు కార్మికవర్గము ఆక్రమించనై యుండెను. రష్యాలో ఫ్యూడల్ వర్గము అప్పటికింకను అధికారములో నుండెను. పశ్చిమ యూరోపులో బూర్జువా కధికారమిచ్చుటకు జరిగిన మార్పు ఇక్కడికింకనురాలేదు. కాన మార్క్సుసిద్ధాంతావలంబులలో పెక్కురు, తప్పని సరిగా రష్యా, బూర్జువాదశ, పార్లమెంటరీదశ దాటవలసియుండుననియు, పిమ్మటనే చివరదశయగు కార్మిక ప్రజాప్రభుత్వ (Republic) దశ నందుకొనగలదనియు భావించిరి. వారి మత ప్రకారము మధ్యదశను దాటి ముందుకుపోవుటకు వీలులేదు. మార్చి 1917 విప్లవమునకు పూర్వము లెనిన్ సైతము మధ్యేమార్గ మవలంబించెను. అది - బూర్జువావిప్లవముకొరకై, జారుకును భూస్వాములకును వ్యతిరేకముగా రైతులతో (బూర్జువాను వ్యతిరేకించకుండ) సహకరించుట.

కాన ఇంగ్లీషు, ఫ్రెంచిదేశముల మాదిరిగా బూర్జువా డెమోక్రేటిక్ రిపబ్లికు తమకుండవలెనను సంపూర్ణాభిప్రాయముతో, మార్క్సుసిద్ధాంతావలంబులందరు—బోల్షివికులు, మెంషివికులు—ఉండిరి. నాయకత్వము వహించుచున్న కార్మికప్రతినిధులు కూడ ఇది తప్పదని అభిప్రాయపడిరి. అందువల్లనే వచ్చిన అధికారము సోవియట్ తన చేతులలో నుంచుకొనకుండ డూమాకు ధారాదత్తము చేసెను. వీరుకూడ తరుచు, మన అందరివలెనే, వారి సిద్ధాంతములకే వారు బానిసలైరి. నూతన పరిస్థితి సంభవించినదని, నూతన సిద్ధాంతముతో దానిని పరిష్కరించవచ్చునని గాని, ప్రాతసిద్ధాంతములు నూతన పరిస్థితులకు వేరొకవిధముగా ప్రయోగించవచ్చునని గాని

వారు భావించలేదు. నాయకులకన్న ప్రజలే అధికముగా విప్లవపరులై యుండిరి. సోవియట్‌ను నడిపించు మెన్‌షివికులు, కార్మికవర్గమువారు సాంఘికసమస్య లేమియు లేవనెత్తనేకూడ దనికూడ చెప్పిరి; వారి సద్యోలక్ష్యము రాజకీయ స్వాతంత్ర్యమును సాధించుటయే. బోల్షివికులు గోడమీద పిల్లివాటముగా నుండిరి. ముందుజాగ్రత్త చూచుకొనుచు, సంకోచించుచు నడుచు నాయకులున్నను మార్చి విప్లవము విజయవంతమయ్యెను.

లెనిన్‌రాకతో సమస్తమును మారిపోయెను. యదార్థపరిస్థితులతడు వెంటనే గ్రహించెను. నిజమగు నాయకునకుండు ఉపజ్ఞతో నతడు మార్క్సు కార్యక్రమము నవలంబించెను. పోరాటము ఇప్పుడు ధనికతత్వమునకు వ్యతిరేకముగా జరుగవలెను. బీదరైతుల సహకారముతో కార్మికవర్గ పరిపాలనము సాగవలెను. బోల్షివికులు వెంటనే అవలంబించదగు ప్రతిజ్ఞావాక్యములు మూడయ్యెను. (1) ప్రజాస్వామిక రిపబ్లికు (2) భూమికి సంబంధించిన ఆస్థిని ప్రభుత్వము వశపరచుకొనుట (3) కార్మికులకు 8 గంటలమాత్రమే పనిచేయుదినము. ఇట్టి ప్రతిజ్ఞావాక్యముల ప్రభావమువల్ల రైతులును, కార్మికులును, తమ కీ పోరాటమువల్ల ప్రయోజనములు చేకూరునని భావించిరి. సందిగ్ధము, ఫలశూన్యము అగు ఆదర్శ మదికాదు. ఆశను ప్రేరేపి జీవమునిచ్చు పోరాటమిది.

లెనిన్ నీతి ఏమనగా - బోల్షివికులు కార్మికులను బహుసంఖ్యాకులను తమ పక్షమునకు త్రిప్పుకొని, ఆవిధముగా సోవియట్‌ను తమ వశము చేసికొనుట; పిమ్మట సోవియట్ తాత్కాలిక ప్రభుత్వమునుండి అధికారమును లాగుకొనుట. వెంటనే వేరోక విప్లవము లేవదీయుట కత డిష్టపడలేదు. తాత్కాలిక ప్రభుత్వమును కూలద్రోయుటకు ముందు బహుసంఖ్యాకులగు కార్మికులను, సోవియట్‌ను తమపక్షమునకు త్రిప్పుకొనవలసియుండు నని అతడు నొక్కిచెప్పెను. ఈ ప్రభు

త్వముతో సహకరించకోరువారి నతడు కఠినముగా మందలించెను - అది విప్లవమునకు ద్రోహముచేసి నట్లగు ననెను. తరుణము రాకముందు ప్రభుత్వమును తిరుగద్రోయటకు ముందుకు చొచ్చుకొనిపోగోరిన వారినికూడ నతడు కఠినముగా మందలించెను. అతడు చెప్పినమాట లేమనగా :—

"కార్యారంభమునకు తరుణము వచ్చినప్పుడు పెట్టుకొన్న లక్ష్యమును స్వల్పమాత్రమైనను మీరి పని చేయరాదు."

అట్లుచేయుట గొప్పనేర మగును - అది ఉద్యమవిచ్ఛిత్తికి దారి తీయును.

ఇట్లు శాంతముగా, దృఢనిశ్చయముతో, అనివార్యమగు విధికి ప్రతినిధియో అన్నట్లుండి, పైకి హిమఖండమువలె కనిపించుచు, లోపల మండుచున్న అగ్నిజ్వాలవలె ప్రకాశించుచున్న అతడు, నిర్దిష్టమగు గమ్యస్థానము చేర ముందడుగు వేసెను.

---

## 151

# బోల్షివికులు అధికారమును చేజిక్కించుకొనుట

ఏప్రిల్ 9, 1933

విప్లవకాలమున చరిత్ర పెద్దపెద్ద అంగలు వేసికొనుచు ముందుకు పోవుచున్నట్లు తోచును. బాహ్యమున మార్పులు వెంటవెంటకనిపించును. అంతకన్న గొప్పమార్పు ప్రజలచైతన్యమున కలుగును.

గ్రంథములపై ఆధారపడు విద్య వారికి లేదుకాన గ్రంథములనుండి వా రేమియు నేర్చుకొనరు. తరుచు గ్రంథములు వెల్లడిచేయు విషయములకన్న గుప్తమైరచనవే ఎక్కువ. అనుభవమే, కష్టతరమైన, యదార్థమైన వారి పాఠశాల. విప్లవకాలమున అధికారమును గ్రహించుటకై ప్రాణముల నొడ్డి చేయుపోరాటములో ప్రజలభావములను మరుగుపరచు తెరలు జారిపోవును. వాని వెనుక, సంఘమునకు ఆధారభూతముగానున్న యదార్థస్వరూపములు వెల్లడియగును. కాన రష్యాలో విధివశమగు 1917 సంవత్సరమున, ప్రజాసామాన్యము — అందు ముఖ్యముగా విప్లవమునకు పట్టుగొమ్మవంటివారును, పట్టణముల నివసించువారును అగు పారిశ్రామిక కార్మికులు — జరుగుచున్న కార్యములబట్టి క్రొత్తపాఠములు నేర్చుకొనుచుండిరి. రోజుకు రోజు వారు మారిపోవుచుండిరి.

ఎచ్చటను అప్పుడు స్థిరత్వములేదు. ఒడిదుడుకులులేకుండ కాలము జరుగుటలేదు. జీవనము చలనశీలమై నిరంతరము మారుచుండెను. ప్రజలును వర్గములును భిన్నభిన్నమార్గములు పోవుచుండిరి. జారు ప్రభుత్వము తిరిగివచ్చుటకై కొందరు కుట్రలు పన్నుచుండిరి. కొందరు వారిరాక కెదురుచూచుచుండిరి. కాని వారు ఏ ప్రధానవర్గమునకును ప్రతినిధులుకారు. కాన వారిని మన ముపేక్ష చేయవచ్చును. ప్రధానమగు పోరాటము తాత్కాలిక ప్రభుత్వమునకును, సోవియట్‌కును మధ్య విజృంభించెను. అయినను సోవియట్లలో పలువురు ప్రభుత్వముతో సహకారము నెరపవలయుననియు, కొంతరాజీ చేసికోవలెననియు అభిప్రాయపడిరి. రాజీచేసికొనవలెనని కుతూహలపడినవారు ప్రభుత్వమును, అధికారమును తమ చేతికి వచ్చునేమో యని భయపడిరి. "ప్రభుత్వస్థానమును గ్రహించగల వా రెవరు? మేమా? కాని మాచేతులు వణకుచున్నవి...." అని సోవియట్ తరపున మాటాడు వా డొకడనెను. భీతచేతస్కులు, స్తంభితహస్తులు

ఇండియాలోకూడ ఇట్లనుట మనము వినియుంటిమి. కాని కాలము వచ్చినప్పుడు ధృడబాహువులకును, ధీరహృదయులకును లోటుండదు.

ఉభయపక్షములందును రాజీచేయువారు పోరాటము రాకుండ చేయుట కెంత ప్రయత్నించినను, తాత్కాలిక ప్రభుత్వమునకును సోవియట్టుకును పోరాటము అనివార్యమయ్యెను. యుద్ధముసాగించి మిత్ర దేశములకు సంతుష్టి కలిగించవలెనని ప్రభుత్వము కోరుచుండగా, రష్యాలో ఆస్థిగలవర్గములు తమ ఆస్థులను సాధ్యమైనంతవరకు రక్షించుకొనన కోరుచుండెను. ప్రజలతో ఎక్కువగా సన్నిహితులై యుండుట వలన సోవియట్‌కు వారి కోర్కెలు తెలియును. శాంతికావలెననియు, రైతులకు భూమి ఉండవలెననియు, రోజుకు 8 గంటలే పనిచేయవలెననియు మున్నగు పెక్కు కోర్కెలు కార్మికులు కోరుచుండిరి. ఇట్లు ప్రభుత్వమును సోవియట్ స్తంభింపచేసెను. సోవియట్ అన్ననో ప్రజలవల్ల స్తంభింపచేయబడెను. ఏలయన పార్టీలకన్న వారి నాయకులకన్నకూడ ప్రజలే అధికముగా విప్లవపరులై యుండిరి.

సోవియట్‌కు అనుకూలముగా నుండునట్లు ప్రభుత్వమును మార్చుటకు ప్రయత్నమొకటి జరిగెను. ర్యాడికల్ న్యాయవాదియు, వాగ్ధాటి గలవక్తయు అగు కెరెంస్కి అనువాడు ప్రభుత్వమున ప్రధానవ్యక్తి అయ్యెను. అత డొక కొయలిషన్ (సంయుక్త) ప్రభుత్వము నేర్పాటు చేయగలిగెను. దానికి సోవియట్‌లోని బహుసంఖ్యాకులగు మెన్షివికులు ప్రతినిధులకొందరిని పంపిరి. జర్మనీమీదికి దండయాత్ర పంపి, ఇంగ్లాండు-ఫ్రాంసుల మెప్పుపడయుటకై అతడెంతో ప్రయత్నించెను. సైన్యమునకుగాని ప్రజలకుగాని ఇంకను యుద్ధమాడుబుద్ధి లేనందున దండయాత్ర విఫలమయ్యెను.

ఇదియిట్లుండ సర్వ-రష్యన్ సోవియట్ కాంగ్రెసులు పెట్రోగ్రాడులో జరుపబడుచుండెను. ముందు జరిగిన కాంగ్రెసుకంటె వెనుక జరిగినది తీవ్రతరమయ్యెను. బోల్షివిక్ సభ్యులు నానాటికి అధికముగా

ఎన్నుకోబడుచుండిరి. ప్రబలముగానున్న పక్షములు రెండును — మెన్షివికులును, సోషల్‌రివల్యూషనరీలును (అనగా వ్యవసాయదారుల పార్టీయును) — సంఖ్యలో తగ్గిపోవుచుండిరి. బోల్షివికుల పరపతి, ముఖ్యముగా పెట్రోగ్రాడు కార్మికులలో, హెచ్చెను. దేశమంతటను సోవియట్లులేచినవి. సోవియట్ అనుమతిలేని ప్రభుత్వ ఉత్తరువులను ప్రజలు మన్నించకుండిరి. రష్యాలో ప్రబలమగు మధ్యతరగతి లేకుండుట తాత్కాలిక ప్రభుత్వము బలహీనముగా నుండుట కొక కారణము.

రాజధానిలో అధికారమునకై కొట్లాటలు జరుగుచున్న కాలమున రైతులు తమకు జరిగిన అన్యాయములను బలప్రయోగముతో చక్క చేసికొనుచుండిరి. నే నిదివరలో చెప్పినట్లు ఈ రైతులు మార్చి విప్లవముపై ఎక్కువగా ఉత్సాహము చూపుటలేదు; దానికి వ్యతిరేకులును కారు. వారిని కనిపెట్టి చూచుచుండిరి. అయితే పెద్దభూవసతి గల భూస్వాములు, తమ ఆస్తులు ప్రభుత్వమువశమగునని భయపడి, చిన్నచిన్న ఖండములుగా భూమిని భాగించి, బూటకపు ఆసాముల కియ్య దొడగిరి. వీ రాభూఖండములను భూస్వాములస్థానే ఉంచుకొందురు. భూస్వాములు తమ ఆస్తిలో చాలభాగము పరదేశుల కిచ్చివేసిరి. ఈ విధముగా తమకున్న ఆస్తిని కాపాడుకొనుటకు వారు ప్రయత్నించిరి. రైతుల కిది కంటకింపుగానుండెను. భూమిని అమ్ముట కూడదని ఆజ్ఞాపించమని వారు ప్రభుత్వమును కోరిరి. కాని ప్రభుత్వము సంకోచించెను. అది ఏమి చేయగలదు? ఎవరికిని కోపమురాకుండ నడుచుకోవలెనని దాని అభీప్సితము. అప్పుడు రైతులు, తమంతతామే కార్యరంగమునకు దిగిరి. ఏప్రిల్‌లోనే వారిలోకొందరు వారి వారి భూస్వాములను నిర్బంధములో పెట్టి, వారి ఆస్తులను స్వాధీనముచేసికొని పంచుకొనిరి. రణరంగమునుండి తిరిగివచ్చిన సైనికులు (వీరునూ రైతులగుటచే) ఇందులో ప్రముఖపాత్ర వహించిరి. ఉద్యమము వృద్ధి

యగుచువచ్చెను. చివరకు భూములన్నియు మూక ఉమ్మడిని రైతులు వశముచేసి కొనిరి. జూన్ నెలనాటికి సైబీరియన్ స్టెప్పీలకుకూడ ఇది ప్రాకెను. సైబీరియాలో పెద్దభూస్వాములు లేరు. కాన రైతులు చర్చికి, మఠములకు చెందినభూమిని వశముచేసికొనిరి.

బోల్షివిక్ విప్లవమునకు అనేక మాసములకుముందు, రైతులు తమంతట తాము విజృంభించి పెద్దభూవసతులను వశముచేసికొనుట గమనించవలసిన విషయము. క్రమపద్ధతిని భూములన్నియు రైతుల కైవశము వెంటనే కావలయుననియే లెనిన్ అభిప్రాయము. క్రమబద్ధముకాకుండ అరాచకముగా భూములను వశము చేసికొనుట కత డెంతమాత్రము ఇష్టపడలేదు. కాన బోల్షివికులు తరువాత అధికారములోనికి వచ్చినప్పుడు, రైతులే భూస్వాములైయుండుట వారు గమనించిరి.

లెనిన్‌వచ్చిన సరిగా ఒకనెలకు వేరొక ప్రసిద్ధ దేశాంతరవాసి పెట్రోగ్రాడుకు తిరిగివచ్చెను. అతనిపేరు ట్రాట్‌స్కీ. త్రోవలో బ్రిటిషువారు ఆటంకపరచిన పిమ్మట అతడు న్యూయార్కునుండి తిరిగి వచ్చెను. ట్రాట్‌స్కీ ప్రాతబోల్షివికులలో ఒకడు కాడు. అతడిప్పుడు మెన్షివికుడు కాడు. కాని త్వరలోనే అతడు లెనిన్ పక్షమున చేరి, పెట్రోగ్రాడు సోవియట్‌లో ప్రముఖనాయకుడయ్యెను. అతడు గొప్పవక్త. చక్కని రచయిత. శక్తిపూరితుడై అత డొక విద్యుత్ బాటరీవలె నుండెను. లెనిన్ పక్షమున కత డమితసహాయకారిగా నుండెను. అతని ఆత్మచరిత్రనుండి — నా జీవితమని దానిపేరు — దీర్ఘమైన కొన్నివాక్యము లుదహరింతును. మోడరన్ సర్కస్ అను భవనమున అతడు ఉపన్యసించిన సమావేశముల ఉదంత మందు కలదు. ఇది చక్కనివ్రాత మాత్రమే కాదు. పెట్రోగ్రాడులో 1917 సంవత్సరమునాటి విప్లవదినముల దృశ్యము. ఉద్రేకసహితమగు ఆ దృశ్యము విస్పష్టముగా మనకన్నులకు కట్టినట్లుండును.

"ప్రజలనిశ్వాసములతో, నిరీక్షణముతో నిండిన తీవ్రవాతావరణము - మోడరన్ సర్కసుకు సుపరిచితమైన అరపులతో, ఉద్రేకపూరితమగు కేకలతో అది ప్రతిధ్వనించెను. నా పై భాగమున, నా చుట్టును మోచేతులు, వక్షములు, శిరస్సులు క్రిక్కిరిసి పోయెను. మానవదేహసముదాయ మను వెచ్చని గుహనుండి నే నుపన్యసించితిని. చేతులు చాచితినా ఎవరో ఒకరు నాచేతులకు తగులుచుండిరి. వారు కృతజ్ఞతతో తప్పుకొనుచుండిరి. చేతులు తగిలినందుకు సంకోచింప వద్దని, ఉపన్యాస మాపవద్దని, కొనసాగించమని వారి భావమైనట్లు నేను గ్రహించితిని. ఉద్రిక్తులగు నట్టి మానవసమూహముయొక్క తీవ్రోత్సాహమును ఎట్టి వక్తయైనను, ఎంతగా అలసిపోయినవాడైనను కాదనలేకుండెను. తెలిసికొని, గ్రహించి, తదనుగుణముగా నడుచుకోవలెనని వారాశించియుండిరి. గుమిగూడిన మానవసంఘ మొక్కటిరై మాత్ర విషయములను తెలిసికోవలెనని అది చూపు తీవ్రేచ్ఛ నా పెదవులద్వారా వారికి జ్ఞానము నాదేశించుచుండెనా యన్నట్లు నా కప్పుడప్పుడు తట్టినది. నాలో జనించిన సానుభూతి ఒత్తిడివల్ల ముందుగా ఆలోచించి చెప్పదలచుకొన్న మాటలు, హేతువులు జారిపోవును. ఇతర పదములు, ఇతర హేతువులు - వక్త చెప్పదలచుకొననివి, ప్రజలకు కావలసినవి, అంతఃకరణమునుండి సంపూర్ణశక్తితో బయల్వెడలివచ్చును. అట్టిసమయములో నేను బయట నిలుచుండి వక్తమాట లాలించుచుంటినా అనిపించును. నేను ఉద్దేశపూర్వకముగా చేసిన హేతువుల తాకుడువల్ల వక్తమాటరాక నిద్రలో నడుచువానివలె కూలిపోవునాయని పించును.

"మోడరన్ సర్కస్ అట్టి విధముగా నుండెను. ఉజ్వలము, శాంతము, ఉన్మత్తత అను విశిష్టరూపములు అది దాల్చును. శాంతముగా, స్తన్యముత్రాగుచుండిన శిశువుల తల్లులనుండి ఆమోదసూచ

కము, క్రోధోద్రేకము అను కేకలు వెలువడుచుండెను. అచ్చట చేరిన మానవసంఘ మంతయు నట్లే యుండెను. శిశువులవలె వారు ఎండిన పెదవులతో విప్లవముయొక్క చనుమొనలను పట్టుకొని పాలు పీల్చుచున్నట్లుండిరి. కాని ఈ శిశువు త్వరలోనే యుక్తవయస్కుడయ్యెను."

నిరంతరము మారుచున్న విప్లవనాటకము పెట్రోగ్రాడులోను, రష్యాయందలి ఇతర నగరములలోను, గ్రామములలోను నడిచిపోయెను. శిశువు యుక్తవయస్కుడై పెద్దవాడాయెను. దుర్భర యుద్ధప్రయాసకు ఫలముగా అంతటను ఆర్థికదుస్థితి ఏర్పడుచున్నట్లు విదితమగుచుండెను. అయినప్పటికిని లాభపరులు యుద్ధలాభములు సంపాదించుచునేయుండిరి.

ఫాక్టరీలలోను, సోవియట్లలోను బోల్షివికుల బలమును, ప్రతిష్ఠయు పెంపొందుచువచ్చెను. ఇదిచూచి భయపడి కెరెంస్కి వానినణచివేయ నిశ్చయించెను. మొట్టమొదట లెనిన్‌ను అప్రతిష్ఠపాలు చేయుటకై అబద్ధప్రచారము జరిగెను. రష్యాను కష్టములలో ముంచుటకై అతడు జర్మనుల ఏజెంటుగావచ్చి పనిచేయుచున్నాడనిరి. జర్మన్ అధికారుల సహాయముతో గదా అతడు స్విట్జర్లాండునుండి జర్మనీ మీదుగా తిరిగివచ్చెను! మధ్యతరగతులవారిలో లెనిన్‌పలుకుబడి పూర్తిగా తగ్గిపోయెను. అతడు ద్రోహియని వారు తలచిరి. లెనిన్‌ను నిర్బంధించుటకై కెరెంస్కి ఉత్తరవు జారీచేసెను. అతడు విప్లవపరుడనికాదు నిర్బంధము. జర్మనుల కనుకూలుడగు దేశద్రోహి అని. ఇట్టి అభియోగ మసత్యమని నిరూపించుటకు విచారణ జరిగినచో బాగుండునని లెనిన్ భావించెను. కాని అతని సహచరులందుకు సమ్మతించలేదు. రహస్యస్థలమున దాగుకొమ్మని అతనిని బలవంతముచేసిరి. ట్రాట్‌స్కీకూడ బంధితుడయ్యెను. కాని పెట్రోగ్రాడు సోవియట్‌వారు పదేపదే చెప్పుటచే విడిపించబడెను. ఇతర

బోల్షివికు లనేకులు బంధింపబడిరి. వారి వార్తాపత్రిక అణచివేయబడెను. బోల్షివికుల కనుకూలురని ఊహింపబడిన కార్మికులనుండి ఆయుధములు పెరికివేసిరి. తాత్కాలిక ప్రభుత్వముపై ఈ కార్మికులవైఖరి నానాటికి విషమించుచుండెను. వారు కలహశీలురై బెదరించుచుండిరి. దానికి వ్యతిరేకముగా పెద్దపెద్ద ప్రదర్శనము లుండుండియు జరుపబడుచుండెను.

ఈ మధ్యలో నొకవిశేషము సంభవించెను. ప్రతి – విప్లవ మొకటి తలయెత్తెను. కోర్నిలోవ్ అను మునలిసేనాని యొకడు, ఒక సైన్యమును వెంటబెట్టుకొని, తాత్కాలిక ప్రభుత్వముతో పాటు, విప్లవము నణచివేయుటకై రాజధాని మీదికి దండెత్తివెళ్లెను. రాజధాని సమీపించుసరికి అతని సైన్యము మంచువలె కరిగిపోయెను. సైనికులందరును విప్లవపక్షమును చేరిరి.

కార్యగతి వేగముగా జరిగిపోవుచుండెను. ప్రభుత్వమునకు సోవియట్ ప్రతిస్పర్ధి అగుచుండెను. ప్రభుత్వపు టుత్తరవుల నది రద్దుచేయుచుండెను. లేదా తద్వ్యతిరేకముగా ఉత్తరవులు జారీచేయుచుండెను. స్మోల్నీ ఇన్స్టిట్యూటు సోవియట్‌కు ఆవాసస్థానము. పెట్రోగ్రాడులోని విప్లవమున కది ప్రధానకార్యస్థానము. ఈ స్థలమునందే కులీనుల బాలికలకొరకై ప్రయివేటు పాఠశాల నడిపించుచుండెడివారు.

పెట్రోగ్రాడు పొలిమేరలకు లెనిన్‌వచ్చెను. తాత్కాలిక ప్రభుత్వమునుండి అధికారమును లాగుకొనుటకు సమయమువచ్చినదని బోల్షివికులు నిశ్చయించిరి. తిరుగుబాటు జయప్రదముగా జరుగుటకవసరమగు ఏర్పాట్లు చేయుటకు ట్రాట్‌స్కీ నియమింపబడెను. ఎప్పుడు? ఏ ముఖ్యప్రదేశములు? స్వాధీనముచేసికొనవలెనో ముందుగానే ఆలోచించి జాగ్రత్తగా పటములు వేసికొనిరి. నవంబరు 7 వ తేదీని తిరుగుబాటు చేయుటకు నిశ్చయించిరి. ఆ దివమున సోవియట్ల

సర్వరష్యన్ కాంగ్రెసు సమావేశము కానుండెను. లెనిన్ ఈ తేదీని నిశ్చయించెను. అందు కతడు చెప్పిన కారణ మేమనగా "నవంబరు 6 వ తేదీ చాలా పెందలకడ. మనముచేయు తిరుగుబాటు సర్వరష్యా పై ఆధారపడియుండవలెను. 6 తేదీ నాటికి కాంగ్రెసు డెలిగేట్లు అందరును వచ్చియుండరు. సరిగదా నవంబరు 8 తేదీ చాలా ఆలస్యము. అప్పటికి కాంగ్రెసు కట్టుదిట్టమగును. అనేకమంది ప్రజలు వేగముగా, నిష్కర్షగా కార్యము సాధించుట కష్టము. కాంగ్రెసు సమావేశమగు దినమున నవంబరు 7 తేదీనే మనము కార్యరంగమున కురుకవలెను. అప్పుడు మనము దానినడుగవచ్చును — ఇదిగో అధికారము. దీనినెట్లు వినియోగింతువు?" అని విప్లవకారులలో ఘటికుడైన లెనిన్ ప్రసన్న బుద్ధితో ఇట్లు చెప్పెను. విప్లవమున విజయము చిల్లరవిషయముల మీదకూడ ఆధారపడియుం* డునని అతనికి చక్కగా తెలియును.

నవంబరు 7 వ తేదీ వచ్చెను. సోవియట్ సైనికులు వెళ్లి ప్రభుత్వభవనముల నాక్రమించిరి. టెలిగ్రాఫ్ ఆఫీసు, టెలిఫోను ఎక్స్చేంజి, స్టేట్ బాంకు మున్నగు ప్రధానమగు మర్మస్థానముల నాక్రమించిరి. ప్రతిఘటనలేదు. ఒక బ్రిటిష్ ఏజెంటు ఇంగ్లాండుకు పంపిన అధికార రిపోర్టులో ఇట్లున్నది — "తాత్కాలిక ప్రభుత్వము మంచువలె కరిగిపోయినది."

నూతన ప్రభుత్వమునకు లెనిన్ ప్రెసిడెంటు ఆయెను.

---

* బోల్షివికులు అధికారమువశము చేసికొనుటకు నవంబరు 7 తేదీ లెనిన్ నిర్ణయించినట్లు, అప్పుడు పెట్రోగ్రాడులోనున్న రీడ్ అను అమెరికా పత్రికారచయిత చెప్పెను. కాని, అప్పు డచ్చటనున్న ఇతరులు దీనిని కాదందురు. లెనిన్ దాగుకొని యుండెను. ఇతర బోల్షివిక్ నాయకులు ఉపేక్ష చేయుదురనియు, తరుణమును మించబెట్టుదురనియు అతడు భయపడెను. కాన నతడు కార్యాచరణకు పూనుకోమని నిరంతరము చెప్పుచుండెను. 7 వ తేదీని వ్యవహారము మించరాగా వెంటనే కార్యరంగమునకు వారు దిగిరి.

ట్రాట్‌స్కీ విదేశమంత్రి ఆయెను. మరుసటి దినమున నవంబరు 8 వ తేదీని లెనిన్ స్మోల్నీ ఇన్‌స్టిట్యూట్ లోనున్న సోవియట్ కాంగ్రెసుకు వచ్చెను. అది సాయంసమయము. ఎంతో ఉల్లాసముతో కాంగ్రెసత నికి స్వాగతము చెప్పెను. మహానాయకుడు లెనిన్ ప్లాట్‌ఫారం దగ్గరకు వెళ్లినప్పుడు ఎట్లున్నదియు, ఆ సందర్భమున నచ్చట ఉన్న అమెరికన్ పత్రికారచయిత రీడ్ అనువాడు ఇట్లు వర్ణించెను—

"పొట్టిగా, లావుగా, బొద్దుగా అతడుండెను. పెద్దతల స్ఫుటముగా పెద్దభుజములపై నిలిచినట్లుండెను. చిన్నకళ్లు, చితక ముక్కు, వెడల్పై ఔదార్యమును సూచించు నోరు; బరువైన గడ్డము, ప్రస్తుతము నున్నగా క్షౌరము చేయించుకొని ఉండెను. కాని వెంట్రుకలు మొలుచుచు వెనుకటి కాలమందున్నట్టియు, ముందు కాలమున నుండునట్టియు ప్రసిద్ధమైన అతని గడ్డమును సూచించు చుండెను. అందవికారమగు దుస్తులు ధరించియుండెను. అతని నిజారు అతనికి సరిపోవునది కాదు. చాలా పొడుగుగా నుండెను. ప్రజలు పూజించదగినన్ని లక్షణము లతనిలో కనిపించుటలేదు. అతడు ఒక వింత ప్రజానాయకుడు - శుద్ధమేధాశక్తివల్లనే నాయకు డైనవాడు. ఉదాసీనుడు. హాస్యములేదు. దృఢనిశ్చయము కలవాడు. అసంగుడు. ఆకర్షించు విశిష్టసహజలక్షణములు లేవు. కాని అతని కున్నది - గంభీరగూఢభావములను అరటిపండు ఒలిచి చేతిలో పెట్టి నట్లు చెప్పగలశక్తి, ప్రకృతపరిస్థితులను చక్కగా వేర్పరచుట, చొరవగల గొప్ప మేధతో సూక్ష్మగ్రహణమును సమ్మేళనము చేయుట."

సంవత్సరకాలములో తటస్థించిన రెండవ విప్లవము జయప్రద మయ్యెను. ఇంతవరకది శాంతియుతముగా జరిగెను. బహుకొద్ది రక్తపాతముతో అధికారము చేతులు మారెను. మార్చిలో ఇంతకన్న అధికముగా పోరాటములు జరిగెను. చావులు వచ్చెను. మార్చి విప్ల

వము క్రమబద్ధము కాకుండ అనైచ్ఛికముగా తటస్థించెను. నవంబరు విప్లవమున్నతో జాగ్రత్తగా క్రమబద్ధముచేయబడినది. చరిత్రలో మొదటి పర్యాయము, కటికిదరిద్ర ప్రజల ప్రతినిధులు. ముఖ్యముగా పారిశ్రామిక కార్మికులు, దేశమున కధినేతలైరి. కాని అంతసులభముగా విజయమును వారు నిలుపుకోజాలరు. వారి చుట్టును తుపానులు చెలరేగుచుండెను. ఏక్షణమందైనను, అప్రతిహతశక్తితో, వారిపై నవి విరుచుకొని పడనున్నవి.

లెనిన్, అతని నూతన బోల్షివిక్ ప్రభుత్వమును, ఎదుర్కొనవలసిన పరిస్థితు లెట్లుండెను? రష్యాసేన విచ్ఛిన్నమైనప్పటికిని, వారు పోరలేనప్పటికిని జర్మన్ యుద్ధము జరుగుచునే యుండెను. దేశమందంతట అల్లరులు తలయెత్తెను. సైనికులును, బందిపోటు దొంగలును దేశమున సంచరించుచు ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించుచుండిరి. ఆర్థిక దుస్థితి సంభవించెను. తిండి కరువయ్యెను. ప్రజలు క్షుధాబాధితులైరి. విప్లవమునణచుటకు ప్రాత ప్రభుత్వప్రతినిధులు సంసిద్ధులైయుండిరి. ధనికతత్వము ప్రకారము ప్రభుత్వ విధానముండెను. ప్రాత ప్రభుత్వ ఉద్యోగులు నూతన ప్రభుత్వముతో సహకరించ నిరాకరించిరి. బాంకర్లు డబ్బు ఇచ్చుటలేదు. టెలిగ్రాపు ఆఫీసు సైతము టెలిగ్రాముల పంపకుండెను. ఎంతటిధైర్యశీలునైన భయపెట్టగల కష్టపరిస్థితులవి.

లెనిన్ సహచరులతోకూడ పనిచేయుటకు ప్రారంభించెను. జర్మనీతో సంధి మున్ముందు పరిష్కరించవలెను. వెంటనే వారు యుద్ధవిరమణమునకు ఏర్పాటు కావించిరి. ఉభయదేశముల ప్రతినిధులును బ్రెస్ట్ — లిటోవిస్కులో సమావేశమైరి. బోల్షివికులు పోరాడే స్థితిలో లేరని జర్మనులకు చక్కగాతెలియును. కాన గర్వముచే, కన్నుకానక న్యూనతపరుచు పెద్దషరతులు జర్మనులు కోరిరి. బోల్షివికులకు ముఖ్యముగా కావలసినది సంధి. షరతులనుచూచి వారు

ఆశ్చర్యపోయిరి. ఈ షరతులను నిరాకరించవలయునని పలువురు అభిప్రాయపడిరి. ఏమి వచ్చినను సరే సంధి చేసికొనితీరవలసినదే యని లెనిన్ పట్టుబట్టెను. సంధి సమావేశములో నొక రష్యన్ ప్రతినిధియైన ట్రాట్‌స్కీని జర్మనులు, ఒక సాంఘికసమావేశమునకు, సాయంకాలపుదుస్తులు (Evening dress) వేసికొనిరమ్మని పిలిచిరట. అతనికి ఏమియుతోచలేదు. కార్మికుల ప్రతినిధి బూర్జువాల ఉడుపులు వేసికొనుట ఉచితమా? సలహాకోరుచు అతడు లెనిన్‌కు టెలిగ్రాం పంపెను. వెంటనే లెనిన్ యిట్లు ప్రత్యుత్తరమంపెను— "సంధి సమకూర్చుటకు సహాయభూతముగానున్న యెడల, లంగా కట్టుకునైనా వెళ్లవలెను."

సంధిషరతులనుగూర్చి సోవియట్ వాదోపవాదములు చేయుచున్న సమయమున జర్మనులు పెట్రోగ్రాడు పైకి ఎగబడివచ్చుచుండిరి. సంధిషరతులను మరింత బిగించిరి. చివరకు లెనిన్‌సలహా సోవియట్ అంగీకరించెను. తమకిష్టమే మాత్రమును లేకున్నను మార్చి 1918 లో బ్రెస్ట్ — లిటోవిస్క్ సంధి పై వారు చేవ్రాళ్లుచేసిరి. ఈ సంధి ప్రకారము, పడమరనున్న పెద్ద రష్యన్ భూఖండమును జర్మనులు తమదేశములో కలుపుకొనిరి. ఏమైనను సంధికి సమ్మతించవలసినదే; లెనిన్ అభిప్రాయ ప్రకారము "సంధి కావలెనని సైన్యమే కాళ్లకు బుద్ధిచెప్పి పలికినది."

ప్రపంచయుద్ధములో తగుల్కొన్న సర్వరాజ్యములమధ్య సంధి తీసికొనిరావలెనని సోవియట్ మొదట ప్రయత్నించెను. అధికారము చేజిక్కిన మరుసటిదినమందే, ప్రపంచముతో సంధిచేసికొనుటకు వారధికారపత్రమును జారీచేసిరి. జారుల రహస్యసంధులమూలమున తమకు రాదగ్గసమస్త హక్కులను వదలుకొనుచున్నట్లు వారు స్పష్ట పరిచిరి. కాంస్టాంటినోపుల్ టర్కులదై యుండవలసినదే యని వారు చెప్పిరి. ఏదేశమును, తమ దేశములో కలుపుకొనమని

చెప్పిరి. యుద్ధమాడుచున్న రెండుపక్షములవారును ఇంకను తమకే విజయము వచ్చుననియు, యుద్ధమునుండి రానున్నలాభములు తామే పొందవలెననియు ఆశించియుండుటచే సోవియట్ సూచన పెడచెవిని పడెను. ఈ సూచనచేయుటలో సోవియట్ ఉద్దేశము కొంతవరకు ప్రచారమునకే అనుటకు సందేహములేదు. ప్రతిదేశమందలి ప్రజలను, యుద్ధమం దలిసిపోయిన సైనికులను ప్రేరేపింప వారు ప్రయత్నించిరి. ఇట్లు చేసినచో ఇతర దేశములలో సాంఘికవిప్లవము వచ్చునని భావించిరి. ప్రపంచ విప్లవమును వారు కోరుచుండిరి. అట్లు చేసినప్పుడే తమ విప్లవమును తాము సంరక్షించుకోగలమని వారు తలచిరి. ఫ్రెంచి, జర్మన్ సైనికులమీద వారి ప్రచారము బాగా పనిచేసినదని ఇది వరలో చెప్పియుంటిని.

జర్మనీతో చేసికొన్న బ్రెస్ట్ — లిటోవిస్క్ సంధి, తాత్కాలికమే అనియు, చిరకాలము నిలుచునదికాదనియు లెనిన్ భావించెను. క్రియకు జరిగిన దేమనగా, మిత్రమండలిచేత పడమటి యుద్ధరంగమున జర్మనీ పరాజయ మందినతోడనే, సోవియట్ తొమ్మిదిమాసముల తరువాత సంధిని రద్దుచేసెను. లెనిన్ కోరిన దేమనగా — అలసిన కార్మికులకును, సైన్యమందు పనిచేయు రైతులకును కొంచెము విశ్రాంతినీయవలెనని, కొంత ఊపిరిపీల్చుకొనుటకు అవకాశము కలిగించవలెనని. అట్లు చేసినచో, వారు స్వదేశమునకువచ్చి విప్లవము సాధించిన కార్యమును స్వయముగా చూడగల్గుదురు. భూస్వాము లంతరించిరనియు, భూమి రైతులదే అనియు వారు గ్రహించవలెనని అతడు కోరెను. తమచే పనిచేయించుకొని లాభములుపొందు ధనికు లంతరించిరని పారిశ్రామిక కార్మికులు గ్రహించవలెననియు అతడుకోరెను. విప్లవమువల్ల కలిగినలాభములను వారు మెచ్చుకొందురనియు, వారి పక్షమును పూనుదురనియు, వారి నిజశత్రువు లెవరో వారు గ్రహింతురనియు అతడు తలచెను. అంతఃకలహము రానున్నదని తెలిసిన లెనిన్ అట్లు

తలపోసెను. అతని నీతియే కొంతకాలమునకు విజయవంతమైనది. యుద్ధరంగమునుండి రైతులు తమ పొలములకు వెళ్లిరి; కార్మికులు తమ ఫాక్టరీలకు వెళ్లిరి. వారు బోల్షివికులునుకారు, సోషలిష్టులును కారు. కాని విప్లవపోషకులలో వారు ప్రధమశ్రేణి యందుండిరి. కారణము — విప్లవముద్వారా తమకు వచ్చిన లాభముల వదిలిపెట్టు కొనుటకు వారిష్టపడలేదు.

జర్మనులతో ఏదోయొక విధముగా పొత్తుకుదుర్చుకొనుటకు ప్రయత్నించుచు బోల్షివిక్ నాయకులు దేశపరిస్థితుల చక్కబరుచుటకు కూడ పూనుకొనిరి. వెనుక సైన్యములో పనిచేసిన ఉద్యోగులును, సాహసులును మరఫిరంగులతో, యుద్ధసామగ్రితో బందిపోటు దొంగల వృత్తి నవలంబించి, పెద్దపట్టణముల నడిగడ్డ ప్రజలను కాల్చుచు దోచుకొనుచు ఉండిరి. ప్రాత అరాచక పక్షములవారు (Anarchist Parties) కూడ, సోవియట్ పక్షము నంగీకరించక, అనేకవిధములుగా తొందరలు కలుగజేయుచుండిరి. అట్టి గుంపులవాండ్లను, ఇతరులను సోవియట్ ప్రభుత్వము కఠినముగా దండించి అణచివేసెను.

సోవియట్ ప్రభుత్వమునకువచ్చిన తరువాత పెద్ద ప్రమాదము వేర్వేరు సివిల్ శాఖలలో ఉద్యోగములు చేయుచుండిన వారివల్ల కలిగెను. వారిలో అనేకులు బోల్షివిక్ ప్రభుత్వముక్రింద పనిచేయుటకు గాని, వారితో సహకరించుటకుగాని సమ్మతించలేదు. లెనిన్ ఒక సిద్ధాంతము నేర్పరిచెను — "పనిచేయనివారికి తిండియు ఉండదు." పనిలేదా తిండిలేదు. సహకరించని సివిల్ ఉద్యోగులందరు వెంటనే పదవీచ్యుతులుగా జేయబడిరి. బాంకర్లు ఖజానాలు తెరుచుటకు నిరాక రించిరి. డైనామైట్‌తో ఖజానాపెట్టెలు తెరువబడెను. సహకరించని ప్రాతకాలపు ఉద్యోగుల నెట్లు లెనిన్ తిరస్కరించెనో క్రింది ఉదాహర ణమునుబట్టి తెలియవచ్చుచున్నది. సర్వసేనాని అతని ఉత్తరవుల పాలించ నిరాకరించెను. వెంటనే అతనిని ఉద్యోగమునుండి తొల

గించెను. అయిదు నిమిషములలో ఒకపడుచు బోల్షివిక్ లెఫ్టినెంటు, క్రైలెంకొ అనువాడు, సర్వసేనానిగా నియమింపబడెను.

ఇట్టి మార్పులు జరిగినప్పటికిని రష్యాలోని ప్రాతవిధాన మట్లే ఉండెను. పెద్దదేశమందు ఒక్కమారుగా సమత్వము తెచ్చిపెట్టుట (Socialise) సులభసాధ్యము కాదు. పరిస్థితుల తొందరవల్ల దేశము మారినదిగాని లేకున్న రష్యామారుటకు ఎన్నియో సంవత్సరములు పట్టియుండును. భూస్వాములను రైతులు తరుమగొట్టినట్లే, కార్మికులు సైతము, ప్రాతయజమానులపై గల క్రోధముకొద్ది వారిని తరుమగొట్టి, ఫాక్టరీలు తమవశము చేసికొనిరి. వెనుకటి ధనికవర్గమునకు జెందిన యజమానులకు వారి ఫాక్టరీలు తిరిగి ఇచ్చుటకు సోవియట్‌కు సాధ్యముకాదు. కాన వారే వానిని తమవశమం దుంచుకొనిరి. తరువాత సంభవించిన అంతఃకలహకాలమున ఈ యజమానులే కొన్నివేళల ఫాక్టరీల యంత్రములను ధ్వంసముచేయ ప్రయత్నించగా మరల సోవియట్ ప్రభుత్వము కలుగజేసికొని ఫాక్టరీల క్షేమమునకై వానిని తమ వశమందుంచుకొనిరి. ఈ విధముగా ఉత్పత్తిసాధనముల సమత్వము (Socialisation) అనగా ఒకవిధమగు స్టేటు సోషలిజం, లేదా ఫాక్టరీలకు ప్రభుత్వమే యజమానియై యుండుట — సామాన్యపరిస్థితులలో వచ్చునప్పటికన్న త్వరగా వచ్చెను.

సోవియట్ పరిపాలనచేయుచున్న మొదటి తొమ్మిదిమాసములలో రష్యాలో జీవితపరిస్థితులు ఎక్కువగా మారలేదు. బోల్షివిక్కులు ప్రతికూల విమర్శలను సహించుచుండిరి. తిట్లు సైతము భరించుచుండిరి. బోల్షివికులకు వ్యతిరేకముగా పత్రికలు వెలువడుచునే యుండెను. ప్రజలు సామాన్యముగా తిండిలేక కుందుచుండిరి. భాగ్యవంతుల కింకను ఆడంబర వేషములకును, భోగలాలసత్వమునకును తగినధనము సమృద్ధముగా నుండెను. వినోదమునుగూర్చు రాత్రి ఫలహార హోటళ్లలో వారు గుమిగూడియుండిరి. గుర్రపు పందెములు మున్నగు

క్రీడలు జరుగుచుండెను. పెద్దపట్టణములలో మరింత దబ్బున్న బూర్జువాలు కనిపించుచుండిరి. సోవియట్ ప్రభుత్వము పతనముకానున్న దని ఆశించి వీరు సంతోషించుచుండిరి. జర్మనీకి వ్యతిరేకముగా, దేశభక్తులై, యుద్ధము సాగించవలెనని కుతూహలపడిన వీరు ఇప్పుడు, పెట్రోగ్రాడును జర్మనులు సమీపించుటచూచి ఉత్సవములు చేసిరి. తమ రాజధానీనగరమును జర్మనులు ప్రవేశింతురనుట వారికి మోద కారణముగా నుండెను. పరదేశవాసుల పరిపాలనము కన్న సాంఘిక విప్లవమే వారికి అనిష్టముగా నుండెను. ముఖ్యముగా వర్గములకు సంబంధించినంతవరకు పరిస్థితు లెప్పుడును ఈ విధముగానే ఉండును.

ఒడుదుడుకులు లేకుండ ఒకమాదిరిగా కాలము గడచిపోవు చుండెను. ఇప్పుడు ఎంతమాత్రమును బోల్షివికులక్రౌర్యము లేదు. ప్రసిద్ధమగు మాస్కో బాలెట్ నృత్యములు క్రిక్కిరిసిన శాలలలో రోజుకు రోజు జరుగుచునే పోవుచుండెను. జర్మనులు పెట్రోగ్రా డును వశముచేసికొందురన్న భయముతో సోవియట్ ప్రభుత్వము మాస్కోకు తరలివెళ్లెను. నాటినుండియు మాస్కోయే వారి రాజధానిగా నుండెను. మిత్రమండలివారి రాయబారులు ఇంకను రిష్యాలోనే ఉండిరి. జర్మనులచేతులలో పెట్రోగ్రాడు చిక్కగలదను భయముతో వారు అచ్చటినుండి పారిపోయిరి. మారుమూలనున్న వొలాగ్డా అను చిన్నపట్టణములో సురక్షితముగా వారు స్థావరమేర్పరచుకొనిరి. ఉండుండియు వారికి చేరుచున్న వదంతులకు నిరంతరము వారు సంభ్రమముతో భయపడుచుండిరి. వార్తలు నిజమేనా యని తరుచు ఆదుర్దాతో వారు ట్రాట్‌స్కీని అడుగుచుండిరి. ముసలిరాయబారుల ఆదుర్దానుచూచి ట్రాట్‌స్కీ విసుగుకొనెను. వొలోగ్డాలోనున్న పెద్ద ఉద్యోగుల (Excellencies) తొట్రుబాటు తగ్గుటకై బ్రొమైడ్ (Bromide) అనుమందు పుచ్చుకొమ్మని అతడు వ్రాసి ఈయవలెనను కొనెను। త్వరలో ఉద్రేకము భయము చెందు వారి నరములను సాదు

చేయుటకు వైద్యులు బ్రొమైడ్‌మందు నిత్తురు.

బాహ్యమునకు తొందరలు లేకుండ కాలముగడచిపోవు చున్నట్లే కవిపించెను. లోతుకుదిగినచో అందు కల్లోలములు కానవచ్చు చుండెను. బోల్షివికులు చిరకాలముందురని ఎవ్వరును అనుకోలేదు. ప్రతియొక్కడును కుట్రలు పన్నుచుండెను. దక్షిణరష్యాలోని యూక్రైన్‌లో జర్మను లొక కీలుబొమ్మ రాజ్యమును స్థాపించిరి. సంధి చేసుకొన్నప్పటికిని సోవియట్‌పై పడుటకు తయారగుచున్నట్లు తోచు చుండెను. మిత్రమండలి వారు జర్మనులను ద్వేషించుచుండిరి. అంత కన్న అధికముగా వారు బోల్షివికులను ద్వేషించుచుండిరి. 1918 సంవత్సరము మొదటిలో అమెరికా అధ్యక్షుడు విల్‌సన్ సోవియట్ కాంగ్రెసుకు మనఃపూర్వకముగా అభినందనములను పంపెను. తరు వాత నతడు పశ్చాత్తాపపడి తన యభిప్రాయమును మార్చుకొనెను. ఇట్లు మిత్రమండలి వారు లోపాయికారీగా ధనసహాయముచేయుచు ప్రతి - విప్లవకార్యములకు తోడ్పడుచుండిరి. అంతేకాదు; రహస్యముగా నందు పాల్గొనుచుండిరి కూడ. మాస్కోనిండ విదేశచారులు తిరుగు చుండిరి. బ్రిటిష్ రహస్యచారుల ప్రధాన ప్రతినిధి (ఇతనినే బ్రిటన్‌లో ప్రముఖచారుడు (Master spy) అందురు) సోవియట్ ప్రభుత్వమునకు కష్టములు కలిగించుటకై అచ్చటికి పంపబడెను. మిత్రమండలివారి ధన సహాయముతో, ఆస్థిని గోల్పోయిన కులీనులును, బూర్జువాలును నిరం తరము ప్రతి - విప్లవమును ప్రోత్సహించుచుండిరి.

1918 మధ్యలో పరిస్థితు లిట్లుండెను. సోవియట్ ఉండునో ఊడునో యన్నట్లుండెను.

# 152

# సోవియట్ల కృషి ఫలించుట

ఏప్రిల్ 11, 1933

1918 సంవత్సరము జూలై నెలలో రష్యాపరిస్థితు లాశ్చర్యకరముగా మారుచుండెను. బోల్షివికుల నావరించిన ఉరులు క్రమముగా బిగియుచుండెను. దక్షిణమున యూక్రైనునుండి జర్మనులు బెదరించుచుండిరి. రష్యాలోనున్న జెకోస్లవేకియన్ యుద్ధఖైదీల ననేకులను మిత్రమండలివారు మాస్కోపై దాడి వెడలుమని ప్రోత్సహించుచుండిరి. ఫ్రాంసులో పడమటి యుద్ధరంగమం దంతట మహాసంగ్రామము జరుగుచునే యుండెను. కాని సోవియట్ రష్యాలో ఒకవింత దృశ్యము గోచరించుచుండెను. మిత్రమండలివారును, జర్మన్ రాజ్యములును ఎవరికి వారు ప్రత్యేకముగా బోల్షివికుల నణచివేయుటయను ఏకైక కార్యమున నిమగ్నులైయుండిరి. జాతిని ద్వేషించుట విషప్రాయమైనదే కాని జాతిద్వేషముకంటె వర్గద్వేష మెంతదృఢమైనదో మరల మనకిక్కడ ప్రస్ఫుటమగుచున్నది. ఈ రాజ్యములవారు అధికార పురస్సరముగా రష్యాపై యుద్ధమును ప్రకటించియుండలేదు; కాని రష్యాను కష్టములపాలుజేయుటకు వారు అనేక ఇతరమార్గముల నవలంబించుచుండిరి — ముఖ్యముగా ప్రతి — విప్లవనాయకులను ప్రోత్సహించుచుండిరి. ఆయుధ ధన సహాయముల వారికి చేయుచుండిరి. సోవియట్లకు వ్యతిరేకముగా అనేకమంది ప్రాతజారుల సేనానులు పనిచేయుటకు రంగమున ప్రవేశించిరి.

యూరల్ పర్వతముల సమీపమున తూర్పురష్యాలో స్థానిక సోవియట్ల పరాన జారును, అతని కుటుంబమును బంధితులై ఉండిరి. ఈ ప్రాంతమున జెక్ సైన్యములు ముందుకు సాగిపోవుటచూచి ఈ

స్థానిక సోవియట్లు భయభ్రాంతులైరి. మాజీజారును వారు రక్షించగల రనియు, అతడు ప్రతి – విప్లవమునకు కేంద్రము కాగలడనియు వారు భయపడిరి. కాన వారట్టి యుపద్రవము తప్పించుటకై జారుకుటుంబమును వధించిరి. సోవియట్ సెంట్రల్ కమిటీ కిందులో ఎంత మాత్రము బాధ్యతలేదని తేలుచున్నది. మాజీజారును ఉరితీయుట, అంతర్జాతీయకారణములనుబట్టి లెనిన్‌కు ఇష్టముగాలేదు. జారు కుటుంబము నురితీయుట మానవధర్మమునకు వ్యతిరేకమని అతడు భావించెను. జరిగినదేదో జరిగినది కాబట్టి కేంద్ర ప్రభుత్వము దానిని సమర్థించెను. ఇందువల్లబహూశా మిత్ర ప్రభుత్వములకు మరింత సంక్షోభము కలిగినది. వారిలో వైరభావము హెచ్చెను.

ఆగస్టునెలలో పరిస్థితులు విషమించెను. అప్పుడు రెండుకార్యములు జరిగెను — వానిననుసరించి కోపము, భయము, నిరాశ కలిగెను. ఇందొక కార్యము లెనిన్ ప్రాణములు తీయుటకు చేసిన ప్రయత్నము. రెండవకార్యము ఉత్తర రష్యాలో ఆర్కేంజల్‌వద్ద మిత్రమండలి సైన్యముదిగుట. మాస్కోలో ఉద్రేకము చెలరేగెను. త్వరలో సోవియట్‌ను తుడచిపెట్టుకు పోదురా యన్నట్లుండెను. మాస్కో చుట్టును శత్రువులు గుమిగూడిరి - జర్మనులు, జెక్కులు, ప్రతి - విప్లవ సైన్యములు. మాస్కోచుట్టునున్న కొద్ది జిల్లాలుమాత్రము సోవియట్ పాలనమందుండెను. మిత్రమండలి సైన్యము వచ్చెనా సర్వము నాశన మగునట్టు లుండెను. బోల్షివిక్కులకు చెప్పుకోదగ్గ సైన్యములేదు. అప్పటికి బ్రెస్ట్ - లిటోవిస్క్ సంధి జరిగి ౫ నెలలు మాత్రమే కావచ్చినది. ప్రాతసైన్యము చాలవరకు బొలముల పాలైనది. మాస్కో అంతయు కుట్రలపుట్టగా నుండెను. రానున్న సోవియట్ పతనమునకు బూర్జువాలు బాహాటముగా సంతోషించుచుండిరి.

తొమ్మిదిమాసముల వయస్సు గలిగిన సోవియట్ రిపబ్లిక్ స్థితి ఈ విధముగా దుర్భరముగా నుండెను. బోల్షివికులు నిరాశతోను

భయముతోను నిండియుండిరి. ఎచ్చటనైనను బాపుతప్పదు గనుక రణరంగమందే పోరాడుచు చనిపోవుటకు వారు నిశ్చయించిరి. 125 సంవత్సరములకు పూర్వము, లేతివయస్సులోనున్న ఫ్రెంచి రిపబ్లిక్ చేసిన విధముగానే, మూలకు కొట్టబడిన ఎన్యమృగమువలెనే, వారు శత్రువులపైబడిరి. సహన మెంతమాత్రము కూడదు. కనికరమునకు తావులేదు. దేశమంతయు సైనిక పరిపాలనమం దుంచబడెను. సెంట్రల్ సోవియట్ కమిటీ "రక్తక్రౌర్యమును" (Red Terror) ప్రకటించెను—"దేశద్రోహులకు చావు; దండయాత్రసాగించిన పర దేశులతో కనికరించెరుగని యుద్ధము." లోపలనున్న శత్రువులతోను, బయటనున్న శత్రువులతోను వారు తెగించి పోరాడ నిశ్చయించిరి. ప్రపంచమున కెదురునిలిచి, వ్యతిరేకుల కెదురునిలిచి సోవియట్ పోరాడ నిశ్చయించెను. "యుద్ధసంసిద్ధమగు (Militant) కమ్యూనిజం" కాలముకూడ ప్రారంభమయ్యెను. దేశమంతయు ముట్టడింపబడిన యుద్ధరంగమువలె నుండెను. ఎర్ర సైన్యమును నిర్మించి వృద్ధిచేయు టకు శాయశక్తుల ప్రయత్నములు చేయబడెను. ఈ పనికి ట్రాట్స్కీ నియమింపబడెను.

ఇది జరిగినది 1918 సెప్టెంబరు, అక్టోబరు ప్రాంతమున. అప్పుడే పశ్చిమమున జర్మన్ యుద్ధయంత్రము భగ్నమగుచుండెను. యుద్ధ విరామవార్తలు పొక్కుచుండెను. మిత్రమండలివారి లక్ష్యములం మన్నవని విల్సన్ అధ్యక్షుడు తన పదునాలుగు సూత్రములను విశదీ కరించెను. అం దొక్కసూత్రము గమనించదగినది. అది ఏమన — ఆక్రమించిన రష్యాదేశమును వదలిపెట్టవలసినదనియు, ఇతర రాజ్యముల సహాయముతో రష్యా ఆత్మాభివృద్ధి నందుటకు సంపూర్ణముగా సావ కాశము లియ్యవలయుననియు. ఇందుకు వింత వ్యాఖ్యానముగా మిత్రమండలి వారు కలుగజేసికొని తమ సైన్యములను రష్యాలో దింపిరి. బోల్షివిక ప్రభుత్వము, విల్సన్ చతుర్దశసూత్రములను

తీవ్రముగా విమర్శించుచు, అతనికొక జాబు వ్రాసెను. ఇందు వారు చెప్పిన కొన్ని విషయములు: "పోలెండు, సెర్బియా, బెల్జియములకు స్వాతంత్ర్య ముండవలెనని నీవు కోరుచున్నావు. ఆస్ట్రియా - హంగరీ వాసులకు స్వేచ్ఛయుండవలయు ననుచున్నావు...కాని వింతవిషయ మేమనగా — ఐర్లాండు, ఈజిప్టు, ఇండియా, ఫిలిప్పైను దీవులకైనను స్వాతంత్ర్యముండవలెనని నీవు కోరుటలేదు."

1918 నవంబరు 11 తేదీని మిత్రమండలి వారికిని, జర్మన్‌రాజ్యములకును సంధి జరిగెను. అప్పుడే యుద్ధవిరామపత్రముపై చేవ్రాళ్లు చేయబడెను. కాని రష్యాలో 1919, 1920 సంవత్సరముల పొడుగునను అంతఃకలహము ముమ్మరముగా జరిగెను. అన్యసహాయము లేకుండ సోవియట్లు శత్రువు లనేకులతో పోరాడిరి. ఒకసారి ఎర్ర సైన్యము పదిహేడు వేర్వేరురంగములలో పోరాడవలసివచ్చెను. ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాంసు, జపాను, ఇటలీ, సెర్బియా, జెకొస్లవేకియా, రుమేనియా, బాల్టిక్ రాజ్యములు, పోలెండునూ, రష్యను ప్రతి-విప్లవసేనాను లనేకులును సోవియట్‌ను ప్రతిఘటించిరి. తూర్పు సైబీరియానుండి బాల్టిక్, క్రిమియాలవరకును పోరాటము సాగుచునే యుండెను. ఉండుండియు సోవియట్ అవసానము సమీపించినట్లు తోచుచుండెను. మాస్కో-పతన మగునేమోయని భయపడవలసి వచ్చెను. పెట్రోగ్రాడు శత్రువులవశమగుటకు సిద్ధముగానుండెను. కాని ప్రతి అపాయ పరిస్థితినుండియు అది తప్పించుకొనెను. ప్రతి విజయమును దానికి ఆత్మవిశ్వాసమును, శక్తిని ఇచ్చెను.

ప్రతి — విప్లవనాయకులలో నొకడు అడ్మిరల్ కోల్‌చక్. రష్యాకు ప్రభువునని అతడు ప్రకటించుకొనెను. మిత్రమండలి వారు అందుకు తమసమ్మతిని చూపుటయేకాదు, ఎంతో సహాయము కూడ చేసిరి. అతడు సైబీరియాలో ప్రవర్తించిన వైఖరిని అతని మిత్రుడు, తోడి సేనాని, కోల్‌చక్‌కు సహాయార్థము పనిచేయు అమెరికన్ సేనలకు

అధిపతి అయిన గ్రేవ్స్ సేనాని తెలుపుచున్నాడు. ఈ అమెరికన్ సేనాని చెప్పిన దేమనగా —

"దారుణహత్యలు చేయబడినవి. కాని వానిని చేసినవారు ప్రపంచమనుకొనునట్లు బోల్షివికులు కారు. తూర్పు సైబీరియాలో బోల్షివికులు ఒకరిని చంపియుండినచో, బోల్షివిక వ్యతిరేకులు నూర్గురిని చంపిరని చెప్పిన నది అతిశయోక్తి కాదని నేనెరుగుదును."

ప్రసిద్ధులగు రాజకార్యధురంధరులు ఎట్టి జ్ఞానమును పురస్కరించుకొని పెద్దరాజ్యముల వ్యవహారములను నడిపించుచు, యుద్ధములు సంధులు చేయుచున్నారో తెలిసికొనుటకు చమత్కారముగా నుండును. అప్పటి బ్రిటిష్ ప్రధానియు, యూరోపులో బహుశా మిక్కిలి ప్రబలుడును అగు లాయడ్ జార్జి కామన్సుసభలో మాటాడుచు కోల్‌చక్ మున్నగు సేనానుల పేరెత్తెను. ఆ నోటితోనే "ఖార్కోవ్ సేనాని" అని పలికెను. నిజమునకు 'ఖార్కోవ్' సేనాని పేరుకాదు. అదియొక ముఖ్యనగరము; యూక్రైను ప్రధాన పట్టణము. సామాన్య భూగోళశాస్త్ర విషయమున నింత అజ్ఞానముతో మెలగుచున్నను వారు యూరోపును ముక్కలు ముక్కలుగా ఖండించి, క్రొత్తదేశపటమును సృష్టించుటకు ఎంతమాత్రము అభ్యంతరము లేక పోయినది.

మిత్రమండలి వారును రష్యాను ముట్టడించిరి. ఈ ముట్టడి ఎంత తీవ్రముగా నున్నదనగా 1919 సంవత్సరము పొడుగునను రష్యా ఏ దేశమునుండియు, ఏ వస్తువును కొనలేకపోయెను. ఏదేశమునకును, ఏ వస్తువును అమ్మలేక పోయెను.

దుర్భరకష్టము లిన్ని తటస్థించినను, ప్రబలులగు శత్రువు లనేకులు తన్నెదురుకొన్నను సోవియట్ రష్యా నిలిచి విజయము సాధించినది. చరిత్రలో ఇది ఒక అత్యాశ్చర్య విక్రమకార్యము. వారట్లు చేయగలుగుట ఎట్లు సంభవించెను? తొలిరోజులలో మిత్రరాజ్యము లేకమై బోల్షివికులను అణచివేయ సంకల్పించినచో నిరభ్యం

తరముగా అట్లు చేసియుండెడి వారే! జర్మనీని ఓడించిన పిమ్మట పెద్ద సైన్యములు వారి చేతిలో నుండెను. కాని ఎక్కడనైనను పోరాడుటకు, ముఖ్యముగా సోవియట్లకు వ్యతిరేకముగా పోరాడుటకు, వారు సమ్మతింపరు. ఆ సైనికులందరు అలసియుండిరి. పరదేశయుద్ధములలో పాల్గొనుటకు వారు నిరాకరింతురు. నూతన రష్యా అన్న కార్మికుల కెంతో సానుభూతి కలదు. సోవియట్లపై బాహాటముగా యుద్ధము ప్రకటించినచో స్వదేశములో కార్మికులనుండి చిక్కులు తటస్థించునని మిత్రరాజ్యములు భయపడిరి. ఆ సమయమున యూరోపు తిరుగుబాటు చేయునా అన్నట్లుండెను. మూడవ కారణము మిత్రరాజ్యములలో నున్న అన్యోన్యస్పర్థలు. సంధిచేకూరుట తోడనే వారిలో వారు కొట్లాడుకొనుటకు ప్రారంభించిరి. ఈ కారణము లన్నిటివల్ల బోల్షివికుల నంత మొందించుటకు వారు దృఢయత్నము చేయలేకపోయిరి. దీనిని సాధించుటకు పరోక్షముగా వారు ప్రయత్నించిరి. తమతరపున పోరాడుట కితరులకు ధనమును, ఆయుధములను, మాటసహాయమును చేసిరి. సోవియట్లు చిరకాలము మన్నలేరని వారు భావించిరి.

ఇదంతయు సోవియట్లకు అనుకూలముగా నుండెను. బలము కూర్చుకొనుటకు వారికి తెరపికలిగెను. కాని వారి విజయమునకు కారణము అన్యపరిస్థితులని భావించుట న్యాయముకాదు. ముఖ్యముగా వారి విజయమునకు వారి ఆత్మవిశ్వాసము, ఆత్మత్యాగము, దృఢనిశ్చయము కారణములు. ఆశ్చర్యమేమనగా ప్రతిచోట రష్యనులను గురించి వారు సోమరిపోతులనియు, విద్యాగంధములేని వారనియు, దుర్నీతిపరులనియు, ఏ కార్యమును చేయలేని, చేతకాని వారనియు చెప్పుకొందురు. అందు సత్యము లేకపోలేదు. అట్టి వారిట్టి విజయము సాధించుట ఆశ్చర్యకరము. స్వేచ్ఛ అనునది ఒక అలవాటు. చిరకాలము పాటు దానిని లేకుండచేసినచో దానిని మనము విస్మరింతుము.

అజ్ఞానులగు రష్యన్ రైతులును, కార్మికులును ఇట్టి అలవాటు నలవరుచు కొనుటకు సావకాశ మెంతమాత్రములేకుండెను. అయినను నాటి రష్యానాయకుల ప్రతిభవల్ల ఇట్టి జనులు ప్రబలమగు క్రమబద్ధమగు జాతిగా, ఆత్మవిశ్వాసముగల జాతిగా మారిరి. కోల్‌చక్‌లును, ఇతరు లట్టివారును పరాజితులగుటకు కారణము బోల్షివిక్ నాయకుల సామర్థ్య మును, పట్టుదలయుమాత్రమే కాదు. రష్యన్ రైతు కోల్‌చక్‌వంటి వారిని సహించ నిరాకరించెను. అతని దృష్టిలో వారు ప్రాత విధానము నకు ప్రతినిధులనియు, క్రొత్తగా సంపాదించిన తన భూమిని, హక్కు లను తీసివేయుటకు వచ్చిరనియు భావించెను. భూమిని హక్కులను నిలబెట్టుకొనుటకు ఆమరణము పోరాడ నిశ్చయించెను.

నాయకు లందరినిమించి తిరుగులేని అధికారమును చెలాయిం చుచు లెనిన్ ఉండెను. రష్యన్ ప్రజలకు అతడు దేవాంశసంభూతు డుగా నుండెను — ఆశకు, విశ్వాసమునకు అత డొక చిహ్నముగా నుండెను. ఎట్టికష్టము నైనను భరించగల బుద్ధిమంతు డతడు. ఏది ఎటువచ్చినను తొట్రుబాటుచెందని, చలించని బుద్ధిమంతు డతడు. ఆ రోజులలో (ఇప్పు డతనిని రష్యాలో గర్హింతురు) లెనిన్ తర్వాత చెప్పుకోదగ్గవాడు ట్రాట్‌స్కీ. ఇతడు గ్రంథకర్త; వక్త. సైనికశిక్షణ గాని, అనుభవముగాని లేకున్నను, అంతఃకలహము జరుగుచున్నను, ముట్టడి జరుగుచున్నను గణించక మహాసైన్య నిర్మాణమునకు పూను కొన్నవాడు. ట్రాట్‌స్కీ ప్రాణములకు లక్ష్యముచేయని సాహసము కలవాడు. పలుమార్లతడు ప్రాణములనొడ్డి పోరాడెను. ఇతరులలో సాహసలోపముగాని, క్రమ శిక్షణలోపముగాని కనిపించిన అతడు కనిక రము చూపువాడుకాడు. అంతఃకలహము జరుగుచుండగా ఒక సంకట సమయమున నత డీ ఉత్తర్వును జారీచేసెను:

"ఏ సైనిక నివహమైనను ఉత్తరువులులేనిదే వెనుకకుగుడువేసి నచో ఆ నివహమునకు మిసరీ (నాయకుడు) మొట్టమొదట కాల్చి చంప

బడును. తరువాత సేనాని కాల్చబడును. వారిస్థానే సాహసోపేతు లగు సైనికులు నియమింపబడుదురు. పిరికి పందలు, దేశద్రోహులు తుపాకికి గురియగుదురు - తప్పదు. సర్వఎఱ్ఱసైన్య సమక్షమున ఇది నేను త్రికరణశుద్ధిగా చెప్పుచున్నాను."

అత డన్నప్రకారము చేసెను.

1919 అక్టోబరులో ట్రాట్స్కీ వేరొక సైనిక శాసనము ప్రకటించెను. దీనినిబట్టి — బోల్షివిక్కులు ప్రజలనువేరుగాను, ధనిక ప్రభుత్వములను వేరుగాను చూచుచుండిరనియు, శుద్ధజాతీయ దృక్పథమునే వా రవలంబించియుండలేదనియు వెల్లడియగును.

"శాసన మిట్లున్నది. నేడుసైతము యూడినిచ్ తో (Yudenich), ఇంగ్లాండు జీతగాండ్లతో మనము తీవ్రముగా పోరాడుచున్నను ఇంగ్లాండులు రెండున్నాయను మాట మీరు మరచిపోరాదని కోరుచున్నాను. లాభముల నాశించుచు, హింసలు చేయుచు, లంచములు తినుచు, క్రూరముగా సంచరించు ఇంగ్లాండొక్కటి. కార్మికులతో కూడిన, ఆధ్యాత్మికశక్తి సంపన్నమైన, అంతర్జాతీయ ఐకమత్య ఉన్నత ఆదర్శములతో నొప్పు ఇంగ్లాండొక్కటి. నీచమైన, నీతిలేని, ధనార్జనతత్పరమగు ఇంగ్లాండు మనతోపోరుచున్నది. కార్మికుల, ప్రజల ఇంగ్లాండు మనపక్షమందున్నది."

పెట్రోగ్రాడు, యూడినిచ్ వశముకాబోవుచున్న సమయమున దానిని సంరక్షించుటకై చేసిన తీర్మానమునుబట్టి ఎంతపట్టుదలతో ఎఱ్ఱసైన్యము పోరాటమునకు పురిగొల్పబడినదో తెల్లమగును. సంరక్షణ సంఘమువారు (Council of Defence) జారీచేసిన శాసన మిది—"దేహములో రక్తపుచుక్క ఉన్నంతవరకు పోరాడవలెను; అడుగువెనుకకు వేయరాదు. నగరవీధులలోనికి పోరాడుచు పోవలెను."

మాక్సిమ్‌గార్కీ గొప్ప రష్యన్ గ్రంథకర్త. ట్రాట్స్కీవి

గూర్చి లెనిన్ ఒకమారు ఇట్లు చెప్పినట్లు గార్కీ చెప్పెను :

"సాటిలేని సైన్యము నొక సంవత్సరము లోపున నిర్మించ గలిగిన వేరొక పురుషుని చూపగలవా ? అంతేకాదు, సైనిక నిపుణుల పొగడ్తను పొందినవానిని చూపగలవా ? మన కట్టిపురుషు డున్నాడు. మనకు సమస్తము ఉన్నది. ఇంకను మహాత్ములు సంభవించుచునే ఉన్నవి."

ఈ ఎఱ్ఱసైన్యము అతివేగముగా వృద్ధినందెను. 1917 డిశంబరులో అధికారము బోల్షివికుల కరగతము అయినవెంటనే అందు 4,35,000 సైనికులుండిరి. బ్రెస్టు — లిటోవిస్కీ సంధి జరిగిన పిమ్మట ఈ సైన్యములో చాలభాగము అంతరించియుండెను. మరల దానిని నిర్మించవలసి యుండెను. 1919 సంవత్సరమధ్యమునకు సైనికుల మొత్తము సంఖ్య 15,00,000. వేరొకసంవత్సరము గడచుసరికి సైనికుల సంఖ్య 53,00,000. బ్రహ్మాండముగా పెరిగినది.

1919 సంవత్సరాంతమునకు అంతఃకలహములో సోవియటులు తమ ప్రతిస్పర్థులను మించిపోయిరి. ఇంకొక సంవత్సరమువరకు యుద్ధము సాగిపోయెను. కాని ప్రమాదకరమగు సంఘటనలనేకము తటస్థించెను. 1920 లో పోలెండు అను నూతన రాజ్యము (జర్మనులు పరాజితులైన పిమ్మట నిది ఏర్పడినది) రష్యాతో కలహించెను. ఉభయదేశములకు యుద్ధము తటస్థించెను. 1920 సంవత్సరాంతమున కీ యుద్ధములన్నియు పూర్తి అయ్యెను. చిట్టచివరకు రష్యాకు కొంతశాంతి చేకూరెను.

ఈలోగా దేశములో కష్టము లనేకము తలయెత్తెను. యుద్ధము, ముట్టడి, రోగములు, కరువు కారణములుగా దేశము హీనస్థితిలో నుండెను. ఉత్పత్తి చాలభాగము తగ్గిపోయెను. నిరంతరము ఉభయ పక్షముల సైన్యములు తమపై విరుచుకొని పడుచుండగా కర్షకులు భూమినెట్లు దున్నుదురు ? కార్మికులు ఫాక్టరీలనెట్లు నడపుదురు ?

యుద్ధకాలమునాటి కమ్యూనిజం దేశము నేదో యొకవిధముగా నడి పించుకొని పోయెను. కాని ప్రతిమనుష్యుడును కష్టములపాలు కావలసి వచ్చెను. కర్షకులు ఉత్పత్తిని వృద్ధిచేయుట కుత్సాహపడుటలేదు. కారణమేమన — పైనికుల కమ్యూనిజం క్రిందనున్న రాజ్యము అదనపు పంట నంతను తీసికొనిపోవును. ఇక వా రుత్పత్తి వృద్ధిచేయుటకు శ్రమపడి లాభమేమి? విషమపరిస్థితి ప్రమాదకరముగా తలయెత్త జొచ్చెను. పెట్రోగ్రాడ్ వద్దనున్న క్రోన్‌స్టాట్‌లో నావికుల తిరుగు బాటు సైతము సంభవించెను. పెట్రోగ్రాడులోనే సమ్మెలు కట స్థించెను.

మూలసూత్రములను తాత్కాలిక పరిస్థితుల కన్వయించుటలో ప్రజ్ఞావంతుడగు లెనిన్ వెంటనే తగుచర్య తీసికొనెను. యుద్ధకాలము నాటి కమ్యూనిజం నాత డంతరింపజేసెను. క్రొత్తకార్యవిధానము నాతడు ప్రవేశపెట్టెను. నూతన ఆర్థిక విధాన మని దాని పేరు (New Economic Policy లేదా N.E.P.). సరుకు నుత్పత్తిచేయుట కును, అమ్ముటకును రైతు కిప్పు డెక్కువస్వేచ్ఛ లభించెను. కొంత లోపాయికారీవర్తకము చేసుకొనుటకుకూడ వీలుకలిగెను. నికరమైన కమ్యూనిష్టుల సిద్ధాంతముల కిది కొంతవరకు విభిన్నమేయైనను తాత్కా లికముగ నిట్లుచేయుట అవసరమేయని లెనిన్ సమర్థించెను. న్యాయ మున కది ప్రజల కెంతో సదుపాయము చేకూర్చెను. అచిరకాలము లోనే రష్యా వేరొక ఘోరవిపత్తు నెదుర్కొనవలసి వచ్చెను. ఇది క్షామము. అనావృష్టి దోషమువలన, రష్యా ఆగ్నేయభాగమున పెద్ద భూభాగములో పంటలు నశించెను. అందుచే క్షామము తటస్థించెను. భయంకరమగు క్షామమిది. ఎరిగినంతవరకు సంభవించిన మహా క్షామములలో నిదియొక్కటి. లక్షలాది ప్రజలు మడసిరి. అనేక సంవత్సరములపాటు యుద్ధము, అంతఃకలహము, ముట్టడి, ఆర్థిక నిర్మాణ భంగము — ఈ కార్యములు జరిగిన వెంటనే, శాంతియుత

కార్యములలో సోవియట్ ప్రభుత్వము నిమగ్నముకాకముందే క్షామము వచ్చుటచే ప్రభుత్వ నిర్మాణమంతయు భగ్నము కావలసియుండెడిది. కాని సోవియట్ ఈ విపత్తునుదాటి బయటపడెను. ఇంతకుముందు తటస్థించిన విపత్తులనుండి బయటపడ్డట్లే ఇప్పుడును పడెను. క్షామ నివారణకై ఎట్టి సహాయము చేయవలసియుండునని యూరోపియన్ ప్రభుత్వముల ప్రతినిధులు సమావేశము జరిపిరి. ప్రాతజారులకాలము నాటి అప్పులను చెల్లించుటకు సోవియట్ ప్రభుత్వము అనుమతించి ననే గాని ఎట్టి సహాయము చేయమని వారు చెప్పిరి. అప్పులను చెల్లించు బాధ్యత తమకులేదని సోవియట్ చెప్పెను. భూత దయా శూన్యులైన ఋణదాతయే బలాఢ్యుడయ్యెను. రష్యన్ తల్లు లందరును చేరి చనిపోవుచున్న తమపిల్లలపేర హృదయ విదారకముగా ప్రార్థనలు పంపినను లక్ష్యపెట్టలేదు. కాని అమెరికా సంయుక్తరాష్ట్రములు ఎట్టి షరతును పెట్టకుండ గొప్పసహాయము చేసెను.

రష్యన్ క్షామనివారణకు ఇంగ్లాండును, ఇతర యూరోపియన్ దేశములును సహాయము చేయుటకు నిరాకరించినప్పటికిని వారుఇతరత్రా రష్యాను బహిష్కరించలేదు. 1921 తొలిభాగములో ఆంగ్లేయులు, రష్యనులు వర్తకపు ఒడంబడిక చేసికొనిరి. ఇతర దేశము లనేకము ఇట్లే సోవియట్‌తో వర్తకపు ఒడంబడికలు చేసికొనిరి.

చీనా, టర్కీ, పరిషియా, ఆఫ్ఘనిస్థానము మున్నగు తూర్పుదేశములపట్ల సోవియట్ ఉదారముగా ప్రవర్తించెను. జారులనాటి హక్కులను సోవియట్ వదలుకొని, వారితో స్నేహముగా నుండుటకు ప్రయత్నించెను. పరిపాలనమందుండి పరుల లాభముకొరకు విని యోగింపబడుచున్న దేశములకు స్వాతంత్ర్యముండవలెనను సోవియట్ సిద్ధాంతములకు వాని ప్రవర్తన అనుగుణముగానే యుండెను. ఇంత కన్న ముఖ్యమైన వారి యుద్దేశము తమస్థానమును బలపరుచుకొనుటయే. ఇంగ్లాండువంటి సామ్రాజ్యదేశములు సోవియట్ రష్యా ఉదార

ప్రవర్తనను చూచి చిన్నబుచ్చుకొనుచుండిరి. తూర్పుదేశములు రష్యా నితరదేశములతో పోల్చుచుండుటచే ఇంగ్లాండును, ఇతర దేశములును న్యూనత పొందవలసి వచ్చెను.

1919 లో వేరొక ముఖ్యవిషయము జరిగెను. దానినిగూర్చి యిప్పుడు చెప్పెదను. కమ్యూనిస్టు పార్టీ మాస్కోలో, మూడవ అంతర్జాతీయ కార్మికసంఘము (Third International) ను స్థాపించెను. కారల్ మార్క్సు స్థాపించిన ప్రథమ ఇన్టర్నేషనల్ను గూర్చియు, ధీరవాక్కులుపలికి 1914 యుద్ధ ఆరంభమున అంతరించిన రెండవ ఇన్టర్ నేషనల్ను గూర్చియు వెనుకటి జాబులలో వ్రాసియుంటిని. రెండవ ఇంటర్నేషనల్లో నుండిన ప్రాతకార్మికులును, సోషలిస్టు పక్షములును కార్మికవర్గమునకు ద్రోహము చేసెనని బోల్షివికులు భావించిరి. కాబట్టి వారు మూడవ ఇంటర్నేషనలును సృష్టించిరి. దానిది పూర్తిగా విప్లవదృష్టి. ధనికతత్వ, సామ్రాజ్యతత్వములపై కత్తిదూయుటయే దాని లక్ష్యము. మధ్యేమార్గ మవలంబించునట్టియు, ఏ యెండ కా గొడుగుపట్టునట్టియు సోషలిస్టులను ప్రతిఘటించుటయు దానిపని. ఈ ఇంటర్ నేషనల్ను తరుచు కమింటర్న్ (కమ్యూనిస్టు ఇన్టర్ నేషనల్ నుండివచ్చిన పదము) అనుటయు కలదు. అనేక దేశములలో ప్రచారము జరుపుట కది ఎక్కువగా వినియోగపడెను. అది అంతర్జాతీయసంస్థ యని పేరునుబట్టి తెలిసికొనవచ్చును. అనేక వేర్వేరుదేశములనుండి వేర్వేరు కమ్యూనిస్టు పార్టీలు దానిని ఎన్నుకొందురు. కాని రష్యాలో కమ్యూనిజం విజయవంతముగా సాగినది. కాబట్టి కమిన్టర్న్లో అధికారము సాగించునది రష్యాయే. సోవియట్ ప్రభుత్వమును కమిన్టర్న్నును ఒకటి కావు. కాని రెండుసంస్థలయందును నాయక శ్రేణికిచెందిన ప్రముఖులుండిరి. విప్లవాత్మకమగు కమ్యూనిజమును వ్యాపింపచేయుటయందు కమిన్టరన్ కంకణముకట్టుకొనుటచే సామ్రాజ్య రాజ్యములు దానిని

అసహ్యించుకొనుచుండిరి. తమ దేశములలో దాని ఆటలుసాగకుండ చేయుచుండిరి.

రెండవ ఇంటర్ నేషనల్ (లేబర్ అండ్ సోషలిస్టు ఇంటర్ నేషనల్) కూడ యుద్ధానంతరము పశ్చిమయూరోపులో పునరుజ్జీవితము చేయబడెను. రెండవ, మూడవ ఇంటర్ నేషనలుల ప్రధానోద్దేశము మాటవరసకు మాత్రమొక్కటే కావి, ఊహాలలోను, పద్ధతులలోను అవి భిన్నముగానుండెను. ఆ రెంటికిని కిట్టదు. తమ సమాన శత్రువైన ధనికతత్వమును ఎదిరించుటకన్న ఎక్కువగా తమలో తాము పోరాడు కొనుచు, ఒకరినొకరు ఎదిరించుకొనుచు నుండిరి. రెండవ ఇంటర్ నేషనల్ ఇప్పుడు చాలా ఘరానాసంస్థ అయినది. యూరోపియన్ ప్రభు త్వములలోని ప్రధానమంత్రివర్గములకు తరుచు మంత్రు లిందుండియే వెళ్లుచుండిరి. మూడవ ఇంటర్ నేషనల్ విప్లవాత్మకముగానే ఉండెను. కాన అది ఘరానా అని అనిపించుకొనుటలేదు.

రష్యాలో అంతఃకలహము జరిగినంత కాలము క్రౌర్యముపట్ల "రెడ్ టెర్రరు"ను, "వైట్ టెర్రరు"ను ఒక దాని కొకటి తీసిపోవుట లేదు. వైట్ టెర్రరే, రెడ్ టెర్రరును మించిపోయెను. సైబీరియాలో కోల్ చక్ జరిపిన దురంతాలగురించి అమెరికన్ జనరల్ వ్రాసిన ఉదంత మును బట్టియు (పైని దాని నుదహరించితిని),ఇతర ఉదంతములబట్టియు మనము గ్రహించున దిదియే. కాని రెడ్ టెర్రరు కఠినముగా ప్రవర్తిం చినదనుటకును, నిర్దోషు లనేకులు హింసపాలైయుండిరనుటకును సందే హములేదు. అన్ని వైపులనుండి అంచరును ఎదిరించుచుండుట చేతను, కుట్రలు, చారులు వారిని చుట్టిముట్టియుండుటచేతను బోల్షి విక్కులు ధైర్యము కోల్పోయి ఏ కొద్ది అనుమానము తగిలినను కఠిన ముగా దండించుచుండిరి. వారి రాజకీయ పోలీసుకు 'చేకా' అని పేరు. ఇట్టి క్రౌర్యమునకు ముఖ్యముగా చేకా పెద్దపేరు తెచ్చుకొన్నది. ఇండియాలోని సి. ఐ. డి. తో నధి సరితూగుచుండెను. కాని దానికే

ఎక్కువ అధికారము లుండెను.

ఈ జాబు పెరుగుచున్నది. ముగించుటకు ముందు లెనిన్‌ను గూర్చి మరికొంత నీకు చెప్పవలసియున్నది. 1918 ఆగస్టులో అతనిని హత్యచేయుటకు ప్రయత్నించినప్పుడు, అతనికి గాయములు తగిలి నప్పటికిని, అతడు ఎక్కువగా విశ్రాంతి తీసికొనలేదు. ఎన్నిలొంద రలు వచ్చినను గణింపక ఉద్రేకముతో నతడు పనిచేయుచునే యుండెను. 1922 మేలో అనివార్యముగా ఆరోగ్యభంగము తటస్థించెను. కొద్దిగా విశ్రాంతి తీసికొని అతడు మరల పనిచేయుటకు ప్రారంభించెను. కాని చిరకాల మట్లు చేయలేకపోయెను. 1923 లో పూర్తిగా ఆరోగ్యము చెడెను. మరల నతడు తేరుకొననే లేదు. 1924 జనవరి 21 తేదీని, మాస్కోవద్ద లెనిన్ మరణించెను.

అప్పుడు శీతకాలము. రసాయనిక ద్రవ్యములతో అతని శరీరము రక్షింపబడెను. చాల రోజులవరకు శరీరము మాస్కోలో నుండెను. రష్యా అన్ని దిక్కులనుండి, దూరమందున్న సైబీరియా స్టెప్పీలనుండి, సామాన్య ప్రజలు, కర్షకులు, కార్మికులు, పురుషులు, స్త్రీలు, పిల్లలు తమ ప్రియమిత్రునకు తుదిజోహారు చెప్పుటకు వచ్చిరి. అతడే గదా తమ్ము నరకకూపమునుండి లేవనెత్తి సంపూర్ణజీవిత పథము తమకు చూపిన వాడు! చక్కని మాస్కో రెడ్ చౌక్‌లో అతనికి వారొక సమాధి నిర్మించిరి. అది నిరాడంబరముగాను, నిరలంకృతముగాను ఉండెను. ఇప్పటికిని అతనిదేహము అచ్చట ఒక గాజుపెట్టెలో ఉన్నది. ప్రతి సాయంకాలము అంతులేని ప్రజాసమూహము, మౌనముగా, దానిని దర్శించి పోవుచుందురు. అతడు చనిపోయి చాలా సంవత్సరములు కాలేదు. అయినను లెనిన్ పేరు, స్వదేశమగు రష్యాలోనేకాదు, ప్రపంచమందంతటను పారంపర్యముగా చెప్పుకొనుచున్నారు. కాలము గడచినకొద్ది అతని ప్రతిష్ఠ ఇనుమడించుచున్నది. ప్రపంచములోని మృత జీవులలో నొక్కడై యున్నాడు. పెట్రోగ్రాడు లెనిన్‌గ్రాడు అయినది.

రష్యాలో సామాన్యముగా ప్రతియింటియందును లెనిన్ బొమ్మ ఉండును. లేదా లెనిన్ గదియుండును. కాని అతడు జ్ఞాపక చిహ్నములలో కాని, బొమ్మలలోగాని లేడు. అతడు తాను సాధించిన మహత్తరకార్యములలో ఉన్నాడు; లక్షలాదికర్షకుల హృదయములలో నున్నాడు. అతడనుసరించిన మార్గమే గదా వారి నావేశపూరితుల చేసినది! మంచి రోజుల నాశింపజేసినది!

లెనిన్ మానవత్వములేని వట్టి యంత్రమనియు, తనపనిలో మునిగియుండి వేరేమియు ఆలోచించడనియు అనుకొనబోకుము. తన పనిలో — తాను జీవితములో సాధింపదలచిన పనిలో — అతడు నిమగ్నుడై యుండినమాట నిజమేకాని తా నొక గొప్పపని చేయుచున్నాననే బుద్ధి ఈషన్మాత్రము అతనికిలేదు. అతడు మూర్తీభవించిన ఒక ఉన్నత భావము. అయినను మానవలక్షణము లతనిలో కొల్లలుగ నుండెను. అన్నింటికన్న ప్రధానలక్షణము — నిష్కపటముగా నవ్వగల లక్షణ మతనిలో ఉండెను. సోవియట్ ప్రమాదస్థితిలోనున్న మొదటి రోజులలో అచ్చటనున్న లాల్‌హార్టు అను మాస్కోలోని బ్రిటిష్ ఏజంటు చెప్పిన దేమనగా: "ఏది ఎట్లు సంభవించినను లెనిన్ ప్రసన్నుడుగానే ఉండును." ఈ బ్రిటిష్ రాజ్యతంత్రజ్ఞుడు చెప్పినమాటలు: "నేను చూచినంతమట్టుకు, లోకహితము నాచరించు పురుషులలో నింతగా సమచిత్తతగలవాడు వేరొకడు లేడు." మాటలలోగాని, పనులలోగాని అతడు నిరాడంబరముగా నుండును. ముక్కుకు సూటిగా పోవును. గొప్పమాటలు, వేషములు అతనికి కిట్టవు. అతనికి సంగీతమన్న అమిత ఇష్టము. దాని వలన తాను నిర్వహింపవలసిన కార్యములపట్ల మెత్తపడుదునేమో అని భయపడుచుండెను.

లెనిన్ సహోద్యోగి లూనాచరస్కీ అనువాడు అనేక సంవత్సర

ములపాటు బోల్షివిక్ విద్యా కమిసార్‌గా పనిచేసెను. అత డొకమా రొకవింత విషయము లెనిన్‌నుగూర్చి చెప్పెను. ధనికవర్గము వారిని లెనిన్ దండించిన విధము, ఆలయమునుండి ఋణదాతలను క్రీస్తు తరుమగొట్టిన విధమును తలపునకు తెచ్చుచున్నదని: "క్రీస్తే నేడు బ్రతికియుండినయెడల అతడు బోల్షివిక్కై యుండును." భక్తివిర హితులుచేయు వింత ఉపమాన మిది.

స్త్రీలనుగూర్చి లెనిన్ ఒకమా రిట్లు చెప్పెను: "వంట ఇంటిలో సగము జనాభా మ్రగ్గుచుండగా ఏజాతియు స్వతంత్రము కానేరదు." పిల్లలను ముద్దాడుచు అత డొకమా రన్నమాటలు జ్ఞాపకముంచుకోదగి నవి. అతని ప్రాతస్నేహితుడు మాక్సిమ్‌గోర్కీ అత డిట్లన్నట్లు చెప్పెను: "మనకంటె ఈ పిల్లలు ఎక్కువగా సుఖజీవితములు గడ పుదురు. మనము అనుభవించిన కష్టములు వా రనుభవించవలసిన పనిలేదు. వారి జీవితము లంత క్రౌర్యభూయిష్టములు కావు!" తథాస్తు.

సర్వవాద్య సమ్మేళనమునకును, ప్రజలందరు కలిసిపాడుటకును అను గుణముగా కూర్చబడిన ఒక రష్యన్ పాటతో ఈ జాబు ముగిం తును. దానిని విన్నవారు, అందలి సంగీతము శక్తివంతమై యున్న దనియు, విప్లవ ప్రజల మనోవృత్తి నా పాట ప్రదర్శించుచున్నదనియు చెప్పుదురు. అందలిమాటల * ఇంగ్లీషు అనువాదము నే నిచ్చు చుంటిని. ఇందును అందలిరసము కొంత ద్యోతకమగుచున్నది. ఈ పాటకు 'అక్టోబరు' అని పేరు — అక్టోబరు అనగా 1917 నవంబరులో జరిగిన బోల్షివిక్ విప్లవ మన్నమాట. ఆనాటి రష్యన్ పంచాంగము అసంస్కృతము. సామాన్య పాశ్చాత్య పంచాంగము ప్రకారము 13 దినములు వెనుక బడినది. ఈ పంచాంగము ప్రకారము 1917 మార్చి విప్లవము ఫిబ్రవరిలో జరిగినది. కాబట్టి దానికి "ఫిబ్రవరి విప్లవ"

* ఇంగ్లీషునుండి చేసిన తెనుగు అనువాదము ఇందున్నది.

మని పేరు.

అట్లే నవంబరు 1917 లో జరిగిన బోల్షివిక్ విప్లవమునకు అక్టోబరు విప్లవ మనుపేరువచ్చినది. ఇప్పుడు రష్యా తన పంచాంగ మును మార్చుకొన్నది. సంస్కరింపబడిన పంచాంగము నవలంబించు చున్నది. అయినను ప్రాత పేర్లే ఇప్పటికిని వాడుచున్నారు.

తిండి పెట్టమని, పని చూపమని అడుగుచు మేము వెళ్లితిమి.
మా హృదయములు దుఃఖభారముతో యుండెను.

ప్రేల్లుమడుచుటకైనను శక్తిచాలని అలసిన చేతులవలె, ఫాక్టరీల పొగగొట్టములు ఆకాశమువైపు చూపుచుండెను.

ఫిరంగి చప్పుడుకంటె గట్టిగా, మా దుఃఖమును, బాధను తెలుపు శబ్దములు నిశ్శబ్దమును చీల్చి వేసినవి.

చేతగాని వారికి అండయైనా డీ లెనిన్.

మేము గ్రహించితిమి, లెనిన్, మేము గ్రహించితిమి, పోరాటమే! పోరాటమే!

తుది పోరాటమునకు నీవు మా నాయకుడవైతివి, పోరాటము!

శ్రామికుల విజయము నీవు మాకిచ్చితివి.

అజ్ఞానముపై విజయము, హింసపై విజయము : ఈ విజయమును ఎవ్వరును మాకు లేకుండ తొలగించలేరు.

ఎవ్వరును, ఎవ్వరును, ఎన్నడును, ఎన్నడును తొలగించలేరు!

మన విజయము పేరు అక్టోబరు కాన ప్రతియొక్కడును పోరాటమునందు ధైర్యముగా, పడుచు తనముతో మెలగుదురు గాక!

అక్టోబరు! అక్టోబరు!
మార్క్సుని రాయబారి ఈ అక్టోబరు.
విప్లవశతాబ్దుల మనోనిశ్చయ మీ అక్టోబరు.

అక్టోబరు! ఇది యొక క్రొమ, ఇది సంతోషము, ఇది గేయము.
అక్టోబరు! ఇది పొలములకు యంత్రములకు అదృష్టరేఖ!
పడుచు తరముల వారికిని, లెనిన్‌కును పతాక నామధేయము ఇదియే.

—

# 153

# జపాను చీనాను వేధించుట

ఏప్రిల్ 14, 1933

ప్రపంచయుద్ధము జరుగుచుండగా దూరప్రాచ్యమున కొన్ని విశేషములు జరిగెను. అవి మనము గమనించదగినవి. కానీ నేనిప్పుడు నిన్ను చీనాకు తీసికొని వెళ్ళెదను. చీనాను గురించి వ్రాసిన వెనుకటి జాబులో అచ్చట ప్రజాప్రభుత్వము స్థాపింప బడినదని వ్రాసితిని. తరువాత తటస్థించిన కష్టములగూర్చియు వ్రాసియుంటిని. సామ్రాజ్యమును మరల స్థాపించుటకు పునఃప్రయత్నములు చేయబడినవి. కాని వారు విఫలమనోరథులైరి; కాని ప్రజాప్రభుత్వము దేశమందంతటను తన యధికారమును నిలుపుకొనలేక పోయెను. ఏ ఒక్క ప్రభుత్వమును అట్లు చేయలేక పోయెను. నాటినుండియు చీనాదేశము నంతయు, నిరాటంకముగా పరిపాలింప గలిగిన ప్రభుత్వమేదియు లేకుండెను. కొన్ని సంవత్సరములపాటు దేశములో రెండుప్రధాన ప్రభుత్వములు, ఉత్తర ప్రభుత్వము, దక్షిణప్రభుత్వము అను పేర్లతో ఉండెను. దక్షిణమున డాక్టరు సన్‌యట్‌సేన్, అతని జాతీయ పక్షమగు కూమిన్‌టాంగ్‌తో ప్రబలముగా నుండెను. ఉత్తరమున యు అన్‌షీకై సేనానాయ

కుడై యుండెను. అతని తరువాత సేనానులు, సైనికులు వరుసగా వచ్చిరి. ఇట్టి సైనిక సాహసికులను టూచన్లు అని అప్పుడు, ఇప్పుడు పేర్కొను చుండిరి. ఇటీవల వారు చీనాకు దుష్టగ్రహముల వలె నుండిరి.

ఇట్లు చీనా నిరంతర కల్లోలములతో దుర్భరస్థితియందుండెను. తరుచు ఉత్తర దక్షిణములకు అంతః కలహములు జరుగుచుండెను. లేదా టూచనులు పోటీపడి ఒకరితోనొకరు పోరాడుకొనుచుండిరి. సామ్రాజ్యప్రభుత్వముల కిది మంచితరుణము. కుట్రలుపన్ని ఒకపక్షమును గాని, వేరొక పక్షమునుగాని పురిగొల్పి ఈ అతః కలహముల నుండి లాభము పొందుటకు ప్రయత్నించుచుండిరి. ఈ విధముగానే ఇంగ్లీషువారు ఇండియాలో రాజ్యస్థాపన చేసినసంగతి మీకు జ్ఞాపకముండవచ్చును. ఇట్టి సదవకాశమును జారవిడువక యూరోపియన్ ప్రభుత్వములు కుట్రలుపన్నుటకు ప్రారంభించిరి. ఒక టూచను నింకొక టూచన్ మీదికి పురిగొల్పుచుండిరి. కాని త్వరలోనే ప్రపంచయుద్ధము సంభవించుట చేతను, సొంత ఇబ్బందులవల్లను వారి వ్యాపారములు కట్టుబడెను.

జపానులో ఇట్లు జరుగలేదు. ప్రధానయుద్ధము దూరదేశములలో జరుగుచుండెను. చీనాలో యథాప్రకారము వారు కుట్రలుసాగించుట ప్రమాదకరము కాదని వారు భావించిరి. నిజమునకు, ఇతర ప్రభుత్వములు అన్యత్రా యుద్ధమున చిక్కుకొనియుండుట చేతను, వారు కలుగజేసికొందురను సంశయము లేకుండుటచేతను వారు తమవ్యాపారములను సులువుగా సాగించుకొనగలిగిరి. అది జర్మనీపై యుద్ధము ప్రకటించెను. ఇందలి అభిప్రాయము చీనాలో జర్మన్ స్థావరమగు కియోచౌను స్వాధీనము చేసికొని, పిమ్మట దేశములోనికి చొచ్చుకొనిపోవచ్చునని.

చీనాపట్ల జపాను అవలంబించిన రాజనీతి గత 40 సంవత్సర

ముల పాటు ఒకేమాదిరిగా నుండెను. జపాను తనసైన్యమును నూతన పద్ధతుల ప్రకారము సంస్కరించి, దేశమును పారిశ్రామికము చేసి పిమ్మట చీనాలో అధికారమును సంపాదించుటకు సంకల్పించెను. వారు తమ పరిశ్రమలను వృద్ధిచేసి వ్యాపింపజేయుటకు ప్రదేశము కావలసి వచ్చెను. కొరియా, చీనాదేశములు సమీపమున దుర్బలముగా నుండెను. వానిని కరగతము చేసికొనుటయు, స్వప్రయోజనార్థము వాడుకొనుటయు సులభసాధ్యముగానుండెను. వారు చేసిన తొలిప్రయత్నము — 1894-95 లో — చీనాతో యుద్ధమునకు దిగుట. వారు కృతకృత్యులైరి. కాని కోరిన దంతయు వారికి చిక్కలేదు. కొన్ని యూరోపియన్ ప్రభుత్వములు ప్రతి ఘటించుట ఇందుకు కారణము. తరువాత 1904 లో కష్టతరమగు పోరాటము రష్యాతో సంభవించెను. ఇందును వారు విజయము సాధించిరి. కొరియా, మంచూరియాలలో స్థిరముగా తమ ప్రభుత్వమును స్థాపించుకొనిరి. కొద్దికాలమైన పిమ్మట . కొరియాను వారు తమదేశములో కలుపుకొనిరి. అది జపాను సామ్రాజ్యమున ఒక భాగమైనది.

మంచూరియా మాత్రముచీనా దేశభాగముగానే ఉండెను. చీనాదేశమునందలి మూడు తూర్పురాష్ట్రములతో నది ఏర్పడినది. రష్యనులకు ఇచ్చివేసిన ప్రాంతభూమిని, అందువారు నిర్మించిన చీనీస్ ఈస్టరన్ రైల్వేఅని అప్పటివరకు పేరొందినబడు రైల్వేను, జపానువారు చల్లగా స్వాధీనము చేసికొనిరి. ఈ రైల్వే పేరు దక్షిణ మంచూరియా రైల్వే అని తరువాత మార్చబడినది. ఇప్పటినుండి జపాను మంచూరియాను తన వశమందుంచుకొనుటకు ప్రారంభించెను. జనసంఖ్య అమితముగా నున్న చీనాప్రాంతములనుండి రైల్వే కారణముగా రైతులనేకులు వచ్చి పడిరి. ఒకరకము చిక్కుడు, సోయాచిక్కుడు అనునది, మంచూరియాలో ముమ్మరముగా పెరుగుచుండెను. దాని మంచిగుణములనుబట్టి ప్రపంచమంతటినుండియు దానికై గిరాకీ వచ్చెను. దానినుండి తయారు చేయు ఇతర పదార్థముల మాట అటుండగా ఒకవిధమగునూనె దాని

నుండి తీయుదురు. సోయాచిక్కుడు పైరు కారణముగాకూడ చీనా వారు వలస వచ్చుచుండిరి. మంచూరియా యొక్క ఆర్థిక పరిపాలనా యంత్రమును జపానువారు స్వాధీనము చేసికొనుచుండగా చీనావారన్నియో దక్షిణమునుండి వచ్చిపడి అందు నివాసమేర్పరచు కొనుచుండిరి. చీనారైతులు అమితముగా వచ్చిపడుటచే అచ్చటి మంచూరియా ప్రజలు వీరిలో మునిగపోయిరి. వారు పూర్తిగా సంస్కృతియందును, దృక్పథమందును చైనీయులయి పోయిరి.

చీనా రిపబ్లిక్ అగునని జపానువారూహించలేదు. చీనాకు బలము చేకూర్చు ఏ కార్యమునకును వారు సమ్మతించలేదు. చీనా అంతయు ఒక సమర్థమగు రాజ్యముగా స్థిరపడకుండ జపానువారు తమ రాజనీతి దక్షత నంతయు ప్రయోగించిరి. కాన దేశములో నున్న కల్లోలస్థితి అట్లే నిలిచియుండవలెనని కోరుచు ఒక టూచన్‌కు వ్యతిరేకముగా వేరొక టూచన్‌కు సహాయము చేయుచుండిరి.

బాల్యావస్థలోనున్న చీనా రిపబ్లిక్ బ్రహ్మాండమగు సమస్యల నెదుర్కొనవలసివచ్చెను. మరణావస్థలోనున్న సామ్రాజ్యప్రభుత్వము నుండి రాజకీయాధికారమును గ్రహించుట మాత్రమే కాదు అది చేయ వలసిన పని. కేంద్రాధికారము లేకుండుటచే గ్రహించుటకు రాజకీయాధి కారము లేనట్లే. అట్టి అధికారము నిప్పుడు సృష్టింపవలసి వచ్చెను. ప్రాతచీనా పేరుకు మాత్రమే సామ్రాజ్యము. అనేక స్వతంత్ర ప్రదేశ ముల సమూహమే అది యదార్థమునకు. అవి యైనను దృఢ బద్ధము కావు. సుమారు రాష్ట్రములన్నియు స్వతంత్రము గానే ఉండెను. పట్టణ ములు, పల్లెలు సైతము స్వతంత్రముగానే ఉండెను. కేంద్ర ప్రభుత్వాధి కారమును, లేదా చక్రవర్తి అధికారమును ఇవి అంగీకరించెను. కాని ఈ ప్రభుత్వము స్థానిక వ్యవహారములలో కలుగజేసికొనుట లేదు. కేంద్రము వశమందున్న అధికారము, పరిపాలనయు వివిధప్రభుత్వాంశ ములందు సామరస్యమును గల ఐక్య రాజ్యము (Unitary State)

లేదు. (రాజకీయదృష్టిలో) ఇట్టి దృఢబద్ధము కాని రాజ్యమే, పాశ్చాత్య పరిశ్రమయొక్కయు, రాజ్యకాంక్షయొక్కయు, సంఘట్టనకు విచ్ఛిన్న మయ్యెను. చీనా నిలువవలెనన్న అది దృఢమగు కేంద్రీకృత రాజ్య ముగా నుండవలెననియు, అందలి ప్రభుత్వ పద్ధతి ఒకేమాదిరిగా నుండ వలెననియు ఇప్పుడు వా రూహించిరి. నూతన రిపబ్లిక్ అట్టి రాజ్యమును నిర్మింప తలపెట్టును. అది సరిక్రొత్త విషయము కాన రిపబ్లిక్‌ను ఎదు ర్కొన్న పెద్ద కష్టములలో నిది యొక్కటయ్యెను. సరియైన రాకపోక మార్గములు లేకుండుట, రోడ్లు రైల్వేలు లేకుండుటవలన రాజకీయముగా దేశమును ఐక్యము చేయుట మిక్కిలి కష్టముగా నుండెను.

వెనుకటిరోజులలో రాజకీయాధి కారమునకు ప్రత్యేకముగా చైనీ యులు ప్రాముఖ్య మీయలేదు. ప్రబలమగు వారి నాగరికతయంతయు సంస్కృతిపై నాధారపడియుండెను. జీవితమును గడపు కౌశల్యమును వారి సంస్కృతి వారికి నేర్పెను. దీనికి సాటి మరెందును కానరాదు. తమ ప్రాచీన సంస్కృతిలో వారు నిమగ్నులైయుండిరి. వారి రాజకీయ, ఆర్థిక నిర్మాణములు కూలిపోయినప్పటికిని ప్రాచీన సంస్కృతి మార్గముల వారు విసర్జించలేదు. కావలెనని చెప్పి జపాను పాశ్చాత్య పరిశ్రమలను, పాశ్చాత్యపద్ధతులను అవలంబించెను. కాని దాని ఫ్యూడల్ బుద్ధి మారలేదు. చీనాలో ఫ్యూడల్ పద్ధతి లేదు. హేతువాద సిద్ధాంతములన్న ప్రీతి; శాస్త్రదృష్టి కూడ దానికి కలదు. శాస్త్రములందును, పరిశ్రమలందునుపాశ్చా త్యులు పొందుచున్న అభివృద్ధిని అది ఆత్రతతో గమనించుచుండెను. జపానువలె నది చొరవతో నందు ప్రవేశించలేదు. అనేకకష్టములు చీనాకు అడ్డువచ్చు మాట నిజము. అట్టి కష్టములు జపానుకులేవు. ప్రాచీన సంస్కృతిని ఎడబాయ జేయు కార్యమును దేనిని చేయుటకును అది సందే హించుచుండెను. తత్వశాస్త్ర వేత్తకుండు మనఃప్రవృత్తి చీనా కుండెను. తత్వశాస్త్ర వేత్తలు తొందరపడి ఏ కార్యమును చేయరు. వెనుకను ఇప్పుడును కూడ దాని మనస్సు మధనపడుచుండెను.

అది ఎదుర్కొనవలసిన సమస్యలు వట్టిరాజకీయములే కాదు. ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, విద్యా సమస్యలు మున్నగువాని నది ఎదుర్కొన వలసి వచ్చినది.

అదిగాక చీనా, ఇండియాల వంటి పెద్దదేశముల పరిమాణమే కష్టముల కలిగించుచున్నది. అవి ఖండములవంటి దేశములు కాన ఖండముల కుండు భారము కొంత నవి భరించవలసియున్నది. ఏనుగు కూలబడినచో లేచుటకు కొంతకాలము పట్టును. పిల్లివలెను, కుక్క వలెను అది గంతువేసి లేవలేదు.

ప్రపంచయుద్ధము ప్రారంభమైనప్పుడు వెంటనే జపాను మిత్ర మండలితో కలిసి జర్మనీపై యుద్ధము ప్రకటించెను. కియాొచౌను అది స్వాధీనము చేసికొనెను. పిమ్మట కియాొచౌ ఉన్న షాంటంగ్ రాష్ట్రి ములోని కది వ్యాపింప మొదలుపెట్టెను. దీని అర్థము — చీనాదేశ ముపై జపాను వారు దండెత్తినా రన్నమాట. ఈ ప్రదేశముతో జర్మనీ కెట్టి ప్రసక్తియులేదు. కాన జర్మనీపై సేనలు నడిపించుటయను కార్యము ఇందు పొసగదు. చీనా ప్రభుత్వము వారిని మర్యాదగా వెనుకకు పొమ్మనెను. ఎంత పొగరు బోతుతనము! అన్నారు జపాను వారు. వెంటనే జపాను వారొక అధికారపత్రమును తయారుచేసి చీనాకు పంపిరి. అందు అధికారపురస్సరముగా వారుకోరిన అంశములు ఇరువై యొకటి ఉండెను.

ఈ 'ఏకవింశతి'వాంఛలు ప్రసిద్ధినందినవి. వానిని నేనిచ్చట ఏకరువు పెట్టను. ముఖ్యముగా మంగోలియా, మంచూరియా, షాంటంగ్ రాష్ట్రిములలో సర్వహక్కులు, అధికారములు, జపానుకు సంక్ర మించవలె నని వానియభిప్రాయము. ఈ వాంఛలను చెల్లించుట కంగీ కరించిన పక్షమున ,వచ్చు ఫలితమేమనగా, చీనాను జపానుయొక్క వలసభూమిగా మార్చినట్లగును. దుర్బలస్థితిలో నున్న ఉత్తర చీనాప్రభు త్వము ఈ వాంఛలను ప్రతిఘటించెను. కాని బలవత్తరమగు జపాను

సైన్యము ముందు అది ఏమిచేయగలదు ? ఇదియునుగాక ఈ ఉత్తర చీనా ప్రభుత్వము తన ప్రజలలో పలుకుబడి సంపాదించినది కాదు. ఏమైనను అది యొక మంచిపని చేసినది. అది లాభకారి అయ్యెను. జపాను వారి వాంఛల నది ప్రకటించెను. వెంటనే చీనాలో పెద్దగోల బయలుదేరెను. యుద్ధమునందు నిమగ్నులైన ఇతర రాజ్యముల వారికి కోపముకలిగెను. ముఖ్యముగా అమెరికా కూడదనెను. పర్యవసాన మేమనగా, జపాను కొన్ని వాంఛల నుపసంహరించుకొనెను. కొన్నిటిని సంస్కరించెను. మిగిలిన వాంఛల విషయమున చీనాను వేధించి 1915 మే నెలలో వానిని అంగీకరించునట్లు చేసెను. దీనికి ఫలితముగా చీనాలో జపానుపై వ్యతిరేకభావము తీవ్రముగా జనించెను.

యుద్ధము ప్రారంభమైన మూడు సంవత్సరములకు ఆగస్టు 1917 లో చీనా మిత్రమండలితో చేరి జర్మనీపై యుద్ధము ప్రకటించెను. ఇది హాస్యాస్పదము. ఎందుకన చీనా ఏ విధముగాను జర్మనీకి హానిచేయలేదు. దాని ఉద్దేశము మిత్రమండలిని మంచిచేసికొనవలెననియే. ఇట్లు చేసిన జపానువారి దురాక్రమణనుండి తప్పించుకోవచ్చునని దాని ఆశ.

దీనికి తరువాతనే బోల్షివిక్కుల 1917 నవంబరు విప్లవము తటస్థించెను. ఉత్తర ఆసియాయం దంతట అల్లరులు వెంటనే బయలుదేరెను. సోవియట్ పక్షమువారికీ, సోవియట్ వ్యతిరేకులకు సైబీరియా ఒక యుద్ధభూమియైనది. రష్యన్ శ్వేతసేనాని అయిన కోల్‌చక్ సోవియట్లపై సైబీరీయానుండి సేనల నడిపించెను. సోవియట్ల విజయము చూచి జపానుభయపడి సైబీరియాకు పెద్ద సైన్యమును పంపెను. బ్రిటిష్, అమెరికన్ సేనలుకూడ అచ్చటికి పంపబడెను. కొంతకాలము వరకు సైబీరియా, మధ్య ఆసియాలలో రష్యన్ పలుకుబడి అంతరించెను. ఈ ప్రదేశములలో రష్యాకున్న ప్రతిష్ఠను పూర్తిగా భగ్నము చేయుటకు బ్రిటిష్ ప్రభుత్వము శాయశక్తులా ప్రయత్నించెను. మధ్య

ఆసియా నడిబొడ్డులో, కాష్గర్‌లో, బ్రిటిష్‌వారు వైర్‌లెస్ స్టేషన్ స్థాపించి బోల్షివిక్కులకు వ్యతిరేకముగా ప్రచారము సాగించుచు వచ్చిరి.

మంగోలియాలో కూడ సోవియట్లకును, సోవియట్ వ్యతిరేకులకును తీవ్రయుద్ధము జరిగెను. మహాయుద్ధము జరుగుచుండగా, 1915 సంవత్సరములోనే, జారుల రష్యా సహాయముతో చీనా ప్రభుత్వము నుండి చాలవరకు స్వాతంత్ర్యమును మంగోలియా సంపాదించెను. కాని చీనా సార్వభౌమత్వ మట్లేనిలిచి యుండెను. మంగోలియా యొక్క విదేశవ్యవహారముల చూచుటకు రష్యాకుకూడ అందుస్థాన మిచ్చిరి. ఇది వింత ఏర్పాటు. సోవియట్ విప్లవానంతరము మంగోలియాలో అంతఃకలహము తటస్థించెను. మూడేళ్ల పైబడి పోరాడిన పిమ్మట స్థానిక సోవియట్లు విజయము సాధించినవి. ప్రపంచ యుద్ధానంతరము జరిగిన శాంతిసమావేశమును గూర్చి నీకింకను చెప్ప లేదు. వేరొక జాబులో దానినిగూర్చి చెప్పుదును. కాని ఒక్క విషయమును మాత్రము ఇచ్చట చెప్పుదును. సమావేశమునకు వచ్చిన పెద్దరాజ్యములు — అనగా ముఖ్యముగా ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా సంయుక్తరాష్ట్రములు — చీనాకు చెందిన షాంటంగ్‌ను జపానుకు ధారా దత్తముచేయుటకు నిశ్చయించిరి. ఇట్లు వారి మిత్రదేశమైన చీనా, యుద్ధ ఫలితముగా, తన దేశములో కొంతభాగము వదలుకొనునట్లు చేయబడినది. ఇందుకు కారణము యుద్ధకాలమున ఇంగ్లాండు, ఫ్రాంసు, జపానులు చేసికొన్న రహస్యసంధి. కారణ మెట్టిదైనను చీనా నిట్లు మోసగించుట చీనా ప్రజల కెంతో కంటకముగా నుండెను. ఈ విషయములో పెకింగు ప్రభుత్వము ఏమాత్రమును లొంగకూడదనియు, లేనిచో విప్లవమునకు దిగుదుమనియు చీనా ప్రజలు బెదిరించిరి. జపాను వస్తువులను పూర్తిగా బహిష్కరించవలెనని ప్రకటన చేయబడెను. జపానుకు వ్యతిరేకముగా అల్లరులు పొడచూపెను. చీనా ప్రభుత్వము—

అనగా ఉత్తర పెకింగు ప్రభుత్వ మని నా ఉద్దేశము; అదియే ప్రధాన ప్రభుత్వము—శాంతి సంధికి చేవ్రాలుపెట్టుటకు నిరాకరించెను.

రెండు సంవత్సరములతర్వాత అమెరికాలోని వాషింగ్‌టన్‌లో ఒక సమావేశము జరిగెను. అప్పుడు షాంటంగ్ విషయము ఆలోచనకు వచ్చెను. దూరప్రాచ్య సమస్యలలో ఆ సక్తిగల రాజ్యములన్నియు కూడిన సమావేశ మది. వారి వారి నావికాబలమును చర్చించుకొనుటకు ఈ సమావేశము కూడెను. 1922 లో జరిగిన ఈ వాషింగ్‌టన్ సమావేశమువల్ల, చీనాకు జపానుకు సంబంధించి నంతవరకు, ప్రధాన ఫలితములు అనేకము కలిగెను. షాంటంగ్‌ను జపాను చీనాకు తిరిగి ఇచ్చివేయుట కంగీకరించెను. ఇట్లు చీనా ప్రజల నాందోళనపరచుచున్న ఒక సమస్య పరిష్కరింపబడెను. ఆ రాజ్యములు తమలో తాము ముఖ్యమగు ఒడంబడికలు రెండుచేసికొనిరి.

అందొకదాని పేరు 'నాలుగు రాజ్యముల ఒడంబడిక.' అమెరికా, గ్రేట్ బ్రిటన్, జపాన్, ఫ్రాంసురాజ్యము లీ ఒడంబడిక చేసికొనెను. ఈ నాలుగురాజ్యముల వారును, పసిఫిక్ లో తమ తమకున్న ప్రదేశములను, తమలో తామెవ్వరును దురాక్రమణ చేసికోరాదని వాగ్దానము చేసికొనిరి. రెండవ ఒడంబడికకు 'తొమ్మిది రాజ్యముల ఒడంబడిక' అని పేరు. సమావేశమునకు వచ్చిన తొమ్మిదిరాజ్యములును చేసికొన్న ఒడంబడిక ఇది. ఆ తొమ్మిది రాజ్యములు — అమెరికా సంయుక్తరాష్ట్రములు, బెల్జియం, బ్రిటన్, ఫ్రాంసు, ఇటలీ, జపాన్, హాలెండు, పోర్చుగల్, చీనా. ఈ సంధిలో మొట్టమొదటి నిబంధనము ఇట్లు ప్రారంభమయ్యెను:

> "చీనాయొక్క ప్రభుత్వమును, స్వాతంత్ర్యమును, దేశమును, పరిపాలనను మన్నించుటకును..."

ఈ రెండు ఒడంబడికలయొక్క ప్రధానోద్దేశము, ఇక ముందు చీనాపై ఎవరును కాలుదువ్వకుండ దానిని రక్షించుటయును, ఇంతవర

కును పెద్దరాజ్యములు ఇతరదేశములనుండి కొంత భూమిని దానముగా గ్రహించి, అందు ప్రవేశించి, దానినుపయోగించుకొనుట, దానిని తమ రాజ్యములలో కలుపుకొనుట అను కార్యములను ఆపుదల చేయుటయును. యుద్ధానంతర సమస్యలలో పాశ్చాత్య రాజ్యములు నిమగ్నులైయుండి అప్పటిమట్టుకు చీనాపై వారు ఆసక్తి చూపుటలేదు. ఇట్టి విరాగ బుద్ధిని సూచించు నిర్ణయమునకు త్రికరణ శుద్ధిగా వారు ఒడంబడుటకు కారణమదియే. అనేక సంవత్సరముల కాలముపాటు అవలంబించు చున్న తన నీతి కిది వ్యతిరేకముగా నున్నను జపాను కూడ ఈ నిర్ణ యమునకు సమ్మతించెను. పెక్కు సంవత్సరములు గడవకముందే జపాను, ఈ నిర్ణయములకు, వాగ్దానములకు వ్యతిరేకముగా తన ప్రాత నీతిని సాగించెను ; చీనాపై దండెత్తెను. అంతర్జాతీయ వ్యవహారము లలో సిగ్గుమాలిన అబద్ధములకు, కపటవంచనలకు ఇది యొక పెద్ద నిదర్శనము. తరువాత జరిగిన విషయము లెట్టి సందర్భములలో జరి గినవో తెలిసికొనుటకు నిన్ను వాషింగ్‌టన్ సమావేశమునకు తీసికొని పోవలసియున్నది.

వాషింగ్‌టన్ సమావేశము జరిగిన కాలమునందే సైబీరియా నుండి అన్యదేశ సైన్యములు కూడ చివరసారి తరలిపోయినవి. చిట్ట చివర వెళ్ళిపోయినవి జపానుసైన్యములు. వెంటనే స్థానిక సోవియట్లు ముందుకువచ్చి రష్యాలోని సోవియట్ రిపబ్లిక్‌లో చేరిరి.

ఇతర సామ్రాజ్యములతోపాటు జారుల రష్యా చీనాలో అనుభ వించుచున్న ప్రత్యేక హక్కులను తాము వదలుకొందుమని రష్యన్ సోవియట్ తొలిరోజులలో చీనా ప్రభుత్వమునకు చెప్పెను. సామ్రా జ్యతత్వమునూ, కమ్యూనిజమునూ ఒక్కచో నుండజాలవు. అది అట్లు న్నను, పాశ్చాత్య రాజ్యములచే బెదిరింపబడుచు, వారి ప్రయోజనముల కాహుతియగుచు చిరకాలము నుండి బంధింపబడుచున్న తూర్పుదేశముల పట్ల సోవియట్ బుద్ధి పూర్వకముగా, ఉదాహరణముగా మెలగగోరెను.

ఇట్టి ప్రవర్తన నీతి బద్ధమే కాదు; చక్రవిరాజ నీతి కూడ. ఇందుచే తూర్పుదేశము లందు దానికి మిత్రులేర్పడిరి. ప్రత్యేక హక్కులను సోవియట్ వదలుకోగోరుట కొన్ని షరతులకు బద్ధమై కాదు. దానికి ప్రత్యామ్నాయము వేరేమియు కోరలేదు. అయినను సోవియట్‌తో వ్యవహరించుటకు చీనాప్రభుత్వము భయపడుచుండెను. పాశ్చాత్య యూరోపియన్ రాజ్యములకు కోపమువచ్చునేమోయని చీనాభయము. చివరకెట్లో రష్యన్ ప్రతినిధులును, చీనాప్రతినిధులును సమావేశమైరి. 1924 లో కొన్ని షరతుల కొప్పుకొనిరి. ఈ ఒడంబడిక సంగతి విని ఫ్రెంచి, అమెరికన్, జపాను ప్రభుత్వములు పెకింగ్ ప్రభుత్వము నకు తమ అసమ్మతిని తెలిపిరి. పెకింగ్ భయభ్రాంతయై ఒడంబడి కపై తన ప్రతినిధి చేసిన చేవ్రాలు వానిది కాదని చెప్పెను. ఇట్టి స్థితికి దురదృష్టవశాత్తు పెకింగ్ ప్రభుత్వము వచ్చినది: అటు పిమ్మట రష్యన్ ప్రతినిధి ఒడంబడిక పూర్తిపాఠమునంతయు ప్రకటించెను. అందరును విభ్రాంతులైరి. పెద్దరాజ్యములతో సంబంధములు పెట్టు కొన్న తరువాత ప్రథమ పర్యాయము చీనాను అందరును గౌరవభావ ముతో, ఉచిత విధముగా చూడ మొదలుపెట్టిరి. దాని హక్కులను వారు ఒప్పుకొనిరి. ఒక పెద్దరాజ్యముతోసమాన ఫాయీగా చీనా చేసి కొన్న మొదటిసంధి ఇదియే. చీనా ప్రజలా నందించిరి. ప్రభుత్వము సంధిపత్రముపై చేవ్రాలు పెట్టవలసివచ్చెను. సామ్రాజ్య రాజ్యముల కిది ఇష్టము లేకుండుట సహజమే. ఎందువల్ల ననగా — రష్యాతో పోల్చినప్పుడు అవి తలవంచుకొనవలసి వచ్చెను. ఉదార బుద్ధితో తన హక్కులను రష్యా పరిత్యజించెను. తమ ప్రత్యేకహక్కులకు సామ్రాజ్య రాజ్యములు అంటి పెట్టికొని యుండెను.

సోవియట్ ప్రభుత్వము, సన్ - యట్ - సెన్ యొక్క దక్షిణ చీనా ప్రభుత్వముతో (కాంటన్ దాని ప్రధాన నివాసస్థానము) సంప్రతించెను. అన్యోన్యముగా వారొక నిర్ణయమునకు వచ్చిరి.

ఈ కాలములో చాలవరకు ఉత్తర దక్షిణములకు అంతః కలహము నెమ్మదిగా జరుగుచుండెను. ఉత్తరమందలి వేర్వేరు సేనానాయకు లకును అంతః కలహము జరుగుచుండెను. ఈ ఉత్తరాది టూచన్‌లు (వీరిలో కొందరిని అగ్ర – టూచను లందురు) ఒక సిద్ధాంతముకొరకు గాని, ఒక కార్య క్రమము ననుసరించి గాని పోరాడుచుండుట లేదు. స్వాధికారము కొరకు వారు పోరాడుచుండిరి. ఒకరికొకరు మిత్రులగుచు, పిదప ప్రతిపక్షులతో చేరుచు క్రొత్త కూటములగుచు ప్రవర్తించు చుండిరి. నిరంతరము మారుచున్న ఈ కూటములు, పైనుండి చూచు వారికి గందరగోళముగా కనిపించుచుండెను. ఈ టూచనులు—సైనికులగు సాహసికులు — అనధికార సైన్యముల లేవదీసిరి: అనధికారముగా పన్నుల విధించిరి; తమసొంత యుద్ధములను నడిపించిరి: ఈ భారమంతయు చిరకాలమునుండి బాధపడుచున్న చీనా ప్రజలు భరించ వలసివచ్చెను. కొందరు అగ్ర - టూచనులకు వెనుక పరదేశ రాజ్య ములు, అందు ముఖ్యముగా జపాను, ఉన్నవని చెప్పుదురు. షాంగ్‌హై లోనున్న పెద్ద వర్తక సంఘములనుండి కూడ ధనము, సహాయము కూడ వారికి వచ్చుచుండెను.

దక్షిణమున పరిస్థితులు చక్కగానుండెను. డాక్టర్ సన్ - యట్ - సెన్ యొక్క ప్రభుత్వ మందు పనిచేయుచుండెను. దీనికి ఆదర్శములు గలవు. సిద్ధాంతములు కలవు; ఉత్తరాదిలోని కొన్ని టూచన్ ప్రభుత్వములవలె ఇది దోపుడు ప్రభుత్వము కాదు. 1924 లో కూ మిన్—టాంగ్ యొక్క ప్రథమ జాతీయ కాంగ్రెసు (దీనిని ప్రజాపక్షమందురు) సమావేశమయ్యెను. డా. సన్ ఒక ప్రణాళికను సిద్ధముచేసి దాని ముందుపెట్టెను. ఈ ప్రణాళికలో ఎట్టి సిద్ధాంతముల ప్రకారము జాతి నడువవలెనో సూచించబడినది. ఈ ప్రణాళికయును, ఈ సిద్ధాంతములును కూ - మిన్ - టాంగ్ పక్షమునకు నాటినుండియు ఆధారములైనవి. ఇప్పుడుకూడ జాతీయ ప్రభుత్వమునకు ఇదియే

రాజనీతిమార్గమును నిర్దేశించుచున్నట్లు చెప్పుదురు.

మార్చి 1925 లో డా. సన్ మరణించెను. చీనాదేశ సేవా నిమగ్నుడై అతని జీవితము కృశించెను. చీనా ప్రజల కతడు ప్రేమ పాత్రుడయ్యెను.

—

## 154

# యుద్ధకాలమున ఇండియా

ఏప్రిల్ 16, 1933

బ్రిటిష్ సామ్రాజ్యములో ఒక భాగ మగుటవలన ఇండియా ప్రత్యక్షముగా ప్రపంచయుద్ధములో తగుల్కొనెను. కాని ఇండియాలో గాని, తత్సమీపమునగాని పోరాటము జరుగలేదు. అయినప్పటికిని యుద్ధ ప్రభావమువల్ల అనేక విధములగు పరిస్థితులు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను తటస్థించెను. అందుచే గొప్పమార్పులు కలిగెను. మిత్రమండలి సహాయార్థమై ఇండియా ద్రవ్యసాధనము లన్నియు పూర్తిగా వినియోగింపబడెను.

అది ఇండియాకు సంబంధించిన యుద్ధముకాదు. జర్మన్ రాజ్యములపై దానికి ఎట్టి కార్పణ్యమును లేదు. టర్కీమాటకువచ్చిన — ఇండియాకు టర్కీపై సానుభూతి అధికముగా కలదు. కాని ఈ విషయమున ఇండియా ఇష్టానిష్టములతో పనిలేదు. అది బ్రిటన్‌పై ఆధారపడిన పరాధీన రాజ్యము. అందువల్ల సామ్రాజ్యవాదియగు గాని యజమాని చెప్పినట్లు అది చేయవలసి యుండెను. కాన, దేశములో ఆగ్రహము అధికముగా నున్నను ఇండియన్ సైనికులు టర్కీ

లతో, ఈజిప్షియనులతో, ఇతరులతో పోరాడిరి. పశ్చిమ ఆసియాలో తత్కారణమున ఇండియాపేరు చెప్పిన కంటగించుకొనుచుండిరి.

యుద్ధ ప్రారంభకాలమున ఇండియాలో రాజకీయములు మంద కొడిగా నుండెను. యుద్ధమువచ్చిన తరువాత రాజకీయములపై దృష్టి మరింత మందగించెను. బ్రిటిష్ ప్రభుత్వము వా రవలంబించిన యుద్ధ కార్యములు కారణముగా రాజకీయవ్యవహారములందు పాల్గొనుట కష్టములతోకూడిన పనిగా నుండెను. యుద్ధకాలమున ప్రభుత్వములు ఎవ్వరినైనను నిర్బంధించవచ్చును. ఏ కార్యమునైనను చేయ వచ్చును. దాని కెన్నడును ఆక్షేపణ ఉండదు. స్వేచ్ఛగా వా రిష్టమువచ్చిన పనులు వారు చేయవచ్చును. ఇంక దేనికిని స్వేచ్ఛ లేదు. అప్పుడు పరిశోధకుల (Censors) ను ఏర్పాటుచేయుదురు. సత్యమును మరుగుపరచుట, తరుచు అబద్ధములను ప్రచారము చేయుట వారు చేయుపని. వారి పనుల నెవరును విమర్శించరాదు. రాజకీయ సంబంధమగు ప్రతికార్యమును అదుపులోపెట్టుటకు ప్రత్యేక చట్టములు, శాసనములు అమలుబరుపబడును. యుద్ధ నిమగ్నమగు ప్రతిదేశమందును ఇట్లు జరుగును. ఇండియాలో ఇట్లు జరుగుట సహజమే. ఇండియాలో 'ఇండియారక్షణ చట్టము' (Defence of India Act) అమలు జరుపబడెను. యుద్ధమును బహిరంగముగా విమర్శించుట, యుద్ధ సంబంధమగు కార్యములు విమర్శించుట ఈ శాసనము కారణముగా నిరోధింపబడినవి. అయినను అంతరంగ మున టర్కీపై సానుభూతి సర్వసామాన్యముగా ప్రజలలో నుండెను. జర్మనీచేత బ్రిటన్ గట్టిదెబ్బతినవలెనని ప్రజలుకోరుచుండిరి. అమిత కష్టముల పాలుజేయబడిన వారికి ఇట్టి నిరర్థకమైన కోరిక యుండుట సహజమే. కాని బహిరంగముగా ఎవ్వరును ఈ కోరికలు ప్రకటిం చలేదు.

బ్రిటన్‌పై రాజభక్తిని తెలుపుచు బహిరంగముగా పెద్దపెద్ద

కేకలు వినవచ్చుచుండెను. స్వదేశ సంస్థానరాజులును, గవర్న మెంటుతో సంబంధమున్న మధ్యతరగతిలో పై మెట్టున నున్నవారును ఇట్లు చేయు చుండిరి. మిత్రమండలివారు ప్రజాస్వామికమునుగూర్చియు, స్వేచ్ఛను గూర్చియు, జాతి ప్రజల స్వాతంత్ర్యమునుగూర్చియు చేసిన పెద్ద ప్రకటనలను పురస్కరించుకొని బూర్జువాలుకూడ కొంతమట్టుకు మోస పోయిరి. ఇండియాకుకూడ ఆ ప్రకటనలు అనువర్తింపునని బహుశా ఊహించియుందురు. అవసరస్థితిలో బ్రిటన్‌కు చేసిన సహాయము వల్ల ముందుముందు మంచిలాభము చేకూరునని ఆశించియుందురు. ఏది యెట్లున్నను, వారి కోరిక లెందును చెల్లవు. గత్యంతరములేదు. కాన పరిస్థితులు దుష్టమైనను వారు ఉచిత విధముగా సంచరించిరి.

ఇండియాలోని బహిరంగ రాజభక్తి ప్రదర్శనము ఆ రోజులలో ఇంగ్లాండులో చాలా శ్లాఘింపబడెను. కృతజ్ఞతావాక్యము లనేకము వెలువడెను. దీని తర్వాత ఇండియాను నూతన దృక్పథముతో ఇంగ్లాండు చూచునని అధికారములో నున్నవారు చెప్పిరి.

కాని ఇండియాలోను, పరదేశములందును ఉన్న భారతీయులు కొందరు రాజభక్తిభావము నవలంబించలేదు. వారు, అనేకులవలె, మౌనముగానైన నుండలేదు. ప్రాత ఐరిష్ సిద్ధాంతమును వారు విశ్వ సించిరి. అది — ఇంగ్లాండు కష్ట సమయము స్వదేశమున కనుకూల సమయము. ముఖ్యముగా జర్మనీలోను, యూరోపుఖండమందలి ఇతర దేశములలోను ఉన్న భారతీయులు, ఇంగ్లాండు శత్రువులకు సహాయము చేయు మార్గములు వెదకుటకు, బెర్లిన్‌లో సమావేశమైరి. అందుకై ఒక కమిటీగా వా రేర్పడిరి. ఎట్టి సహాయము నైనను అంగీకరించు టకు జర్మన్ ప్రభుత్వము సిద్ధముగా నుండుట సహజమే. ఈ భారతీయ విప్లవపరులకు జర్మనీ స్వాగతము చెప్పెను. జర్మన్ ప్రభుత్వ మునకును, ఇండియా కమిటీకిని మధ్య వ్రాతమూలకమైన ఒడంబడిక ఒకటి జరిగెను. అందు వా రుభయులు చేవ్రాళ్లుపెట్టిరి. ఒడంబడికలో

ముఖ్యమైన విషయము – యుద్ధసమయమున జర్మన్ ప్రభుత్వమునకు ఇండియనులు సహాయముచేయ వాగ్దానము చేసిరి. జర్మనీకి విజయము చేకూరినపక్షమందు భారతదేశ స్వాతంత్ర్యము వారు పట్టుబట్టి ఇప్పించ వలెను. ఈ ఇండియన్ కమిటీ వారు యుద్ధము జరుగుచున్నంతకాలము జర్మనీకి అనుకూలముగా కృషిచేసిరి. పరదేశములకు పంపబడిన భారతీయ సైన్యములందు వారు ప్రచారము సాగించిరి. ఆఫ్ఘనిస్థానము నకును, ఇండియా వాయవ్యపొలిమేరలవరకును వారి కృషి వ్యాపించెను. కాని, బ్రిటిష్ వారికి ఆందోళన కలిగించుట తప్ప వారేమియు చేయ జాలకపోయిరి. సముద్రమార్గమున ఇండియాకు ఆయుధసామగ్రి పంపవలెనని వారు చేసిన ప్రయత్నము బ్రిటిష్ వారివలన భగ్న మాయెను. యుద్ధమందు జర్మనులు పరాజయమందుటతో ఈ కమిటీ, దాని ఆశలతో పాటు, అంతరించెను.

ఇండియాలో కూడ విప్లవ కార్యము లచ్చటచ్చట జరిగెను. కుట్రలను విచారించుటకు ప్రత్యేకముగా న్యాయసభలు ఏర్పరుపబడినవి. అనేకులు మరణదండన పాలైరి. అనేకులు దీర్ఘ కారాగార దండన మనుభవించిరి. అప్పుడు దండింపబడిన కొందరింకను - 18 సంవత్సరములు గడచినను - చెరసాలలో నున్నారు.

యుద్ధము సాగుచుండగా కొద్దిమంది, ఇతరదేశములందువలెనే, పెద్దపెద్ద లాభము లార్జించిరి. కాని ప్రజలలో బహు సంఖ్యాకులు యుద్ధమువల్ల కలుగు కష్టములను అంతకంత కెక్కువగా పొందు చుండిరి. వారిలో అసంతృప్తి పెరిగెను. యుద్ధరంగమునకు ఎక్కువ మంది మనుష్యులను పంపవలసివచ్చుటచే క్రొత్తసైనికులను సంపాదించుటకు తీవ్రప్రయత్నములు జరిగెను. క్రొత్తసిపాయిలను తెచ్చిన వారికి బహుమానములు, ఎరలు చూపబడెను. జమీందారులు వారి రైతుల నింతమందిని సిపాయిలుగా పంపవలెనను నిర్బంధ మేర్పడెను. ముఖ్యముగా పంజాబులో క్రొత్తసిపాయిలను సంపాదించుటకు, కూలీలను

సంపాదించుటకును ఇట్టి బలవంత మెక్కువయ్యెను. ఇండియానుండి వివిధయుద్ధరంగములకు, సిపాయిలుగానైతేనేమి, కూలివాండ్రుగానైతేనేమి, వెళ్ళినవారి సంఖ్య పదిలక్షలపై చిల్లర. ఈ బలవంతపుపద్ధతుల తత్సంబంధులకు కోపకారణమయ్యెను. యుద్ధానంతరము పంజాబులో తటస్థించిన అల్లరుల కిది యొకకారణ మని చెప్పుదుచు.

వేరొకవిధముగా కూడ పంజాబు బాధపడెను. పంజాబీ లనేకులు, ముఖ్యముగా సిక్కులు, అమెరికా సంయుక్త రాష్ట్రములందున్న కాలిఫోర్నియాకును, పశ్చిమ కెనడాలోనున్న బ్రిటిష్ కొలంబియాకును వలస వెళ్ళిరి. అనేకులు బారులుగట్టి వలసపోసాగిరి. చివరకు అమెరికా, కనడా అధికారులు అట్టి వలసలు నిషేధించిరి. వలసవచ్చు అట్టివారికి అడ్డంకులు కల్పించుటకై కనడా ప్రభుత్వమొక నిబంధన చేసెను. త్రోవలో ఓడలు మార్చుకుండ ఒక రేవుపట్టణమునుండి వేరొక రేవుపట్టణమునకు తిన్నగావచ్చిన వారినే చేర్చుకొందు మని నిబంధన. ఇండియానుండి వలసవారు రాకుండ ఆటంకపరచుటకే ఇది ఏర్పడినది. ఇండియానుండి పోవు వారు తప్పని సరిగా చీనాలోనో, జపానులోనో ఓడ మార్చుకు తీరవలెను. అప్పుడు బాబా గురుదత్‌సింగ్ అను సిక్కు 'కొమగటమారు' అనుపేరుగల ఓడనంతయు మాటాడి తీసికొని, కలకత్తానుండి వలస పోవువారి ననేకులను కెనడాలోని వాంకొవర్‌కు తీసికొనిపోయెను. ఇట్లు అతడు కెనడా చట్టమునుండి తెలివితేటలతో తప్పించుకొనెను. కాని కెనడా వారిని రానియ్యలేదు. వలస పోయిన వారి నెవ్వరిని ఓడ దిగనీయ లేదు. ఆ ఓడలోనే వారు ఇండియాకు తిరిగి పంపివేయబడిరి. వారు ఆదరువులేని, దిక్కులేని స్థితిలో, పట్టరానికోపముతో ఇండియా చేరిరి. కలకత్తా బడ్‌జి బడ్‌జివద్ద పోలీసులతో వారు చిన్న యుద్ధము చేసిరి. అనేకులు, ముఖ్యముగా సిక్కులు, మరణించిరి. ఈ సిక్కులలో అనేకుల జాడలు పోలీసులు పంజాబులో తీయుచుండిరి. వారిని పంజాబు అంతటిలోను తరిమి తరిమి కొట్టిరి. వీరివల్ల కూడ

11

పంజాబులో కోపము, అసంతృప్తి వ్యాపించెను. భారతదేశమంతయు 'కొమగట మారు' ఉదంతమును గర్హించెను.

యుద్ధము జరుగుచున్న కాలములో జరిగినదంతయు తెలిసికొనుట కష్టము. సెన్సారులు (Censors) వార్తలనేకము ప్రకటించుటకు సమ్మతింపకుండిరి. అందువల్ల అన్నిరకముల వదంతులు వ్యాపింపదొడగెను. అయినను సింగపూరులో ఇండియన్ పటాలమొకటి పెద్దపితూరిచేసిన దన్నవార్త వెల్లడి అయ్యెను. అనేక ఇతర ప్రదేశములలో చిన్నచిన్న అల్లరులు జరిగినవి.

ఇండియా, యుద్ధమునకు సిపాయిలను పంపుటయే కాదు, ఇతర విధములుగా సహాయము చేయుటయేకాదు, ధనమునుకూడ పంపవలసివచ్చెను. ఇండియా చేసిన 'బహుమానము' అని దీనిని పేర్కొనిరి. ఒక సందర్భములో పదికోట్ల పౌనులు ఈ విధముగా చెల్లింపబడెను. తరువాత మరియొక పెద్దమొత్తము వెళ్లెను. బీద దేశమునుండి బలవంతముగా గ్రహించిన యీ మొత్తమును 'బహుమానము" అనుట బ్రిటిష్ ప్రభుత్వము సారస్యమునకు నిదర్శనము!

ఇండియాకు సంబంధించినంతమట్టుకు, ఇంతవరకు చెప్పినదంతయు ప్రధానమైన యుద్ధఫలితములలో చేరదు. యుద్ధపరిస్థితుల వల్ల ప్రధానమైన మార్పు సంభవించుచుండెను. యుద్ధము జరుగుచుండగా ఇతర దేశముల విదేశవర్తకమువలెనే ఇండియా విదేశవర్తకముకూడ తారుమారయ్యెను. ఇండియాకు వచ్చుచుండు అమితమైన బ్రిటిష్ సరుకు చాలావరకు వచ్చుట మానెను. జర్మన్ జలాంతర్గాములు (Submarines) మెడిటరేనియన్, అట్లాంటిక్ సముద్రములలో ఓడలను ముంచుచుండెను. అట్టి సందర్భములలో వర్తకముసాగుటకు వీలులేకుండెను. కాన ఇండియా తన అవసరములను తాను పూర్తి చేసికొనవలసివచ్చెను. యుద్ధమునకు కావలసిన అనేక విధముల వస్తువులు ప్రభుత్వమునకు ఇండియా సరఫరా చేయవలసివచ్చెను.

కావున ఇండియాలో పరిశ్రమలు వేగముగా వృద్ధి అయ్యెను. ఇది వరలోనున్న వస్త్రపరిశ్రమ, నార (Jute) పరిశ్రమ మాత్రమేకాదు, యుద్ధకాలమున కుచితమైన క్రొత్తపరిశ్రమలును పెరిగెను. అంత వరకు ప్రభుత్వము సవితితల్లి ప్రేమతో చూచుచున్న తాతాఇనుము - ఉక్కు - కర్మాగారము ఇప్పుడెంతో ప్రాముఖ్యమును వహించెను. యుద్ధసామాను నది ఉత్పత్తిచేయగలుగుట అందుకు కారణము. గవర్నమెంటు ఆజమాయిషీని కొంచెమెచ్చుతక్కువగా అది పనిచేయు చుండెను.

యుద్ధము జరుగుచున్న సంవత్సరములలో ఇండియాలోని పెట్టుబడిదారులు, బ్రిటిష్ వారు, ఇండియనులు కూడ, స్వేచ్ఛగా వర్తకము సాగించిరి. పరదేశముల పోటీ వారికి లేకుండెను. ఈ సదవకాశమును వారు పూర్తిగా వినియోగించుకొనిరి. లాభములు సంపాదించిరి. బీదలగు భారతీయ ప్రజలు బాధపడిరి. వస్తువులధరలు పెంచబడెను. నమ్ముటకు వీలులేనంత లాభము కంపెనీ వాటాదారులకు పంచబడెను. ఎవరి కష్టమువల్ల ఈ లాభములు సాధ్యమైనవో అట్టి కార్మికుల హీనస్థితిలో మాత్ర మెట్టి మార్పులును కలుగలేదు. వారికూలి కొద్దిగా పెరిగినది కాని అవసర పదార్థములధరలంతకన్న పెరుగుటచే వారిస్థితి వెనుకటికన్న హీనముగా తయారయ్యెను.

కాని పెట్టుబడిదారు లధికముగా బాగుపడిరి. పెద్దపెద్దలాభములు సంపాదించిరి. ఆ లాభములతో వారు మరల పరిశ్రమలకు పెట్టుబడిపెట్టదలచిరి. ఇండియన్ పెట్టుబడిదారులు, ప్రథమ పర్యాయము, ప్రభుత్వముపై ఒత్తిడితీసికొని రాగల సామర్థ్యమును సంపాదించిరి. ఈ ఒత్తిడిమాట అట్లుండగా తత్కాలపరిస్థితులే యుద్ధకాలమున ఇండియన్ పరిశ్రమలకు బ్రిటిషు ప్రభుత్వము సహాయము చేయునట్లు చేసినవి. ఇంకను దేశమును పారిశ్రామికముచేయవలెనని

కోరుటచే పరదేశములనుండి ఎక్కువగా యంత్రములు దిగుమతి చేయ వలసివచ్చెను. అప్పుడట్టి యంత్రములు ఇండియాలో తయారుచేయ వీలు లేకుండెను. కాబట్టి ఇంగ్లాండునుండి ఇండియాకు తయారైన వస్తువులు వచ్చుటకుమారుగా యంత్రము లధికముగా ఇప్పుడు వచ్చు చుండుట గమనింతుము.

ఈ కారణములవల్ల ఇండియాలో బ్రిటిష్ రాజనీతి పెద్దమార్పును బొందెను. నూరు సంవత్సరములనుండి అమలులోనున్న నీతి త్యజింపబడినది. క్రొత్తనీతి వచ్చినది. బ్రిటిష్ సామ్రాజ్యతత్వము, మారుచున్న పరిస్థితుల కనుగుణముగా మారెను. ఇండియాలో బ్రిటిష్ పరిపాలనముయొక్క తొలిదశ లెట్లుండెనో వెనుక చెప్పియుంటిని. మొదటిదశ 18 వ శతాబ్దిదశ — కొల్లగొట్టి ధనమును మోసికొని పోయిన దశ. అప్పుడు రెండవదశ వచ్చెను. బ్రిటిష్ పరిపాలనము, వేళ్లదన్ని సుస్థిర మయ్యెను. ఈ దశ నూరు సంవత్సరములకాలము, అనగా యుద్ధము సంభవించువరకు. జరిగెను. ముడి వస్తువులను బ్రిటిష్ వారికి సరఫరాచేయుటకు, బ్రిటన్‌లో తయారైన వస్తువులను కొనుటకు అనువుగా ఇండియా ఉంచబడెను. పెద్దపరిశ్రమలు ఏ విధముగాను తలయెత్తకుండ జాగ్రత్త తీసికొనబడెను. ఆర్థికముగా ఇండియా వృద్ధికాకుండ ఆటంకపరుపబడెను. ఇప్పుడు యుద్ధ కాలమున మూడవదశ వచ్చెను. ఇప్పుడు బ్రిటిష్ ప్రభుత్వము ఇండియాలో పెద్దపెద్ద పరిశ్రమలను ప్రోత్సహించెను. బ్రిటన్‌లో వస్తువులు తయారుచేయువారికి కొంతవరకు ఇబ్బంది కలిగినను సరే అది ఇట్లు చేసెను. ఇండియాలో బట్టలపరిశ్రమ ప్రోత్సహించినట్లయిన లాంకషైరు నష్టము పొందవలెను. కారణము — లాంకషైరు బట్ట లను కొనువారు భారతీయులే. లాంకషైరు మున్నగు బ్రిటిష్ పరిశ్రమ లకు ఇబ్బంది కలుగువిధముగా బ్రిటిష్ ప్రభుత్వము ఎందువల్ల ఇట్టినీతి నవలంబించవలెను? యుద్ధపరిస్థితులవల్ల అది అట్లు చేయక తప్పినది

కాదు. ఇట్టి మార్పుకు కారణములను వివరముగా తెలిసికొందము :

1. యుద్ధకాలపు అక్కరలే ఇట్టి కార్యమును చేయించి ఇండియా పారిశ్రామిక మగుటకు తోడ్పడెను.

2. ఇందుచే ఇండియాలోని పెట్టుబడిదారుల సంఖ్య వృద్ధి యగును. వారికి బలము చేకూరును. తత్కారణమున తమ అదనపుధనమును పెట్టుబడి పెట్టుటకు సావకాశము కలుగుటకై పరిశ్రమాభివృద్ధికి మరికొన్ని సదుపాయము లధికముగా చేయమని వారు కోరుదురు. అట్టి కోరిక లుపేక్షించు స్థితిలో ఇప్పుడు బ్రిటన్‌లేదు. ఉపేక్షించినచో వారు బ్రిటన్‌కు దూరులగుదురు. నానాటికి ప్రబలు లగుచున్న అతివాదులకు, విప్లవపరులకు వారు సహాయము చేయుదురు. కాబట్టి అభివృద్ధికి కొన్ని సావకాశములను చూపి, సాధ్యమైనంతమట్టుకు వారిని బ్రిటన్‌కు సుముఖముగానుండునట్లు చేయుట భావ్యము.

3. ఇంగ్లాండులో పెట్టుబడిదారులవద్దనున్న అదనపుధనమును అభివృద్ధిచెందని దేశములలో పెట్టుబడిపెట్టిన లాభములు ఎక్కువ వచ్చును. కాబట్టి అట్టి అవకాశములకు వారు వేచియుందురు. ఇంగ్లాండు అమితముగా పారిశ్రామిక మయ్యెను గాన అచ్చట పెట్టుబడికి సరియైన అవకాశములు లేవు. లాభము లంతగా ఉండవు. కార్మికోద్యమము క్రమబద్ధమై బలము గలిగియుండుటచే అచ్చట కార్మికుల తొందరలు తరుచుగా కలుగుచుండును. అభివృద్ధికాని దేశములలో కార్మికులు దుర్బలులు. కాన కూలి తక్కువ, లాభములు హెచ్చు. సహజముగా బ్రిటిష్ పెట్టుబడిదారులు బ్రిటన్‌వశమందున్న ఇండియావంటి అభివృద్ధికాని దేశములలో తమ ధనమును పెట్టుబడి పెట్టకోరుదురు. ఇట్లు బ్రిటిష్ పెట్టుబడి మొత్తములు ఇండియాకు వచ్చును. అందుచే ఇండియా మరియు పారిశ్రామిక మగును.

4. అధికముగా పారిశ్రామికమైన దేశములే యుద్ధమును పటిష్ఠ

ముగా సాగించగలవని అనుభవమువలన తెలియుచున్నది. యుద్ధమున జారులరష్యా పూర్తిగా చితికి పోవుటకు కారణము అది తగినంత పారిశ్రామికము కాకపోవుట, ఇతర దేశములపై ఆధారపడుట. తరువాత రాగల యుద్ధము ఇండియా పొలిమేరలలో, సోవియట్ రష్యాతో జరుగునని ఇంగ్లాండుభయము. ఇండియాలో దాని సొంత పరిశ్రమలు పెద్దవి లేకున్నచో పొలిమేరలలో బ్రిటిష్ ప్రభుత్వము యుద్ధము నుచితవిధముగా సాగించలేదు. ఇది ప్రమాదకరము. కాన ఈ కారణమువల్లకూడ ఇండియా పారిశ్రామికమై తీరవలెను.

ఈ కారణములవల్ల తప్పని సరిగా బ్రిటిష్ రాజనీతి మారెను. ఇండియాను పారిశ్రామికము చేయుటకు నిశ్చయింప బడెను. లాంకషైరుకు ఇబ్బంది కలగినను, ఇతర బ్రిటిష్ పరిశ్రమల కిబ్బంది కలిగినను లక్షించక బ్రిటన్ యొక్క సామ్రాజ్య రాజనీతి విశాలదృష్టితో ఇట్టి నిర్ణయమునకు వచ్చెను. బ్రిటిష్ ప్రభుత్వమునకు ఇండియా అన్నను, దానిక్షేమమన్నను అమిత ప్రేమగనుక ఇట్టి మార్పుచేసినదని బ్రిటన్ చెప్పుకొన్నది. ఇట్టి నిర్ణయమును చేసి, ఇండియాలోని నూతన పరిశ్రమలు బ్రిటిష్ పెట్టుబడిదారుల వశమునందుండునట్లు బ్రిటన్ తగిన కట్టుబాట్లు చేసెను. ఈ వ్యాపారములో భారతీయ పెట్టుబడిదారు చిన్న వాటాదారుగా దయతో స్వీకరించబడెను.

1916 లో, యుద్ధము జరుగుచుండగా, ఇండియన్ ఇండస్ట్రియల్ కమిషన్ ఏర్పరుపబడెను. రెండుసంవత్సరముల తర్వాత అది తన రిపోర్టును ప్రకటించెను—ప్రభుత్వము వారు పరిశ్రమలను ప్రోత్సాహపరచవలెననియు, వ్యవసాయములో నూతన పారిశ్రామిక పద్ధతులు ప్రవేశపెట్టవలెననియు అది సిఫారసు చేసెను. ప్రారంభవిద్య సర్వే సర్వత్ర ప్రవేశపెట్టుటకు ప్రయత్నము చేయవలసియుండుననియు నది సూచించెను. ఇంగ్లాండులో ఫాక్టరీలు అభివృద్ధిచెందు తొలిరోజులలో కుశలులగు కార్మికుల తయారు చేయుటకై ప్రాథమికవిద్య అవసరమని

భావింపబడినట్లే ఇచ్చుటను ప్రాథమిక విద్య అవసరమని సూచింప బడెను.

యుద్ధము ముగిసిన పిమ్మట అనేక కమీషనులు, కమిటీలు ఏర్ప రుప బడెను. ఇండియన్ పరిశ్రమలను వ్యాపారశుల్కముల (Tarifs) సహాయముతో సంరక్షించవలసియుండుననియు సూచింపబడెను. ఇండి యన్ పరిశ్రమల కిది జయసూచకమని భావింపబడెను. కొంతవరకు ఇది జయసూచకమే. కాని వివరముగా విడదీసి పరిశీలించినట్లయిన కొన్ని విశిష్టలక్ష్యములు గోచరించును. విదేశపెట్టుబడిని, అనగా క్రియకు బ్రిటిష్ పెట్టుబడిని—ఇండియాకు వచ్చునట్లు ప్రోత్సాహింపవలెనని చెప్పబడినది. బ్రిటిష్ పెట్టుబడి వెంటనే ధారా వాహినిగా వచ్చి పడెను. ఇతర పెట్టుబడులను ఎంతో మించి ఇది ఉండెను. పెద్ద వ్యాపారము లనేకమునకు బ్రిటిష్ పెట్టుబడులు పెట్టబడెను. వ్యాపార శుల్కములు, ఇండియా పరిశ్రమ రక్షణమను పేర, ఇండియాలోని బ్రిటిష్ పెట్టుబడి రక్షణముగా పర్యవసించెను. ఇండియాలోని బ్రిటిష్ రాజనీతిలో యీ పెద్దమార్పు బ్రిటిష్ పెట్టుబడి దారులకు లాభకరముగా పరిణ మించెను. వారికి మంచి సురక్షితమగు మార్కెటు దొరికెను. కార్మి కులకు తక్కువ కూలి యిచ్చుటచే లాభము లెక్కువగా చేజిక్కెను. ఇంకొకవిధముగా కూడ ఈ ఏర్పాటు వారికి లాభకరముగా నుండెను. కూలి తక్కువగా నున్న ఇండియా, చీనా, ఈజిప్టమున్నగు దేశము లలో పెట్టుబడులు పెట్టి వారు ఇంగ్లాండులోని ఇంగ్లీషు కార్మికులకు కూలి తగ్గించెదమని బెదిరించిరి. అట్లు చేసినగాని ఇండియా, చీనా మున్నగు దేశములలో తక్కువ కూలితో తయారగు వస్తువులతో పోటీ చేయుట అసాధ్య మని వారితో చెప్పిరి. కూలి తగ్గింపుకు ఇంగ్లీషు కార్మికు లభ్యంతర పెట్టినచో, ఇంగ్లాండులోని తమ ఫ్యాక్టరీలను మూసి వేసి అన్యదేశములలో పెట్టుబడి పెట్టవలసియుండునని, అది విచార కరమగు విషయమనియు కార్మికులతో చెప్పిరి.

ఇండియాలోని పరిశ్రమలను కట్టుబాటులోనుంచుటకు బ్రిటిష్ ప్రభుత్వము అనేక విధములుగా ఉపాయములు పన్నెను. ఇదియంతయు క్లిష్టమైన విషయము కాన ఇచ్చట చర్చించ వలనుకొనలేదు. ఒక్క విషయము మాత్రము చెప్పకతీరదు. నేటి పరిశ్రమలలో బ్యాంకులు ప్రముఖస్థానము వహించియున్నవి. పెద్దవ్యాపారములకు పరపతి (Credit) అవసరము. అరువు తీసికొనుటకు సదుపాయములు దొరకకున్నచో ఎంతటి పెద్ద వ్యాపారమైనను హఠాత్తుగా కూలిపోవును. బ్యాంకులు అరువు లిచ్చును గనుక వానికెంత శక్తియున్నదో నీవు గ్రహించగలవు. అవి వ్యాపారములను బాగు చెయ్యనూ గలవు: పాడుచేయనూగలవు. యుద్ధము ముగియుటతోడనే బ్రిటిష్ ప్రభుత్వము దేశమునందలి బ్యాంకింగ్ పద్ధతి నంతయు తన స్వాధీనములో పెట్టుకొనెను. ఈ విధముగా నున్న చలామణి ద్రవ్యమును (Currency) నేర్పుగా నడుపుట చేత, ప్రభుత్వము ఇండియన్ పరిశ్రమల మీదా, వ్యాపార సంస్థలమీదా అధికముగా అధికారమును చెలాయించ వచ్చును. మరియు, ఇండియాలో బ్రిటిషు వస్తువును ప్రోత్సహించుటకు వారు, 'సామ్రాజ్య పక్షపాతశుల్కముల'ను (Imperial Preferences) ప్రవేశపెట్టిరి. దీని అభిప్రాయము — విదేశ వస్తువులపై, వ్యాపారశుల్కముల పేరున, పన్నులు విధించినచో, బ్రిటిష్ వస్తువులపై అంతకన్న తక్కువపన్ను విధించవలెను. లేదా పన్ను విధించరాదు. ఇట్లు చేసినచో ఇతరదేశముల వస్తువులకు లేని సదుపాయము బ్రిటిష్ వస్తువుల కుండును.

ఇండియన్ పెట్టుబడి దారుల యొక్కయు, పై మెట్టున నున్న బూర్జువాలయొక్కయు ప్రాబల్యము యుద్ధకాలమున అతిశయించినదని చెప్పితిని గదా! అది ఇప్పుడు రాజకీయోద్యమమున కూడ గోచరించ మొదలుపెట్టినది. యుద్ధమునకు ముందును, యుద్ధకాలమందును మందగించిన రాజకీయములు మరల తల యెత్తగా, స్వపరిపాలనము మున్నగు

వాంఛలు వెలువడుచుండెను. కారాగార వాసమును పూర్తిచేసి లోకమాన్యతిలకు చెరసాలనుండి బయటికివచ్చెను. అప్పుడు జాతీయ సభ మితవాదుల చేతులలో నున్నదని చెప్పియుంటిని. ప్రజలతో సంబంధములేని, పలుకుబడిలేని వారే ఈ మితవాదులు. ఇంతకన్న ఉదార భావములు గల రాజ్యవ్యవహార వేత్తలు కాంగ్రెసులో వేరు కాబట్టి వారు "హోంరూలు లీగుల" నేర్పాటుచేసిరి. అట్టివి రెండు స్థాపించ బడెను. ఒకటి లోకమాన్యతిలకు స్థాపించెను. రెండవది అనిబెసంటు స్థాపించెను. కొన్ని సంవత్సరములపాటు ఇండియన్ రాజకీయ ములలో అనిబెసంటు ప్రముఖపాత్ర వహించెను. ఆమె గొప్ప వక్త. సామర్థ్యముతో నామె వాదించగలదు. అందుచే రాజకీయ ములం దాసక్తి పునరుజ్జీవితమగుటకు అవి తోడ్పడెను. ఆమె చేయు చున్న ప్రచారము ప్రమాదకరమని ప్రభుత్వము భావించిరి. కొన్ని నెలల పాటు ఆమెను, ఆమె సహచరుల విడువురిని 'ఇంట ఖైదు' (Intern) చేసిరి. కలకత్తాలో జరిగిన కాంగ్రెసు కామె అధ్యక్షురాలయ్యెను. ప్రప్రథమ కాంగ్రెసు అధ్యక్షురాలామెయే. కొన్ని సంవత్సరముల అనంతరము సరోజినీ నాయుడు రెండవ కాంగ్రెసు అధ్యక్షురా లాయెను.

1916 లో కాంగ్రెసులోని మితవాద పక్షమునకును, అతివాద పక్షమునకును రాజీ కుదిరెను. డిశంబరు 1916 లో లక్నోలో జరిగిన కాంగ్రెసు కుభయపక్షములవారును హాజరయిరి. కుదిరిన రాజీ కొద్దికాలముపాటే ; రెండేళ్లలోపులో వారిలో విభేదము పుట్టెను. మిత వాదు లిప్పుడు లిబరల్సు అను పేరు పెట్టుకొని, కాంగ్రెసును వదలిపోయిరి. నాటినుండియు వారు కాంగ్రెసుకు దూరముగానే ఉండిరి.

1916 లో లక్నో కాంగ్రెసు జరిగినది. నాటినుండి జాతీయ సభ మరల జీవము పోసుకొన్నది. నాటినుండి అది శక్తివంతమైనది.

ప్రాముఖ్యము వహించినది. మొట్టమొదటిసారి మధ్యతరగతులవారి జాతీయసంస్థ ఇది యని అనిపించుకొన్నది. ప్రజాసామాన్యముతో దానికి ప్రసక్తిలేదు. గాంధిజీవచ్చువరకు ప్రజలకు దానిపై ఆసక్తి లేదు. మితవాదు లనబడువారును, అతివాదులును క్రియకు మధ్య తరగతులనుండి వచ్చినవారే. మితవాదులు కొద్దిమంది భాగ్యవంతులు, లేదా గవర్నమెంటు ఉద్యోగములవంటి ఉద్యోగములు చేయువారు మాత్రమే. అతివాదులన్న చాలామంది మధ్యతరగతుల వారికి సాను భూతి ఉండెను. నిరుద్యోగులగు బుద్ధికుశలులు పలువురు అతి వాదు లయం దుండిరి. బుద్ధికుశలులనగా నా అభిప్రాయము కొద్దిగానో, గొప్పగానో చదువుకొన్నవారు. వీరు తమ సంఖ్య నియమితము చేసి కొనిరి. వీరినుండి కొందరు విప్లవకారులలో చేరుచుండిరి. మిత వాద, అతివాదుల ఆదర్శములలో ఎక్కువతేడాలేదు. బ్రిటిష్‌సామ్రాజ్య ములోనే ఉండి తమదేశమునకు స్వపరిపాలన కావలెనని వారు చెప్పు చుండిరి. తాత్కాలికముగా అందు కొంత కొరవడినను వారు సమ్మ తింతురు. కాని మితవాదుల కంటె అతివాదు లెక్కువ కోరికలు పెట్టు కొనిరి. వారికన్న తీవ్రతరమగు భాషను వాడుచుండిరి. విప్లవ కారులు కొద్దిమంది మాత్రమే. వారు పూర్ణస్వాతంత్ర్యమును కోరు చుండిరి. కాని కాంగ్రెసునాయకులతో వారికి పలుకుబడిలేదు. మిత వాదులకు, అతివాదులకు ఉన్న ప్రధానభేదము — మితవాదులు భాగ్య వంతులును, ఉన్నవారును, ఉన్నవారి నాశ్రయించుకొని యున్నవారును. అతివాదులలో లేనివా రనేకులుకూడ ఉన్నారు. రెండు పక్షములలోను అతివాదులే తీవ్రవాదులు కాబట్టి దేశములో యువకులను వా రాకర్షించిరి. వారిలో పలువురు కార్యాచరణ ఎట్లున్నను తీవ్రభాషవల్లనే కార్యసిద్ధి పొందవచ్చునని భావించుచుండిరి. పై లక్షణములు ఉభయపక్షము లందున్న వ్యక్తు లందరికిని వర్తించవు — ఉదాహరణమునకు — గోపాలకృష్ణ గోఖలే ఉన్నాడు. అతడు మితవాది, సమర్థుడు, త్యాగ

బుద్ధిగల నాయకుడు. అతడు ఉన్నవాడుకాడు. అతడే ఇండియా సేవకుల సమాజమును (Servants of India Society) స్థాపించిన వాడు. ఆయితే మితవాదులుకాని. అతివాదులుగాని, కార్మికులు కర్ష కులు మున్నగు లేనివారితో సంబంధము కలవారుకారు. తిలక్ మాత్రము ప్రజలలో పలుకుబడి గలవాడు.

1916 లో జరిగిన లక్నో కాంగ్రెసు హిందూ – ముస్లిం పున రైక్యతకు సహకరించినది. జాతీయా దర్శములనే కాంగ్రెసు ఎల్ల ప్పుడు ప్రదర్శించినది కాని అందు అధిక సంఖ్యాకులు హిందువులు అగుటచే అది హిందువుల సంస్థగా నుండెను. యుద్ధమునకు కొద్ది సంవత్సరముల పూర్వమున ముస్లిం విద్యాధికులు, ప్రభుత్వముచే కొంతవరకు ప్రేరేపింపబడి, తమకై సర్వభారత ముస్లిం సంఘమును (All India Muslim League) స్థాపించుకొనిరి. కాంగ్రెసులో చేరకుండ ముస్లిములను వేరుపరుచుట కుద్దేశింపబడినది. కాని కొద్ది కాలములోనే అది కాంగ్రెసుపై మొగ్గుచూపి, దానిపై పువచ్చెను. లక్నోలో ఇండియా భావిరాజ్యాంగమునుగూర్చి ఒక ఒడంబడిక ఆవి చేసికొనెను. దీనికి కాంగ్రెసు - లీగుస్కీము అని పేరు. అల్ప సంఖ్యాకులగు ముస్లిములకు స్థానములు ఏనిష్పత్తిలోనుండవలెనో అవి ప్రధానముగా నిర్ణయించెను. ఈ కాంగ్రెసు - లీగు స్కీము రెండు పక్షములవారికి ఆచరణ యోగ్యమగు కార్యక్రమమయ్యెను. భారత దేశము కోరు వాంఛగా అది అంగీకరింపబడెను. బూర్జువాల అభి ప్రాయముల కది అనుగుణముగా నుండెను. అప్పటికి బూర్జువాలే రాజకీయములు తెలిసినవారు, ఈ స్కీము ననుసరించియే ఆందోళన దేశమున పెచ్చు పెరిగెను.

బ్రిటిష్ వారు టర్కీతో యుద్ధము చేయుచున్నా రన్న కోపమున ముస్లిములు కాంగ్రెసుతో చేతులు కలిపిరి. రాజకీయములందు వారి బుద్ధి ప్రవేశించెను. టర్కీతో సానుభూతి చూపుచున్నారనియు, ఆ

విషయమునుగూర్చి తీవ్రముగా ఉపన్యసించుచున్నారనియుచెప్పి యిద్దరు ముస్లిం నాయకులను — మౌలానా మహమ్మదాలీ, షౌకతాలీ అనువారిని, యుద్ధము తొలిరోజులలో 'ఇంటఖైదు' చేసిరి. మౌలానా అబుల్‌కలాం అజాద్ కూడ, తన వ్రాతలవల్ల, అరబ్బీ దేశములలో పేరు సంపాదించి, వానితో సంబంధము పెట్టుకొనుటచేత—"ఇంటఖైదు" చేయబడెను. ఇందుచే ముస్లిములు కుపితులైరి. అంతకంతకు ప్రభుత్వమునుండి వారు విముఖులైరి.

ఇండియాలో స్వపరిపాలనా వాంఛ వృద్ధియైన కొలది, బ్రిటిష్ ప్రభుత్వము అనేక వాగ్దానములు చేయుచు వచ్చిరి. అనేక విచారణలు జరుపుచు వచ్చిరి. ప్రజల దృష్టి వాని పైకి మళ్లెను. 1918 వేసవిలో అప్పటి ఇండియా సెక్రెటరీ ఆఫ్ స్టేటును, వైస్రాయియును కలసి ఒక ఉమ్మడి రిపోర్టును ప్రకటించిరి. వారి పేళ్ళను బట్టి దానికి "మాంటేగు — ఛెంమ్స్ఫర్డు రిపోర్టు" అను పేరు వచ్చెను. ఇండియాలో కొన్ని సంస్కరణములు, కొన్నిమార్పులు చేయవలసియుండునని అందు ప్రస్తావింప బడినది. వెంటనే వారు చేసిన ఉపపాదనలను పురస్కరించు కొని, ఇండియాలో వ్యతిరేకాభిప్రాయములు చెలరేగెను. కాంగ్రెసు తన అసమ్మతిని గట్టిగా తెలిపెను. అవి అసమగ్రమని భావించెను. లిబరల్సు వాని నామోదించిరి. ఇది కారణముగా కాంగ్రెసునుండి వారు విడిపోయిరి.

యుద్ధాంతమున ఇండియా పరిస్థితు లిట్లుండెను. మార్పు వచ్చునని ప్రజ లెదురుచూచుచుండిరి. రాజకీయ వాతావరణము వే డెక్కుచుండెను. మృదువుగా, చల్లగా, అసమర్థముగా, క్షమాపణ చెప్పుకొనుచున్నట్లున్న మితవాదుల వాక్కులకు బదులు, ఆత్మ విశ్వాసముతో కూడిన, కలహశీలమగు, సూటియైన, భీకర మైన, అతివాదుల వాక్కులు వినవచ్చుచుండెను. కాని మిత వాదులును, అతివాదులును రాజకీయదృష్టితోనే ప్రసంగించు చుండిరి.

ప్రభుత్వముయొక్క బాహ్యరచనను గూర్చియే ఆలోచించి, చర్చించు చుండిరి. వారికి తెలియకుండ బ్రిటిష్ సామ్రాజ్య తత్వము, నెమ్మదిగా, దేశముయొక్క ఆర్థిక జీవనముపై తన పట్టును దృఢము చేసికొను చుండెను.

—

# 155

# యూరోపు క్రొత్త పటము

ఏప్రిల్ 21, 1933

ప్రపంచయుద్ధగతిని గురించి సంక్షేపముగా చెప్పుకొంటిమి. పిమ్మట రష్యన్ విప్లవమునుగూర్చి ముచ్చటించుకొంటిమి. పిమ్మట యుద్ధకాలమున ఇండియాపరిస్థితి చూచితిమి. ఇప్పుడు మనము యుద్ధ విరామసంధిని పరిశీలింతము. విజేత లెట్లు నడచుకొనిరో చూతము. జర్మనీ పరాజితమైనది; కైజరు పారిపోయెను. రిపబ్లికు ప్రకటింపబడెను. అయినను జర్మన్ సైన్యమును పూర్తిగా దుర్బలముచేసి, భగ్నముచేయుటకై యుద్ధవిరామసంధి షరతులు మిక్కిలి కఠినముగా నుండెను. దండెత్తివచ్చిన ప్రదేశములనుండి జర్మన్ సైన్యము తొలగిపోవలెను. అంతేకాదు; ఆల్సేస్—లొరైను నుండియు, రైను నది వరకున్న జర్మన్ భాగము నుండియు కూడ తొలగిపోవలెను. కొలోన్ ప్రాంతమందున్న రైన్‌లాండును మిత్రమండలి ఆక్రమించును. తన యుద్ధనావల ననేకమును, తన 'యూ–నావ' లని చెప్పబడు జలాంతర్గామ లన్నింటిని, వేలకొద్ది



ఆస్ట్రియా - హంగరీలను విడగొట్టుటవల్ల ఏర్పడిన రాజ్యములు
జర్మనీ
పోలెండు
జకోస్లవాకియా
ఆస్ట్రియా
హంగరీ
రుమేనియా
యుగోస్లావియా
ఇటలీ
వియన్నా
బెల్గ్రేడు
యుద్ధానంతర సంధులు
కారణముగా
ఆస్ట్రియా హంగరీనుండి
తీసికొన్న దేశము

బరువు తుపాకులను, విమానములను, రైల్వే ఇంజనులను, లారీలను ఇతర సామగ్రిని జర్మనీ మిత్రమండలి కప్పగించి వేయవలెను.

యుద్ధ విరామసంధి పత్రముపై చేవ్రాళ్లు పెట్టినచోట, ఉత్తర ఫ్రాంసులోని కోంపైను అడవిలో, ఒక జ్ఞాపక చిహ్నముకలదు — అందీ వాక్యములు వ్రాయబడియున్నవి :

"ఇక్కడ, 1918 నవంబరు 11 తేదీని, జర్మన్ సామ్రాజ్యము యొక్క దురహంకారము మటుమాయమైనది. స్వతంత్ర ప్రజలను బానిసల జేయపూనుకొని, వారివల్లనే అది పరాజిత మైనది."

జర్మన్ సామ్రాజ్యము పోయినమాట వాస్తవమే. పైకిమట్టుకు పోయినది. ప్రష్యనుల యుద్ధసంబంధమగు దురహంకారము గడ్డి గరచెను. ఇంతకుముందే రష్యన్ సామ్రాజ్యము అంతరించెను. ఎంత కాలమునుండియో దుష్టముగా ప్రవర్తించిన రోమనోఫ్ వంశము రంగమునుండి నిష్క్రమింపజేయబడినది. యుద్ధము కారణముగా మూడవ సామ్రాజ్యముకూడ అంతరించెను. అది ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యము. హాప్సుబర్గుల ప్రాచీన వంశమునూ దానితో అంతరించెను. కాని ఇతర సామ్రాజ్యములు నిలిచియుండెను. అవి విజేతలవి. విజయము వారి దురహంకారమును తగ్గించలేదు. వారే ప్రజలను బానిసలనుగా జేసిరో, అట్టి ప్రజల హక్కులపట్ల వారి భావములు మారలేదు.

1919 లో యుద్ధ విజేతలు పారిస్‌లో శాంతిసమావేశమును జరుపుకొనిరి. పారిస్‌లో ప్రపంచభావిస్థితి వారిచే నిర్ధరింపబడ వలసి యుండెను. అనేక మాసముల కాలము ఈ ప్రసిద్ధపట్టణము ప్రపంచదృష్టి నాకర్షించెను. దూరమునుండియు, దగ్గిర స్థలముల నుండియు అన్నిరకముల ప్రజలు ప్రయాణమైపోయిరి. అందు రాజకార్యధురంధరులు కలరు; రాజకీయవేత్తలు కలరు; రాజ్య

తంత్రజ్ఞులు కలరు; ప్రవీణులు, సైనికులు, కోశాధ్యక్షులు కలరు. యుద్ధకాలమున లాభములు సంపాదించినవారు కలరు. వారం దరితోపాటు సహోద్యోగులు, టైపిస్టులు, గుమాస్తాలు లెక్కకు మించి కలరు. పత్రికా విలేఖకులు గుంపులుగా వచ్చిరని చెప్ప నక్కరయేలేదు. స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న ప్రజల ప్రతి నిధులును వచ్చిరి - ఐరిష్, ఈజిప్షియన్, అరబ్ ప్రజాప్రతినిధులును. పేరు తెలియని వారితరులును వచ్చిరి. ఆస్ట్రియన్, టర్కిష్ సామ్రాజ్య ముల శిథిలములనుండి ప్రత్యేక రాజ్యములు తమకొరకై యేర్పాటుచేసి కొనుటకై తూర్పు యూరోపునుండి మనుష్యులు వచ్చిరి. సందుచూచి లాభములు కొట్టుకొనవచ్చునని సాహసికు లనేకులును వచ్చిరి. ప్రపంచ మును క్రొత్తగా విభజించ బోవుచున్నారు కాన ఈ తరుణమును రాబందులు పోగొట్టుకోవు.

శాంతిసమావేశమును బట్టి ఎంతయో మేలు కలుగునని ఆశించ బడెను. భయంకరమగు యుద్ధానుభవము కలిగినది కాన న్యాయమగు, స్థిరస్థాయి యగు శాంతిని నెలకొల్పుదురని ప్రజ లాశించిరి. యుద్ధశాంతిచే ప్రజలింకను బాధపడుచుండిరి. కార్మికులలో అసంతృప్తి అధికముగా పెరిగెను. జీవితావసర వస్తువుల ధరలు అధికముగా పెరిగెను. ఇందుచే ప్రజల కష్టము లెక్కువ అయ్యెను. 1919 లో యూరోపుదేశమున రానున్న సాంఘిక విప్లవసూచన లనేకము కానవచ్చుచుండెను. రష్యా చూపిన మార్గము అవలంబించదగినదని తోచుచుండెను.

ఇట్టి సందర్భములలో శాంతిసమావేశము వార్సైలో కూడెను. 48 సంవత్సరములకు పూర్వము జర్మన్ సామ్రాజ్యము ప్రకటింపబడిన ఆహాలులోనే ఇది కూడెను. రోజు రోజుకు ఈ పెద్ద సమావేశము పనిచేయుట కష్టముగానుండును. కాన అది అనేక కమిటీలక్రింద భాగింప బడెను. ఇవి రహస్య స్థలముల సమావేశమై, తమ కుట్రలను, తమ జగడములను తెరమరుగున నుండి జరుపుకొనెను. మిత్రమండలి

యొక్క "పదిమంది సభవారి" అధికారము క్రింద సమావేశము జరిగెను. తరువాత పదిమంది అయిదుగురైరి. వారికి 'బృహత్పంచ' అని పేరు : వారు అమెరికా సంయుక్తరాష్ట్రములు, బ్రిటన్, ఫ్రాంసు, ఇటలీ, జపాను. ఇందుండి జపాను జారెను. అందుచే "నలుగురు సభవారు" మిగిలిరి. అందుండి మరల ఇటలీ జారెను. ఇక మిగిలినది 'బృహత్త్రయము': అమెరికా, బ్రిటన్, ఫ్రాంసు. ఈ మూడు దేశములకును ప్రతినిధులుగా పనిచేసినవారు ముగ్గురు: అధ్యక్షుడు విల్సన్, లాయడ్ జార్జి, క్లిమెంషూ. ప్రపంచమునకు క్రొత్తస్వరూపమిచ్చుట, దావిదారుణ బాధలతొలగించుట అనుకార్యము వీరి పాలబడినది. మానవాతీతులు, అవతార పురుషులు చేయతగ్గ కార్యమిది. ఈ ముగ్గురును మానవాతీతులును కారు, అవతారపురుషులును కారు. అధికారములోనున్న మానవులను—అనగా రాజులను, రాజకార్యధురంధరులను, సేనానులు మున్నగు వారిని, పత్రికలు ఎంతో పొగడి ఇంతటి గొప్పవారు లేరని ప్రచారము చేయును. సామాన్యప్రజలకు నిజముగా వారు మేధావులు, కార్యశూరులు అను భావము కలుగును. వారు తేజోవేష్టితులా అనిపించును. వారికిలేని గుణగణములు, జ్ఞానము చొప్పున మనము వారికంట గట్టుదుము. కొంతపరిచయము కలిగిన పిమ్మట వారు సాధారణ మానవులని తెలును. ప్రసిద్ధుడగు ఒక ఆస్ట్రియన్ రాజ్యతంత్రజ్ఞుడు ఒక మారిట్లు చెప్పెను: "ప్రపంచమును పాలించుచున్నవా రెంతటి అల్పజ్ఞులో తెలిసినచో లోకము దిగ్భ్రమ చెందును," అని. అయితే ఈ ముగ్గురును, ఈ 'బృహత్త్రయము' గొప్పగానే కనిపింతురు కాని వారి దృక్పథమా మిక్కిలి సంకుచితము, అంతర్జాతీయ విజ్ఞానమా వారికి పూజ్యము. భూగోళ శాస్త్రజ్ఞానమైనను వారికి లేదు.

వుడ్రో విల్‌సన్ అధ్యక్షుడు, గొప్ప ప్రతిష్ఠ, పలుకుబడికలవాడు. తన ఉపన్యాసములలోను, నోట్సులోను, చక్కని ఆదర్శసూచకమగు పమానము లెన్నో వాడెను. వానినిబట్టి ఇతడు రానున్న స్వేచ్ఛకు

ప్రవక్తవంటివాడని ప్రజలు భావించిరి. గ్రేట్ బ్రిటన్‌కు ప్రధానియైన లాయడ్ జార్జి చక్కని సమాసములు వాడుటలో ప్రవీణుడు. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట లాడు' వా డని ప్రసిద్ధిగనెను. క్లిమెంషూను "వ్యాఘ్ర" మందురు. ఆదర్శములన్నను, ధర్మవచనము లన్నను అతనికి నమ్మకములేదు. ఫ్రాంసు దేశముయొక్క ప్రాత శత్రువైన జర్మనీని అణచివేయుటే అతని ఆశయము. అణచివేసి అన్ని విధముల పరాభవించుట, మరల అది తలయెత్తకుండ చేయుట అతని అభీష్టము.

ఇట్లు వీరు ముగ్గురు వాదులాడుచు, తన పక్షమున కితరుల త్రిప్ప ప్రయత్నించుచు కాలక్షేపము చేసిరి. సమావేశమునందలి ఇతరులును, బయటనున్న వారును వీరిలో ప్రతియొక్కరిని తమ వైపు లాగుటకు ప్రయత్నించుచుండిరి. వీరందరికి సోవియట్ రష్యా పేరు చెప్పిన బెదురుగానే ఉండెను. సమావేశములో రష్యాకు ప్రాతి నిధ్యము లేదు. జర్మనీకిని లేదు. పారిస్‌లో సమావేశమైన ధనిక వర్గ రాజ్యము లన్నింటికి రష్యా గుండె బెదురుగానే ఉండెను.

లాయడ్ జార్జి సహాయముతో చివరకు క్లిమెంషూ నెగ్గెను. పట్టుదలతో ప్రయత్నించి ఒక్క విషయమును విల్సన్ సాధించెను. అది లీగ్ ఆఫ్ నేషన్సు — నానా జాతి సమితి. దీనిని మిగతవారిచేత ఒప్పించెను. మిగిలిన విషయములకు వీళ్లు వదలెను. ఎన్నో నెలల పాటు వాద ప్రతివాదములు జరిగినవి. శాంతి సమావేశమందలి మిత్రమండలి వారు చివరకొక చిత్తు సంధి పత్రమునకు సమ్మతించిరి. వారిలో వారి కంగీకారము కుదిరిన తర్వాత, వారి యాజ్ఞలను వినుటకు జర్మన్ ప్రతినిధులను ప్రవేశ పెట్టిరి. చిత్తు సంధి పత్రము బహు విస్తరముగా నుండెను. అందు 440 నిబంధన లుండెను. వీనిని జర్మనులముందు పెట్టిరి. సంధిపత్రముపై చేవ్రాళ్లు చేయమనిరి. జర్మనులతో వాదములకు దిగ దలచలేదు. సూచనలుగాని, మార్పుల


యూరోపులోని క్రొత్తదేశములు
నార్వే
స్వీడన్
ఫిన్లాండు
యు.
ఎస్.
ఎస్తోనియా
మాస్కో
లాట్వియా
లిథుయేనియా
డెన్మార్క్
డాన్ జిగ్
యస్.
జర్మనీ
పోలెండు
ఆర్.
జెకోస్లొవేకియా
రుమేనియా

గాని చేయుటకు వారి కవకాశ మియ్యలేదు. అది బలవంతపు సంధి. దానిపై వారు చేవ్రాళ్ళు పెట్టి తీరవలెను. లేదా ఫలితముల ననుభవించుటకు సిద్ధపడవలెను. నూతన జర్మన్ రిపబ్లిక్ ప్రతినిధులు తమ అనమ్మతిని తెలిపిరి. కట్టకడపటి దినమున వారు వార్సై సంధి పత్రముపై చేవ్రాళ్ళిడిరి. ఆస్ట్రియా, హంగరీ, బల్గేరియా, టర్కీలతో మిత్రమండలివారు ప్రత్యేక సంధులు చేసికొని చేవ్రాళ్లు చేసిరి. టర్కీతో చేసికొన్న సంధి, సుల్తాన్ అంగీకారమును పొందినప్పటికిని వదలుకొనవలసి వచ్చెను. కమాల్ పాషాయును, ధైర్య సాహసోపేతులగు అతని సహచరులును ప్రతిరోధించుట ఇందుకు కారణము. వీరి కథను ప్రత్యేకముగా నీకు తరువాత చెప్పెదను.

ఈ సంధులవల్ల వచ్చిన మార్పు లేమి ? తూర్పుయూరోపులో, పడమటి ఆసియాలో, ఆఫ్రికాలో, దేశములకు సంబంధించిన మార్పు లెక్కువగా ఉండెను. ఆఫ్రికాలో జర్మన్ వలసలు మిత్రమండలివారు తీసికొనిరి. ఇవి యుద్ధములోని దోపుడుక్రింద లెక్క. ఇందలి ఉత్తమ వలసలు ఇంగ్లాండు గ్రసించెను. టాంగనీకాయును, తూర్పు ఆఫ్రికాలోని ఇతర భాగములును చేర్చి ఉత్తరమున ఈజిప్టు మొదలుకొని దక్షిణమున అగ్రమువరకు నున్న ఎడతెగని భూభాగముపై సామ్రాజ్యము స్థాపించుకొని బ్రిటిష్‌వారు తమ చిరకాలవాంఛిత సిద్ధి పొందిరి.

యూరోపులో జరిగిన మార్పు లధికముగా నుండెను. నూతన రాజ్యము లనేకము దేశపటముపై కెక్కెను. ప్రాతదేశపటమును క్రొత్తదేశపటముతో పోల్చి చూచినచో పీ పెద్దమార్పులు నీవు గమనించవచ్చును. ఇందలి కొన్ని మార్పులు రష్యన్ విప్లవ ఫలితములు. రష్యా పొలిమేరలలో నివసించు అనేకులు—వీరు రష్యనులుకారు—సోవియట్‌నుండి విడివడి స్వాతంత్ర్యము ప్రకటించుకొనిరి. సోవియట్ ప్రభుత్వము వారి స్వయం నిర్ణయాధికారమును అంగీకరించి కలుగజేసి

క్రొనలేదు. యూరోపు క్రొత్తపటమును చూడుము. ఆస్ట్రియా—హంగరీ అను పెద్దరాజ్య మంతరించినది. దానిస్థానే చిన్నరాజ్యము లనేకము తలయెత్తినవి. వీనిని తరుచు ఆస్ట్రియన్ సక్సెషన్ స్టేట్సు (తరువాతవచ్చిన ఆస్ట్రియాతాలూకు రాజ్యములు) అందురు. ఇవి: ఆస్ట్రియా — ఇది వెనుక పెద్దరాజ్యమైనను ఇప్పుడు చిన్నముక్క అయినది. వియన్నా అను పెద్దనగరము దానిరాజధాని. హంగరీ — ఇదియును పరిమాణమున తగ్గినది. జెకోస్లవేకియా — ప్రాతబొహిమియా ఇందు చేరియున్నది. యుగోస్లావియాలో ఒకభాగమైన సెర్బియా — ఇది పోల్చుకోలేనంతగా పెరిగినది. రుమేనియాకు, పోలెండుకు, ఇటలీకి పోయిన భాగములు. ఇదంతయు శస్త్రఛేదనమే.

ఇంకా ఉత్తరమున ఇంకొక నూతన రాజ్యమున్నది. అసలు అది ప్రాతరాజ్యమే క్రొత్తగా అవతరించినది — అది పోలెండు. ప్రష్యా, రష్యా, ఆస్ట్రియాలలోని భూభాగములతో నది యేర్పడినది. పోలెండుకు సముద్ర మందు బాటులో నుండుటకై అసామాన్యమగు అద్భుత కార్యమొకటి చేసిరి. జర్మనీని అనగా ప్రష్యాను రెండుభాగములుగాచేసి సముద్రమునకు పోవుమార్గము నేర్పాటుచేసి దానిని పోలెండు వశము చేసిరి. ఇప్పుడు పడమటి ప్రష్యానుండి తూర్పు ప్రష్యాకు పోవుటకు ఈ పోలిష్ మార్గము దాటవలసియుండెను. ఈ మార్గమువద్దనే డాంజిగ్ అను ప్రసిద్ధనగరమున్నది. దీనిని స్వతంత్రనగరముగా మార్చిరి — అనగా ఇది జర్మనీకిని చెందదు, పోలెండుకును చెందదు. ఇది నానాజాతి సమితి క్రిందనుండు స్వతంత్ర రాజ్యము.

పోలెండుకు ఉత్తరమున లిథూయానియా, లాట్వియా, ఎస్టోనియా, ఫిన్‌లాండు అను బాల్టిక్ రాజ్యము లున్నవి. ఇవి జారుల సామ్రాజ్యము తరువాత వచ్చిన రాజ్యములు. ఇవి చిన్నరాజ్యములు. కాని ప్రతి రాజ్యమునకు ప్రత్యేక సంస్కృతి ప్రత్యేక భాష ఉన్నవి. యూరోపులో పలువురివలె లిథుయానియనులును ఆర్యులే అను సంగతి విన్నావా?

వారిభాష సంస్కృతముతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. ఇది ఆశ్చర్యకరమైన విషయము. ఇండియాలో వలువురి కీవిషయము తెలియదు. దూరదేశములందున్న వారి కుండు బాంధవ్యములను, దీనిని బట్టి మనముగ్రహింతుము.

యూరోపులో జరిగిన పెద్దమార్పులలో ఇకనొకటి యున్నది. అధి ఆల్సేస్, లొరైనులను రాష్ట్రములను ఫ్రాంసు వశముచేయుట. ఇంకను కొన్ని మార్పులున్నవి. కాని అవి చెప్పి విన్న విసిగించను. ఈ మార్పులవల్ల అనేక చిన్నరాజ్యము లేర్పడిన వన్న సంగతి గ్రహించియుందువు. ఇందు పెక్కురాజ్యములు బహు చిన్నవి. తూర్పుయూరోపిప్పుడు బాల్కనులను పోలియున్నది. కావుననే శాంతి సంధులవల్ల 'బాల్కనైజ్డు' యూరోపు తయారైనదని తరచు చెప్పుచుందురు. ఇప్పుడు రాజ్యముల సరిహద్దులు అనేకము తయారయ్యెను. కాన ఈ చిన్నరాజ్యములలో తరుచు తగవులు తలయెత్తు చుండెను. వారొకరి నొకరు — అందు ముఖ్యముగా డాన్యూబు లోయలో — ఎంతగా ద్వేషించుకొనుచున్నారో చూచిన ఆశ్చర్యము కలుగును. యూరోపునంతను తప్పుడు పద్ధతిని భాగించి, క్రొత్త సమస్యలను లేవదీసిన మిత్రమండలి వారే చాలవర కిందులకు బాధ్యతవహింప వలసియుండును. ఒకజాతికి చెందిన అల్పసంఖ్యాకు లనేకులు విదేశ ప్రభుత్వముల పాలనక్రిందనుండి వారిచే పీడింపబడుచుండిరి. పోలెండుకు పెద్దభూభాగ ముండెను. నిజమున కది యుక్రైనుకు చెందిన భాగము. ఇందున్న యుక్రైనులు, పాపము! — వారిని బలవంతముగా పోలిష్ వారినిగా చేయవలెనని పాలకులు ప్రయత్నించుటచే అనేక విధములగు హింసలకు పాల్పడిరి. యుగోస్లావియా, రుమేనియా, ఇటలీ దేశములలో ఈ విధముగానే 'విదేశ అల్ప సంఖ్యాకు' లుండిరి. వారును పీడింపబడుచుండిరి. ఆస్ట్రియా, హంగరీలు మూలభేదమునకు లోనగుటచే వారి ప్రజలు వారికి దూరమైరి. పరిపాలనకు లోనైన ఈ

ప్రాంతములలో సహజముగా జాతీయోద్యమములు, నిరంతర సంఘర్షణలు తలయెత్తుచుండును.

దేశపటమును మరల చూడుము. రష్యాకును, పశ్చిమయూరోపుకును మధ్య రాజ్యములనేకము వరుసగా నున్నవి. వానిని వేరుపరచుచున్నవి - అవి ఫిన్ లాండు, ఎస్టోనియా, లాట్వియా, లిథుయానియా, పోలెండు, రుమేనియా దేశములు. ఈ రాజ్యములు పెక్కులు వార్సై సంధివలన నేర్పడినవి కావని చెప్పియుంటిని. సోవియట్ విప్లవము వలన నేర్పడినవి. అయినను మిత్రమండలి వారి కవి అనుకూలముగా నుండెను. కారణము రష్యాకును, బోల్షివిక్కులు కాని యూరోపు దేశములకును మధ్య, వానిని వేరుపరచుచు, అవి నిలిచియుండుట. అవి 'ఆరోగ్య రేఖ'గా నుండెను. (అంటు వ్యాధులున్నచోటుకును, లేని చోటుకును మధ్యగానుండు ప్రదేశము 'ఆరోగ్యరేఖ.' వ్యాధులురాకుండ కాపాడును.) బోల్షివిక్ అంటువ్యాధి సోకకుండ సహాయము చేయుచుండెను. ఈ బాల్టిక్ రాజ్యములన్నియు బోల్షివిక్కులు కానివి. లేనిచో నవి సోవియట్ రాజ్యములో చేరెడివే.

పడమటి ఆసియాలో ప్రాతటర్కీష్ సామ్రాజ్యముయొక్క భాగములు పాశ్చాత్యరాజ్యముల నోరూరజేసెను. యుద్ధకాలమున బ్రిటిష్‌వారు టర్కీపై అరబుల తిరుగుబాటును ప్రోత్సహించిరి. అరేబియా, పాలస్టీను, సిరియాల సహా ఒక సంయుక్త అరబ్‌రాజ్యమును సృష్టింతు మని వాగ్దానము చేసిరి. అరబుల కీవిధముగా వాగ్దానము చేయుచునే బ్రిటిషువారు ఈ దేశములనే పంపకము చేసికొనుటకు ఫ్రాంసుతో రహస్యసంధి చేసికొనుచుండిరి. ఇది ప్రతిష్ఠతో కూడిన పనికాదు. ఒక బ్రిటిష్ ప్రధాని, రామ్సే మాగ్డనాల్డు, దానిని "మొరటు మోసపు గాథ" అన్నాడు. అయితే అది పదిఏళ్ళ క్రితము మాట. అప్పు డతడు మంత్రికాడు కాబట్టే నిజము చెప్పవచ్చును.

బ్రిటిష్‌ప్రభుత్వము అరబులకు చేసిన వాగ్దానమును భగ్నముచేయ

వలెననియు, ఫ్రాంసుతో చేసికొన్న రహస్యసంధి భగ్నముచేయవలె ననియు ఊహించిరి. వారు వింత ఆలోచనలు చేయజొచ్చిరి. ఇండియా నుండి ఈజిప్టువరకు గల పెద్దభూభాగము, తమ ఇండియన్ సామ్రాజ్యమును తమ విశాల ఆఫ్రికన్ భూభాగములతో కలుపును. ఇదంతయు తమ మధ్యప్రాచ్య సామ్రాజ్యముగా నుండగలదని కలలు కనిరి. నోరూర జేయు పెద్ద స్వప్నమిది. కాని అప్పటికది సాధించరానిదని తోచ లేదు. అప్పుడు, 1919 లో, బ్రిటిష్ సైన్యము ఈ విశాలప్రదేశము నంతయు తమ వశమందుంచు కొనెను—పర్షియా, ఇరాక్, పాలస్తీన్, అరేబియాలో కొన్ని భాగములు, ఈజిప్టు. సిరియాకు ఫ్రెంచివారు రాకుండ వారు ప్రయత్నించుచుండిరి. కాంస్టాంటినోపుల్ నగరము కూడ బ్రిటిష్‌వారి యధీనమందుండెను. 1920, 1921, 1922 సంవత్సరములలో జరిగిన సంభవముల పురస్కరించుకొని ఈ స్వప్నము అంతరించెను. వెనుక పోవియట్లు, ముందు కమాల్‌పాషా - బ్రిటిష్ మంత్రుల ఈ దురాశలను తుదముట్టించెను.

అయినను ఇంకను పశ్చిమ ఆసియాలో బ్రిటిష్‌వారికి గొప్ప భూభాగము లుండెను — ఇరాక్, పాలస్తీను, అరేబియాలోని వ్యవహారములను, లంచములిచ్చియు, ఇతర విధములుగాను మార్చుటకు ప్రయత్నించిరి. సిరియా ఫ్రెంచివారికి దక్కెను. అరబ్ దేశముల నూతన జాతీయోద్యమమును గూర్చియు, వారి స్వాతంత్ర్యసమరమును గూర్చియు ఇంకొకసారి నీకు చెప్పెదను.

మరల మనము వార్సై సంధికడకు పోదము. యుద్ధమును లేవదీసిన అపరాధము జర్మనీదే నని ఈ సంధి నిరూపించినది. సంధి పత్రముపై సంతకము పెట్టించి, జర్మనీ అపరాధియని వారిచేతనే బలవంతముగా ఒప్పించిరి. ఇట్టి బలవంతపు ఒప్పుదలలవలన ప్రయోజనములేదు. వానిచే వైషమ్యములు కలుగును. ఇప్పు డట్లే కలిగినవి.

ఆయుధ పరిత్యాగముకూడ చేయ జర్మని కోరబడెను. పోలీసు పనులకు మాత్రము చిన్నసైన్యమును వారుంచుకొనవచ్చును. మిత్ర మండలివారికి తన నౌకాదళమును జర్మనీ సమర్పించుకోవలెను. ఈ నౌకాదళమును వశముచేసికొనుటకు బ్రిటిష్‌వారు సిద్ధముగానుండు సమయమున, నౌకాదళమందలి యుద్యోగులును, ఇతరులును, తమ బాధ్యతపై బ్రిటిష్‌వారి కిచ్చుటకంటె యుద్ధనావలను ముంచివేయుటే ఉత్తమ మని నిర్ణయించిరి. కాన 1919 జూన్‌లో స్కాపాఫ్లో వద్ద వశముచేసికొనుటకు సిద్ధపడివచ్చిన బ్రిటిష్‌వారు చూచుచుండగనే జర్మన్ నౌకాదళమంతయు, అందలి కళాసులచేతనే, భగ్నముగావింప బడి, ముంచబడెను.

ఇంతేకాదు, జర్మనీ నష్టపూర్తి చెల్లించవలసి యుండెను. యుద్ధమందు మిత్రమండలివారికి కలిగిన నష్టములకు జర్మనీ దండుగ ఇచ్చుకోవలెను. దీనికి రిపరేషన్సు (నష్టపరిహారములు) అని పేరు. అనేక సంవత్సములకాల మీ పదము యూరోపును భూతమువలె నావ హించెను. సంధిపత్రములో నష్టపరిహారముల క్రింద ఇంతమొత్త మీయవలసియుండునని నిరూపించలేదు. కాని ముందుముందు ఈ మొత్తమును నిర్ణయించున ట్లుదహరింపబడినది. మిత్రమండలివారి నష్టములను జర్మనీ నష్టపరిపూర్తిచేయుట బ్రహ్మాండమగు పని. అప్పుడు జర్మనీ పరాజితమైయుండెను. శిథిలమై యుండెను. తన దేశమందలి బ్రహ్మాండమైన సమస్యలను పరిష్కరించుకోవలసి యుండెను. ప్రజలు కాలక్షేపము చేయవలసియుండెను. దీనికి తోడు మిత్రమండలివారి భారమునుకూడ భరించుట దానికి శక్తికి మించిన పని. నిర్వహింపరానిది. కాని, మిత్రమండలి ద్వేషపూరితులై యుండిరి. అక్కసుతో నుండిరి. పూచికపుల్లకూడ వదల కుండ జర్మనీనుండి సమస్తమును వసూలుచేయవలెనని యుండిరి. ఇంగ్లాండులో లాయడ్‌జార్జి "కైజరు నురిదీయుడు" అను నినాదము

చేయుచు ఎన్నికలలో గెలిచెను. ఫ్రాంసులో ఇంతకన్న విద్వేషము పెచ్చుపెరిగియుండెను.

ఈ సంధి నిబంధనలయొక్క ప్రయోజనము, జర్మనీని అన్ని విధముల బంధించుట, నాశముచేయుట, మరల ప్రబలము కాకుండ ఆటంకపరచుట. తరతరాలు జర్మనీ మిత్రమండలికి ఆర్థికముగా బానిసయై, సాలుసాలుకు పెద్దపెద్దమొత్తముల కప్పము చెల్లించుచుండవలెను. ఈ విధముగా ఒక గొప్పజాతిని చిరకాలము బంధించుట దుష్కరమను చరిత్రపాఠము, వార్సైవద్ద ఇట్టి కసితీర్చుకొను సంధికి పునాదులు వేసిన రాజ్యతంత్రజ్ఞ శిఖామణులకు తట్టలేదు. ఇప్పుడు వారు పశ్చాత్తాపపడుచున్నారు.

తుదివిషయము — అధ్యక్షుడు విల్సనుగారి బిడ్డను గూర్చి చెప్పవలెను. అది నానాజాతి సమితి. వార్సైసంధి దీనిని ప్రపంచమునకు ప్రసాదించినది. స్వతంత్రపరిపాలనము చేసికొనుచున్న స్వతంత్రరాజ్యముల సమితి ఇది. దాని ఉద్దేశము — "న్యాయగౌరవములను ఆధారముచేసికొని, అన్యోన్యసంబంధములను ఏర్పరచి, భావియుద్ధములు రాకుండ చేయుటయును, ప్రపంచమందలి జాతులలో ద్రవ్యసహకారము, బుద్ధిసహకారము పెంపొందించుటయును." శ్లాఘనీయమగు ఉద్దేశమే! నానాజాతి సమితిలో సభ్యత్వముగల ప్రతిరాజ్యమును సాటి రాజ్యముతో ఎన్నటికిని యుద్ధమునకు పోరాదని ఒప్పుకొనెను. శాంతి పరిష్కారమునకు వెదుకవలసిన మార్గములన్నియు శోధించిన పిమ్మట, లాభములేకున్నతప్ప, అదియైనను.9 మాసముల తరువాతనే, యుద్ధమునకు పోవలెను. ఈ శపథమును ఏ సభ్యరాజ్యమైనను భగ్నముచేసినచో మిగత రాజ్యములు దీనితో నెట్టి ఆర్థిక సంబంధములు నటుమీద పెట్టుకొనకుండుటకు ఒప్పుకొనిరి. కాగితముమీద ఈ శపథములన్నియు చక్కగానే కనిపించును. క్రియకు దిగినప్పుడు వేరువిధముగా నవి

నానాజాతి సమితి పూనుకొనలేదు సరిగదా అది ఆటంకములుకూడ కల్పించుచుండెను. యుద్ధకారణముల తొలగించుటకైనను అది ప్రయత్నించలేదు.

నానాజాతి సమితిలో ఒక అసెంబ్లీయుండును. దానిలో సభ్య రాజ్యము లన్నింటికి ప్రాతినిధ్యముండును. అందొక కౌన్సిలు ఉండును. దానిలో మహారాజ్యముల శాశ్వతప్రతినిధు లుందురు. అసెంబ్లీ మరి కొందరు ప్రతినిధుల నెన్నుకొనును. ఒక కార్యదర్శుల కచేరికూడ ఉండును. అది పనిచేయుచోటు జినీవా అని నీకు తెలుసును. ఇవి గాక కొన్ని డిపార్టుమెంటు లింకను కలవు. అంతర్జాతీయలేబరు ఆఫీసు - లేబరు విషయముల నిది చూచుచుండును. అంతర్జాతీయ శాశ్వత న్యాయసభ - ఇది హేగ్‌లో నుండును. అంతర్జాతీయ సహకారమున కొక కమిటీ. ప్రారంభమందే ఇవి యన్నియు లీగులో (సమితిలో) లేవు. తరువాత ఇందు కొన్ని చేరినవి.

వార్సైసంధిలో లీగుయొక్క మూల నిబంధన లుండెను. వీనికి "నానాజాతి సమితి కవెనెంటు (ఒడంబడిక)" అని పేరు. అన్ని రాజ్యములను క్షాతిక్షేమమునకు కనీస మెంత ఆయుధబలముండవలెనో అంతవరకు తమబలములను తగ్గించుకోవలెననియు, ఈ కవెనెంటులో కలదు. ఆయుధవిసర్జనము జర్మనులు చేసితీరవలసినదే. ఆ ప్రకారము గానే ఇతర రాజ్యములును ఆయుధములను తగ్గించుకోవలెను. ఏ రాజ్యమైనను ఎత్తివచ్చినచో (Aggression), కలహమునకు దిగినచో దానిపై తగిన చర్యలు తీసుకోవలసియుండుననియు ఇందుకలదు. కాని 'ఎత్తివచ్చుట' అనగా ఎట్టిదో నిర్వచింపబడలేదు. ఇద్దరుమనుష్యులు కాని, రెండుజాతులుగాని పోరాడునప్పుడు ఒకడు రెండవవాని పై కలహమునకు కారణమని తప్పుపట్టును; ఒక జాతి రెండవజాతిని తప్పుపట్టును.

ప్రధాన విషయములను ఏకగ్రీవముగా సమితి నిర్ణయించవలసి

యుండెను. అనగా ఒక్కసభ్యరాజ్యమైనను ఒక తీర్మానమునకు ప్రతికూలముగా వోటుచేసినచో అది రద్దగును. బహు సంఖ్యాకుల వోటు వలన నిర్బంధ మేర్పడరాదని దీనిభావము. జాతీయ ప్రభుత్వములు వెనుకటివలెనే స్వేచ్ఛగానూ, బాధ్యతారహితముగాను ప్రవర్తించ వచ్చుననియు దీనిభావము. లీగు, రాజ్యములపై అధికారము చెలాయించు ఒక విధమగు అతీతరాజ్యము కాలేదు. ఈ నిబంధన లీగు నెంతో దుర్బలముచేసెను. దానిని సలహాసంఘముగా క్రియకు మార్చెను.

ఏ స్వతంత్రరాజ్యమైనను లీగులో చేరవచ్చును. నాలుగు దేశములు మాత్రము బహిష్కరింపబడినవి. అవి పరాజితమైన జర్మనీ, అస్ట్రియా, టర్కీలును, బోల్షివిక్ రాజ్యమైన రష్యాయును. తరువాత కొన్ని షరతులకులోనై అవి సభ్యులుగా చేరవచ్చుననియు నిబంధనకలదు. వింత విషయము — స్వతంత్రపరిపాలనముచేసికొను రాజ్యములే సభ్యులుకావలెనను నిబంధనకు వ్యతిరేకముగా ఇండియా ప్రధమముననే లీగులో సభ్యత్వమును పొందెను. ఇండియా అనగా ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వమని అందరికిని తెలిసినవిషయమే. తెలివిగా ఈ తంత్రము పన్ని, బ్రిటిష్ ప్రభుత్వము అదనముగా ఒక ప్రతినిధిని తనపక్షమునకు సంపాదించుకొనెను. ఇది ఇట్లుండ లీగుకు కారణభూతమైన అమెరికా లీగులోచేరుటకు నిరాకరించెను. అధ్యక్షుడు విల్సన్ చేయుచున్నపనులకును, యూరోపియన్ కుట్రలకును, చిక్కులకును అమెరికను లిష్టపడలేదు. కాన వారు దూరముగానుండ నిశ్చయించిరి.

అనేకులు లీగును ఉత్సాహముతో చూచిరి. నేటి ప్రపంచ కలతల నది అంతమొందించును, లేదా తగ్గించు ననియు, శాంతిగ్యముభాలతో తులతూగు కాలమును ప్రవేశపెట్టుననియు వా రాశించియుండిరి. లీగును జనసమ్మతము చేయుటకును, అంతర్జాతీయ దృష్టితో వ్యవహార

ములనుచూచు అలవాటు వ్యాపింపజేయుటకును, అనేక దేశములలో నానాజాతిసమితి సంఘములు నెలకొల్పబడినవి. ఇది యిట్లుండ గొప్ప రాజ్యముల ఉద్దేశములు నెరవేర్చుటకు సమితి ఏర్పడినదనియు, అది వట్టిమోసమనియు అనేకులు భావించిరి. ఇప్పుడు దానినిగూర్చి కొంత అనుభవము మనకు కలిగినది. దాని ప్రయోజనమును మన మిప్పుడు సులభముగా నిర్ణయించవచ్చును. 1920 సంవత్సరాదిని లీగు తన పనిని ప్రారంభించెను. అది జీవించిన దింతవరకు కొద్దికాలమే కాని అది విశ్వాసపాత్రము కాదనుటకు తగినంతకాల మది జీవించినది. నేటిజీవనమునకు పనికివచ్చు విధముగా అది కొంతమంచిపని చేసిన మాట వాస్తవమే. అంతర్జాతీయసమస్యలను చర్చించుటకు జాతులను, అనగా వారి ప్రభుత్వములను, ఒక్కచోట సమావేశపరచుట గొప్ప విషయమే. దాని నిజలక్ష్యమును — అనగా శాంతిని నిలుపుట, యుద్ధావకాశముల తగ్గించుట — అది ఎంతమాత్రము సాధించలేక పోయెను.

లీగునుగూర్చి విల్సన్ అధ్యక్షుని తొలి ఉద్దేశ మేమైనప్పటికి పెద్దరాజ్యములవారి - ముఖ్యముగా ఇంగ్లాండు ఫ్రాంసుల - చేతులలో అవి ఒక సాధన మైనదనుటకు సందేహములేదు. ఉన్నదున్నట్లు నిలుపుటయే దాని ప్రధానకార్యము. జాతులమధ్య న్యాయమనియు, గౌరవమనియు అది చెప్పుచుండును. కాని నేడు జాతులమధ్యనున్న సంబంధములు, న్యాయగౌరవములపై నాధారపడియున్నదో లేదో అది విచారించదు. జాతులగృహకృత్యములలో కలుగజేసికోనని అది గొంతెత్తి చెప్పును. సామ్రాజ్య రాజ్యముల వశమందున్న పరాధీన రాజ్యములు వారి గృహకృత్యములక్రింద లెక్క. క్రియకు లీగుదృష్టిలో ఈ రాజ్యములు తమసామ్రాజ్యములను కలకాలము తమ అధికారములో నుంచుకొనవలెననియే. దీనికి సాయము, జర్మనీ టర్కీలనుండి తీసికొనబడిన క్రొత్తభూభాగములు 'మేండేటులు' అను పేరుతో మిత్ర

మండలి రాజ్యములకు దత్తముచేయబడినవి. నానాజాతి సమితికి తగినదే 'మేండేటులు' అను ఈ మాట. దీని అభిప్రాయము-చక్కని పేరు పెట్టి, పూర్వమువలెనే, స్వప్రయోజనార్థము సామ్రాజ్యరాజ్యములు ఈ ప్రదేశములను వాడుకొనవచ్చునని. 'మేండేటెడ్' దేశమండలి ప్రజల ఇష్టము ననుసరించియే ఈ మేండేటులు దత్తముచేయబడినట్లు లెక్క. దురదృష్టవంతులగు అందలి ప్రజలు పెక్కుచు తిరుగుబాటు చేసిరికూడ. దీర్ఘకాలము రక్తపాతముతో యుద్ధము చేసిరికూడ. చివరకు వారిపై బాంబులు, తుపాకిగుండ్లు విసరి అణచివేసిరి. ప్రజల ఆమోదమును తెలిసికొనుటకు అవలంబించిన పద్ధతు లిట్లుండెను:

చక్కనిమాటలు, సమాసములు వాడబడినవి. మాండెటెడ్ దేశములందలి ప్రజలశ్రేయస్సుకు సామ్రాజ్యరాజ్యములు ధర్మకర్తలు. ధర్మకర్తృత్వనిబంధనలు సరిగా అమలులో పెట్టునట్లు చూచునది నానాజాతిసమితి. యదార్థమునకు ఇందువల్ల పరిస్థితులు మరింత దుస్థితిలో పడెను. రాజ్యములు వారి కిష్టమువచ్చినట్లు ప్రవర్తించినవి. కాని అవి ధర్మవేషములు ధరించి తెలియనివారిని మోసగించుచుండెను. ఏ చిన్నరాజ్యమైనను, ఏ విధముగానైన తప్పుచేసినచో సమితి కనుబొమలు ముడిచి, తమ కోపమును ప్రకటించును. పెద్దరాజ్యము తప్పు చేసినచో సమితి అటుచూడనే చూడదు. ఒకవేళ చూచిన చేసినతప్పు ప్రమాదకరమైనది కా దని చెప్పును.

ఇట్లు పెద్దరాజ్యములు సమితిని తమవశములో నుంచుకొనెను. తమకు ప్రయోజనకరముగా నున్నప్పుడు దాని పే రెత్తుచుండెను. తమ కట్టి ప్రయోజనము లేనప్పుడు దాని నుపేక్షించుచుండెను. బహుశా తప్పు సమితిది కాదు. అసలు పద్ధతియే తప్పుదారుల పడినది. సమితి దానిని సహించి ఊరుకొనక తప్పనిస్థితిలో నుండెను. వివిధ రాజ్యముల మధ్య జరుగు స్పర్ధలు, పోటీలు, ప్రతియొక్కరాజ్యమును సాధ్యమైనంతమట్టుకు ప్రపంచమును స్వప్రయోజనారమై [illegible]

కొనుట - ఇది సామ్రాజ్యతత్వసారము. ఒక సంఘములోని ప్రజలు ఒకరి జేబులలోని డబ్బును ఇంకొకరు తస్కరించుటకు నిరంతరము ప్రయత్నముచేయుచున్నచో, ఒకరి పీక నరుకుట కింకొకరు కత్తులు నూరుచున్నచో వారి మధ్య సహకార మెట్లు సాధ్యమగును? అట్టి సంఘ మెట్లభివృద్ధి జెందును? కాబట్టి, ఇందరు పూచీదారులున్నను, ఇంపరు దీని బాధ్యత వహించినను సమితి కృశించెను.

వార్సైలో సంధినిగూర్చిన చర్చలు జరుగుచున్నకాలమున, జపాను ప్రభుత్వము తరపున, జాతులన్నియు సమాన మను సూత్ర మామోదించుటకై ఒక నిబంధన సంధిపత్రములో ప్రవేశపెట్టుట సమంజసమని చెప్పబడినది. కాని దాని నెవరును అంగీకరించలేదు. చీనా లోని కియౌచౌ జపానుకు కానుక ఇచ్చి దానికళ్లు తుడిచిరి. చీనా పంటి పీద నీరస మిత్రము పేర ఖర్చువ్రాసి బృహత్త్రయమువారు ఉదారు లనిపించుకొనిరి. ఇది కారణముగా చీనా సంధిపత్రముపై సంతకము పెట్టలేదు.

"యుద్ధమునంత మొందించుటకైన యుద్ధమును" అంత మొందించిన వార్సైసంధి అట్టిది. ఫిలిప్ స్నోడన్ (ఇతడే తరువాత వైకౌంటు స్నోడన్ అయ్యెను), ఇంగ్లాడుమంత్రివర్గములో నొక్కడు, సంధినిగూర్చి క్రింది విధముగా వ్యాఖ్యానించెను:

> "బందిపోటుదొంగలను, సామ్రాజ్యవాదులను, సైన్యభావములు కలవారిని (Militarists) ఈ సంధి తృప్తిపరచగలదు. యుద్ధమంతరించి శాంతిప్రవేశించునని ఆశించినవారి ఆశలన్నియు గంగపాలైనవి. ఇది శాంతిసంధి కాదు; మరియొక యుద్ధప్రకటనము. ప్రజాస్వామికమున కిది ద్రోహము చేసినది. యుద్ధములో మరణించిన వారిపట్ల నిది ద్రోహము చేసినది. మిత్రమండలివారి నిజమగు ఉద్దేశముల నీ సంధి వెల్లడి చేసినది."

యదార్థమునకు మిత్రమండలివారు, ద్వేషము, గర్వము, దురాశ ప్రేరేప వ్యవహారమును మించబెట్టిరి. వారి దుశ్చేష్టల ఫలము వారిని చుట్టబెట్టినప్పుడు, కొన్ని సంవత్సరముల తరువాత వారు పశ్చాత్తాపము చెంద ప్రారంభించిరి. కాని తరుణము మించిపోయెను.

—

# 156

# యుద్ధానంతర ప్రపంచము

ఏప్రిల్ 26, 1933

ఎట్టకేలకు తిరిగి తిరిగి మనము చివరిఘట్టమునకు వచ్చితిమి. మహాయుద్ధానంతరము ప్రపంచపరిస్థితు లెట్లుండెనో మనము విచారించవలసియున్నది. ఇప్పుడు మనము మనకాలములో నున్నాము - నిజమునకు ఇది మీ కాలము ! ఇది చివరిఘట్టము. కాలమానమును బట్టి చూచిన కొద్దికాలమే. కాని కష్టకాలము. యుద్ధ మంతమొంది $14\frac{1}{2}$ సంవత్సరములు మాత్రమే గడచెను. మనము ముచ్చటించు కొన్న దీర్ఘచరిత్రకాలములతో ఈ కాలము లేశాంశమే. అయితే మనము మధ్యనున్నాము. ఇంతదగ్గరలో నుండి ఇందలి పరిస్థితులను యదార్థముగా గ్రహించుట కష్టమే. వానిని సరిగా మనము చూడలేము. చారిత్రక విషయములు అసంగబుద్ధితో చూడవలెను గనుక అట్టి అసంగత్వము మనకుండదు. అనేక సంభవములనుగూర్చి మన ముద్రిక్తుల మగుదుము. చిన్న విషయములు పెద్దవని మనకు తోచవచ్చును. నిజముగా పెద్దవిషయములు మనము సరిగా గ్రహించకపోవచ్చును.

అముఖ్యవిషయములలో చిక్కుకొని ముఖ్యవిషయములను మన ముపేక్షించవచ్చును.

జరిగిన విషయములు ముఖ్యమో, అముఖ్యమో తెలిసికొనుట కష్టము. ఏ కొలతబద్ద మన మిందుకు వాడవలెను ? మన దృక్పథముపై సమస్తమును ఆధారపడియుండును. ఒక దృష్టితో చూచిన ఒక విషయము ముఖ్యముగా కనిపించవచ్చును. వేరొక దృష్టితో చూచిన నది అముఖ్యమగును. నీకు వ్రాసిన జాబులలో ఈ విషయము నేనంతగా ఎత్తుకోలేదు. దీనికి సమాధానము నిష్కర్షగా తేల్చలేదు. కాని నేను వ్రాసిన ప్రతివిషయమందును నా సామాన్యదృక్పథమే అలముకొన్నది. ఈ కాలములను, ఈ విషయములను గురించి వేరొకరు వ్రాసిన నది నేను వ్రాసినదానికి భిన్నముగ నుండును.

చరిత్రవిషయములనుగూర్చి మన దృక్పథ మెట్లుండవలెనో నే నెత్తుకొనుటలేదు. ఈ మధ్యకాలములో దీనినిగూర్చి నా దృక్పథము ఎక్కువగా మారినది. ఈ విషయమునుగూర్చియు, ఇతర విషయములను గూర్చియు నా అభిప్రాయములను నేను మార్చుకొన్నట్లే ఇతరులు పలువురును మార్చుకొనిరి. కారణమేమన నీ యుద్ధము ప్రతివిషయమును తారుమారుచేసెను. ప్రతివ్యక్తిని కలచివేసెను. ప్రాతప్రపంచము నది పూర్తిగా తలక్రిందులు చేసెను. నాటినుండియు మనప్రాత ప్రపంచము తిరిగి నిలబడుటకు ప్రయత్నించుచుండెను. గాని లాభము లేకుండెను. మనము అలవాటుపడిన భావసముదాయము నంతయు నది తారుమారుచేసెను. నేటిసంఘము, నేటి నాగరికత దేనిపై ఆధారపడి యుండెనని భావించితిమో అట్టి ఆధారములనే మనము సందేహించు చున్నాము. యువకుల జీవితములు తృణప్రాయముగా వ్యర్థమగుట చూచితిమి. అబద్ధములు, హింస, క్రౌర్యము, వినాశము చూచితిమి. నాగరికత కిది తుదిగడియయా ? అని తర్కించితిమి. రష్యాలో సోవి యట్ తలయెత్తెను. ఇది వినూతన విషయము. వినూతనసంఘ

రచన. ప్రాతపద్ధతి కిది సవాలు. ఇతర భావములును ప్రచారములో నుండెను. ఇది విచ్ఛిత్తి కాలము. ప్రాతనమ్మకములు, ప్రాచీన భావములు సమసిపోవుచున్న కాలము. సంశయము, తర్కము తల యెత్తిన కాలము. మార్పులు శీఘ్రముగా జరుగుచున్న కాలమున, సంధి కాలమున, ఇవి తప్పనిసరిగా వచ్చును.

దీనినిబట్టి యుద్ధానంతరకాలమును చరిత్రగా భావించుటను గురించి మనకు కొంత కష్టము కనుపట్టును. వేర్వేరు నమ్మకములను, భావములను మనము చర్చించనూ వచ్చును, తర్కించనూ వచ్చును. అవి ప్రాతకాలపువి. కాబట్టి వానిని అంగీకరించక పోనూ వచ్చును. కాని దీనిని సాకుగా పెట్టుకొని మన ముదాసీనభావముతో నుండరాదు. తీవ్రముగా ఆలోచించవలసియుండును. కర్తవ్యమును తెలిసికొనవలసి యుండును. ప్రపంచచరిత్రలో ఇట్టి కాలపరివర్తనభాగములందు మన మనస్సులు, శరీరములు చురుకుగా పనిజేయవలసియుండును. ఈ కాలభాగములందే జీవిత దిన చర్య ఉత్సాహవంతమగును. సాహస కృత్యముచేయ నది పురిగొల్పును. నూతన సంఘనిర్మాణమున మనము పాల్గొనవచ్చును. అట్టి కాలములందే యువకులు ప్రధానపాత్ర వహించి పనిచేయుదురు. మారుచున్న భావములకును, పరిస్థితులకును అనుగుణముగా వారు మారగలరు. వయస్సువచ్చినవారును, ప్రాత నమ్మకములలో చిక్కుకొన్న వారును ఇంతసులభముగా మారలేరు.

యుద్ధానంతరకాలమును, కొంత విస్తరముగా విచారించుట ఉచితమని తోచుచున్నది. కాని ఈ జాబులో దానిని సింహావలోకనము చేయుదును. నెపోలియన్ పతనానంతరము 19 వ శతాబ్దిని మనము సింహావలోకనము చేసితిమి. 1815 లో జరిగిన వియన్నాసంధి మనకు తప్పనిసరిగా జ్ఞాపకము వచ్చును. దాని ఫలితములు జ్ఞాపకము నకు వచ్చును. 1919 లో జరిగిన వార్సై సంధితోను, దాని ఫలితములతోను ఆ సంధిని పోల్చ బుద్ధిపుట్టును. వియన్నాసంధి సుఖ

దాయకము కాదు; యూరోపులో భావియుద్ధముల కది బీజప్రాయమై యుండెను. అనుభవమువల్ల తెలివినొందక మన రాజ్యకార్యధురంధరులు వార్సైసంధిని మరింత పాడుచేసిరని వెనుకటిజాబులో చూచితిమి కదా. యుద్ధానంతర సంవత్సరములను ఈ నాటకపుసంధి కలుషము చేసెను.

కడచిన 14 సంవత్సరములలోను జరిగిన ప్రధానవిషయము లేమి? అన్నింటికన్న ముఖ్యమైనది, గమనించదగినది అగు విశేషము సోవియట్ యూనియన్ (యు. యస్. యస్. ఆర్. అనగా యూనియన్ ఆఫ్ సోషలిస్టు అండ్ సోవియట్ రిపబ్లికులు) వృద్ధిపడి చాలు నిలువద్రొక్కుకొనుట. సోవియట్ రష్యా ప్రాణముల నిలుపుకొనుటకు పోరాడుచు ఎన్నెన్నికష్టముల పాలైనదో ఇదివరలో చెప్పియుంటిని. అన్నికష్టములను దాటి విజయము సాధించుట ఈ శతాబ్దిలో జరిగిన ఆశ్చర్యకరమగు విషయములలో నొక్కటి. వెనుకటి జారుల సామ్రాజ్యములోని ఆసియాభాగములకును, పసిఫిక్‌వరకు నున్న సైబీరియాకును, ఇండియాసరిహద్దువరకు మధ్య ఆసియాకును ఈ సోవియట్ పద్ధతి వ్యాపించెను. ప్రత్యేకముగా సోవియట్ రిపబ్లికులు స్థాపింపబడెను. ఇవి అన్నియును కలసి యూనియన్ అయినవి. ఇదియే యు. యస్. యస్. ఆర్. యూరోపు ఆసియాలలోని పెద్ద భూభాగ మందు చేరియున్నది. ప్రపంచముయొక్క భూ విస్తీర్ణములో నిది సుమారు ⅙ భాగమున్నది. ఈ ప్రదేశమంతయు చాలాపెద్దది. పెద్దదగుటవల్ల విశేష మేమియులేదు. రష్యాయును అంతకన్న ఎక్కువగా సైబీరియా, మధ్య ఆసియాలును మిక్కిలి వెనుకబడి యుండెను. సోవియట్లు సాధించిన రెండవ ఆశ్చర్యకరమగు కార్యము — బ్రహ్మాండమగు ప్రణాళికలద్వారా ఈ భూభాగములోని పెద్దపెద్దభాగములను పోల్చుటకు వీలులేకుండ మార్చివేసెను. చరిత్రలో ఇంత శీఘ్రముగా ప్రజలు అభివృద్ధిచెందిన విదర్శనము వేరొకటి

కానరాదు. మధ్య ఆసియాలో మిక్కిలి వెనుకబడియున్న భాగములు సైతము ఎంతో అభివృద్ధిని గాంచినవి. ఇండియాలో మనము దీనిని చూచి నేర్చుకొనవలెను. విద్యలోను అవి ముఖ్యముగా, ప్రస్ఫుటముగా, అభివృద్ధి చూపినవి. బ్రహ్మాండమగు పంచవర్ష ప్రణాళికల నేర్పాటుచేసి రష్యా అధికముగా పారిశ్రామికము చేయబడినది. బ్రహ్మాండమగు ఫాక్టరీలు నెలకొల్పబడినవి. ఇదంతయు ప్రజలకు పెద్దశ్రమ. వారు భోగములులేకుండ, జీవితావసరవస్తువులు సైతము లేకుండ నుండిరి. వారి గడనలో పెద్దభాగము తొలిసామ్యవాదదేశమును నిర్మించుటకు వినియోగపడెను. ఈ భారము ప్రధానముగా రైతులపై బడెను.

ముందంజవేయుచు అభివృద్ధినందుచున్న సోవియట్ దేశమునకును, కలతల పాలగుచున్న పశ్చిమయూరోపునకును భేదముగా కనిపించుచుండెను. ఎన్నో కష్టముల పాలగుచున్నను పశ్చిమ యూరోపు రష్యా కన్న భాగ్యవంతముగా నుండెను. చిరకాల మైశ్వర్య మనుభవించియుండుటచే అది ధనము కూడబెట్టెను. దానితో అది కొంతకాలము బ్రదుకకలదు. కాని ప్రతిదేశమునకును ఉన్న ఋణభారము వల్లను, వార్సైసంధి ప్రకారము జర్మనీ చెల్లించవలసిన నష్టపరిహారముల సమస్యవల్లను, చిన్నరాజ్యములందును పెద్దరాజ్యములందును నిరంతరము చెలరేగుచున్న స్పర్థలవల్లను, పోరాటములవల్లను యూరోపు క్లిష్టపరిస్థితులలో చిక్కుకొనెను. ఈ కష్టములనుండి గట్టెక్కు మార్గముల నాలోచించుటకు అంతులేని సమావేశములు జరిగెను. కాని మార్గము దొరకలేదు. రోజుకురోజు పరిస్థితులు విషమించుచుండెను. సోవియట్ రష్యాను ఈనాటి పశ్చిమ యూరోపుతో పోల్చుట — దీపిక ఉత్సాహముకలిగి పెద్దభారమును మోసికొనిపోవుచున్న యువకునితో, ఆశ ఉడిగి, ఓపికలేక, కొంతగర్వముతో ముందుకు తప్పనిసరిగా ప్రస్తుతావస్థ కొంపోవు స్థానమునకు పోవుచున్న వృద్ధు

నితో పోల్చుటవంటిది.

యుద్ధానంతరము అమెరికా సంయుక్తరాష్ట్రములు ఈ యూరోపియన్ అంటువ్యాధినుండి తప్పించుకొనెను. పది సంవత్సరముల పాటు అది చక్కగా వర్ధిల్లెను. యుద్ధకాలమున ప్రసిద్ధ ఋణదాతయగు ఇంగ్లాండు స్థానమునది ఆక్రమించెను. అమెరికా ఇప్పుడు ప్రపంచ ఋణదాత అయ్యెను. ప్రపంచముదానికి ఋణపడెను. ఆర్థికముగా నది ప్రపంచమునంతటిపై అధికారము పూనెను. ప్రపంచము చెల్లించు కప్పముతో ఇంగ్లాం డిదివరలో చేసినట్లే, అమెరికాయును సుఖముగా కాలక్షేపము చేసియుండవలసినదే. కాని ఇందుకు రెండు ఇబ్బందులు వచ్చెను. ఋణగ్రస్తదేశములు పేదస్థితిలో నుండుటచే, ధనరూపముగా అప్పులు చెల్లించలేకుండెను. నిజమునకవి మంచిస్థితిలోనుండుట తటస్థించినప్పటికీ ఈ పెద్దమొత్తములు ధనరూపముగా చెల్లించలేకుండెడివి. చెల్లించుటకు వారికున్న మార్గమొకటే. సరుకును తయారుచేసి అమెరికాకు పంపుట. కాని పరదేశవస్తువులు తన దేశములో దిగుటకు అమెరికా సమ్మతించ లేదు. వ్యాపారసుంకముల నధికముగా విధించుటచేత చాలవరకు తయారైనవస్తువులు అమెరికాలో దిగుటలేదు. ఋణగ్రస్తమగు పేద దేశము లిక ఎట్లు తమ అప్పును తీర్చుకోగలవు? దివ్యమగు మార్గ మొకటి కనిపెట్టబడినది. తనకు రావలసిన వడ్డీ చెల్లించుటకై మరి కొంతడబ్బు ఆ దేశములకు అమెరికా అప్పు ఈయ నిశ్చయించెను. అప్పు వసూలుచేసికొనుట కిది అసాధారణమార్గము. ఏలయన, ఋణదాత నానాటికి ఎక్కువడబ్బు ఇచ్చుచుపోవును. ఋణము పెరుగుచు పోవును. ఋణగ్రస్తదేశములు అనేకము ఎన్నడును అప్పును తీర్చు కోలేవని విశదమగుచుండెను. అప్పుడు హఠాత్తుగా అమెరికా అప్పు ఇచ్చుట మానుకొనెను. వెంటనే కాగితపుకట్టడము నేలపాలయ్యెను. వేరొక వింత విశేషముకూడ జరిగెను. అమెరికా, ఐశ్వర్యవంతమగు అమెరికా, బంగారుతో నిండిన అమెరికా, హఠాత్తుగా నిరుద్యోగ కార్మికు

లతో నిండిపోయెను. పరిశ్రమలు కట్టుపడెను. దారిద్ర్యము చుట్టుముట్టెను.

భాగ్యవంతమగు అమెరికా కిట్టి దుస్థితి సంభవించినదంటే యూరోపుస్థితి ఎట్లున్నదో ఊహించుకొనవచ్చును. అధికముగా వ్యాపారసుంకముల విధించియు, ఇతర మార్గము లవలంబించియు, స్వదేశవస్తువులను కొనుడను ప్రచారము చేసియు, ప్రతిదేశమును విదేశవస్తువుల బహిష్కరించ ప్రయత్నించెను. ప్రతిదేశమును అమ్ముటకే ప్రయత్నించెను. కొనుటకు కాదు. ఒకవేళ కొన్నను బహుకొద్దిగా కొనుటకు. ఇట్టి పరిస్థితులు, అంతర్జాతీయవర్తకమును అంతమొందించకుండ చిరకాల ముండనేరవు. వర్తకవాణిజ్యములు ఇచ్చి పుచ్చుకోవడములపై ఆధారపడియుండును. ఇట్టి వ్యవహార నీతికి ఆర్థిక జాతీయత అనిపేరు. ఇది అన్ని దేశములలోను వ్యాపించెను. ఇట్లే ఇతర విధములుగా జాతీయత కాలుదువ్వుచు వ్యాపించెను. వర్తకమును, పరిశ్రమయు కృశించగా ప్రతిదేశమును కష్టముల పాలాయెను. గొప్ప సామ్రాజ్యరాజ్యములు, ఆదాయవ్యయముల సరిపెట్టుకొనుటకు, పరాధీనరాజ్యముల నధికముగా స్వప్రయోజనార్థము పీడించిరి. స్వదేశమందలి కార్మికుల కూలి తగ్గించిరి. పోటీ పడ్డ సామ్రాజ్యములు ప్రపంచమందలి వేర్వేరుభాగములను స్వప్రయోజనార్థము వినియోగించుకొనుటకు చేసిన ప్రయత్నములవల్ల వారిలో వారికి పోరాటములు సంభవించెను. నానాజాతిసమితి ఆయుధవిసర్జనమునుగూర్చి ధర్మపన్నములు పలుకుచు, ఏమియు చేయకుండెను. అయితే యుద్ధభూతము సమీపించుచున్నట్లుండెను. మరల వివిధ రాజ్యములు, తప్పని సరిగా రానున్న పోరాటమునకై, జట్టులు కట్టజొచ్చిరి.

పశ్చిమ యూరోపులోను, అమెరికాలోను రాజ్యముచేసినట్టియు, ప్రపంచమందంతటను అధికారము చెలాయించినట్టియు ధనికవర్గనాగరి

కలకు సంబంధించిన గొప్పకాలము చివరకు వచ్చునట్లు తోచుచున్నది. యుద్ధము అంతమొందిన తర్వాత మొదటి పది సంవత్సరములకాలములో పెట్టుబడిదారీపద్ధతి మరల జీవముపోసికొని, చాలకాలము స్థిరముగా వర్ధిల్లగలదేమో యనిపించెను. కాని సుమారు మరి మూడు సంవత్సరములకాలము గడచిన తర్వాత ఇది సంశయాస్పదమయ్యెను. ధనికవర్గ రాజ్యములలో స్పర్థలు ప్రమాదకరముగా పెరుగుచుండుటయే కాదు. ప్రతిరాజ్యమందును వర్గములమధ్య పోరాటమును, ప్రభుత్వమును వశముచేసికొన్న పెట్టుబడిదారులకును, కార్మికులకును మధ్య పోరాటమును చెలరేగజొచ్చెను. ఈ పరిస్థితులు విషమించగా, పైకి వచ్చుచున్న కార్మికులను, భాగ్యవంతులు అణచివేయుటకు తెగించి తుది ప్రయత్నమును చేసిరి. ఇది ఫాసిజం స్వరూపమును దాల్చెను. వర్గములమధ్య పోరాటము తీవ్రమైనప్పుడును, భాగ్యవంతుల తమ ఆధిక్యతను గోల్పోవు ప్రమాదము సంభవించినప్పుడును ఫాసిజం తల యెత్తును.

యుద్ధము ముగిసినతోడనే ఇటలీలో ఫాసిజం ప్రారంభమయ్యెను. అక్కడ కార్మికులు కట్లు తెంచుకొని పోవుచుండిరి. అప్పుడు ముసోలిని నాయకత్వమున ఫాసిస్టులు అధికారము వశముచేసికొనిరి. నాటినుండియు వా రధికారములోనే ఉండిరి. ఫాసిజం అనగా శుద్ధ నియంతృత్వము. ప్రజాస్వామికము నది బహిరంగముగా గర్హించును. ఫాసిస్టు పద్ధతులు యూరోపులోని అనేక దేశములకు వ్యాపించెను. నియంతృత్వ మచ్చట సామాన్యముగా విజృంభించియుండును. 1918 లో ప్రకటింపబడిన నూతన రిపబ్లికును 1933 లో అంత మొందించి, 1933 మొదటి భాగములో జర్మనీలో ఫాసిజమ్ వృద్ధినందెను. కార్మికోద్యమమును నాశనముచేయుటకు అనాగరికపద్ధతులెన్నో అప్పుడు అవలంబింప బడినవి.

ఇట్లు యూరోపులో ప్రజాస్వామికమునకును, సామ్యవాదశక్తుల

కును ఫాసిజం ఎదురు నిల్చియుండెను. ధనికవర్గ రాజ్యములన్నినో ఒకరినొకరు కోపదృష్టితో చూచుకొనుచు యుద్ధమునకు సిద్ధమగు చుండిరి. ధనికవర్గపద్ధతిలో ప్రక్కనే సమృద్ధి ఒకతట్టు, లేమి ఒక తట్టు గోచరించును; ఒకతట్టు ఆహారపదార్థములు కుళ్లిపోవుట, వాటిని పారవేయుట లేదా నాశముచేయుట, ఒకతట్టు ప్రజలకు తిండి లేకపోవుట కాన్పించును.

గత కొద్ది సంవత్సరములలో యూరోపులోని ఒకప్రాచీనదేశము-స్పెయిన్ - రిపబ్లిక్‌గా మారినది. తన హాప్సుబర్గు - బోర్బన్ పాలకుని తరిమివేసినది. ఇట్లు యూరోపునుండియు, ప్రపంచము నుండియు ఒక రాజు లోపించెను.

యుద్ధము అంతమైన పదునాల్గు సంవత్సరములలో జరిగిన మూడు ప్రధానవిషయములను గురించి చెప్పియుంటిని; సోవియట్ యూనియన్ తలయెత్తుట; అమెరికా ఆర్థికముగా ప్రపంచముపై అధి కారము చెలాయించుట, దాని ప్రస్తుతసంధిగ్ధస్థితి; యూరోపులో చిక్కుస్థితి. ఈ కాలమునకు సంబంధించిన నాల్గవప్రధాన విషయము తూర్పుదేశములు పూర్తిగా మేల్కొని స్వాతంత్ర్య సంపాదనార్థము గట్టి ప్రయత్నములు చేయుట. ప్రాచ్యదేశములు ప్రపంచరాజకీయము లలో నిష్కర్షగా ప్రవేశించెను. ఈ తూర్పుదేశములను రెండు తర గతులుగా విభజింపవచ్చును; స్వతంత్రదేశములుగా భావింపబడునవి. సామ్రాజ్యముల అధీనమందున్న అధినివేశ దేశములు. ఆసియాలోను ఉత్తర ఆఫ్రికాలోను ఉన్న ఈ దేశములందంతట జాతీయత వృద్ధి నందుచుండెను. పట్టుదలతో, దూకుడుగా స్వాతంత్రేచ్ఛ పనిచేయు చుండెను. ఈ దేశములందెల్ల ప్రబలమగు ఉద్యమములు పనిచేయు చుండెను. కొన్నిచోట్ల పాశ్చాత్యసామ్రాజ్య తత్వమున కెదురుతిరిగి తిరుగుబాట్లు కూడ తలయెత్తెను. ఇం దనేకదేశములు సోవియట్ యూనియన్‌నుండి ప్రత్యక్షముగా సహాయమును పొందెను. అంతకన్న

ప్రధానమగు విషయము, సోవియట్ యూనియన్‌నుండి అవి, తమ పోరాటము సందిగ్ధావస్థలో నున్నప్పుడు నైతిక ప్రోద్బలమునుకూడ పొందెను.

పతనమై, అణగారిపోయినదని భావింపబడిన టర్కీదేశము మరల పునర్జన్మమునందుట అసాధారణ విషయము. ఇందుకు ప్రధానకారకుడు చాలవరకు ముస్తఫా కమాల్ పాషా. తనకు సర్వము వ్యతిరేకముగానున్నట్లు కనిపించినను తలయొగ్గుటకు నిరాకరించిన ధీరనాయకు డతడు. అతడు తన దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించిపెట్టెను. అంతేకాదు, దాని నతడు నేటికాలమున కను గుణముగా మార్చెను. పోల్చుకొనుటకు వీలులేనట్లుగా మార్చెను. సుల్తానుల సంప్రదాయమును, కాలీఫుల సంప్రదాయమును అతడు అంతమొందించెను. ఘోషా పద్ధతిని రూపుమాపెను. ప్రాచీనాచారముల ననేకము నంతమొందించెను. సోవియట్ల ప్రత్యక్షసహాయము, నైతికసహాయము అతనికి ప్రోద్బలముగా నుండెను. బ్రిటిష్ వారి బారినుండి తప్పించుకొనుటకు పర్షియా చేసిన ప్రయత్నములలో కూడ సోవియట్ సహాయభూతముగా నుండెను. రిజాఖాన్ అను ధీరుడు అక్కడ తలయెత్తెను. ఇప్పు డితడే పాలకుడు. సంపూర్ణ స్వాతంత్ర్యమును, ఆఫ్ఘనిస్థానముకూడ ఈ కాలమున సంపాదించెను.

అరేబియా తప్ప మిగత అరబ్ దేశములు పరదేశవశమందే ఇంకను ఉండెను. అరబులందరును ఏకముకావలెనన్న వాంఛ సఫలము కాలేదు. అరేబియాలో పెద్దభాగమును సుల్తాన్ ఇబన్ సూద్ క్రింద స్వతంత్రమయ్యెను. కాగితముమీదమాత్రము ఇరాక్ స్వతంత్రమే కాని క్రియకది బ్రిటిష్ వశమందుండెను. బ్రిటిష్ వారి పలుకుబడి అం దమితముగా నుండెను. పాలస్తీన్, ట్రాన్సుజోర్డను అను చిన్నరాజ్యములు బ్రిటిష్‌వారి మేండేటు రాజ్యములు. సిరియా ఫ్రెంచి వారి మేండేటురాజ్యము. అసాధారణమైన, సాహసోపేతమైన తిరుగు

జా టొకటి ఫ్రెంచివారిపై సిరియాలో జరిగెను. అది కొంతవరకు విజయమందెను. ఈజిప్టులోకూడ తిరుగుబాట్లు జరిగినవి. బ్రిటిష్ వారితో దీర్ఘమగు పోరాటము జరిగినది. ఈజిప్టు స్వతంత్రమైనప్పటి కిని, బ్రిటిష్వారి మద్దతుతో ఒకరాజు అక్కడ పాలించుచున్నప్పటికిని, పోరాట మింకను జరుగుచునేయున్నది. ఉత్తర ఆఫ్రికాకు సుదూరమున పశ్చిమముగా మొరాకోలో, అబ్దెల్ క్రిం నాయకత్వమున స్వాతంత్ర్య సంపాదనకై పోరాటము జరిగెను. స్పానిష్‌వారిని అతడు తరుమగొట్ట గలిగెను. కాని తరువాత ఫ్రెంచివారి యావద్బలమును అతనిని అణచివేసెను.

ఆసియా, ఆఫ్రికాలలో స్వాతంత్ర్యమునకై జరిగిన ఈ పోరాటములను బట్టి నూతన భావములు దేశదేశములకు వ్యాపించి, ప్రాచ్య దేశమందలి స్త్రీ పురుషుల హృదయముల నెట్లు ఒకేమారు పరివర్తనము చేయుచున్నదో విశదముకాగలదు. ప్రపంచప్రాముఖ్యము కారణముగా ఇందు రెండు దేశముల పేర్కొనవలసియున్నది. అవి చీనా, ఇండియాలు. ఈ రెంటిలో ఏయొక్క దేశమందైన ప్రధానమగుమార్పు జరిగినచో ప్రపంచమందలి మహా - రాజ్యపద్ధతి (Great - Power - System) కంతకును దెబ్బతగులును. ప్రపంచరాజకీయములలో బ్రహ్మాండమగు పర్యవసానములు కలుగును. కాబట్టి చీనా, ఇండియాలలో జరుగు పోరాటములు ప్రజలకు సంబంధించిన గృహకల్లోలములు మాత్రమే కావు. చీనా పోరాటమున జయించినచో ఒక బ్రహ్మాండమగు రాజ్యము వెల్వడును. ఇప్పుడున్న బల - సమత్వము (Balance of Power) మారును. సామ్రాజ్యరాజ్యములు చీనాను స్వప్రయోజనార్థము వినియోగించుకొను కార్యము దానంతట అది కట్టుపడును. ఇండియా జయించినచో ప్రబలమగు గొప్పరాజ్యమొకటి పొడచూపును. దానివిబట్టి తప్పని సరిగా బ్రిటిష్ సామ్రాజ్యము అంత మొందును.

గత పది సంవత్సరములలో చీనా అనేక ఒడుదుడుకుల పాలయ్యెను. కూమిన్ టాంగ్‌తో చీనా కమ్యూనిస్టులు చేసికొన్న స్నేహము భగ్నమై పోయెను. నాటినుండియు చీనా, టూచనుల యొక్కయు, అట్టి బందిపోటు దొంగలయొక్కయు వారినిపడి కొల్ల గొట్టబడుచుండెను. చీనాలో అల్లరులు జరుగుచునేయుండవలెనను కోరికగల పరదేశీయులు వీరికి తరుచు సహాయము చేయుచుండిరి. జపాను వారు చీనాపై రెండు సంవత్సరములబట్టి దండెత్తుచునేయుండిరి. అనేక రాష్ట్రములను తమవశము చేసికొనిరి. క్రమముతప్పిన ఈ యుద్ధ మంతను జరుగుచనే యుండెను. ఈ కాలములో చీనాలోని అనేక ప్రదేశములు కమ్యూనిస్టుగా మారెను. అచ్చట ఒక విధమగు సోవియట్ ప్రభుత్వము కలదు.

ఇండియాలో గత పదునాల్గు సంవత్సరములు రద్దీగా నుండెను. శాంతియుతమగు జాతీయత దూకుడుగా పనిచేయుచుండెను. యుద్ధము ముగియగానే పెద్ద సంస్కరణములు జరుగునను ఆశతో ప్రజలుండగా పంజాబులో సైనిక పరిపాలనమువచ్చెను. జలియన్‌వాలా బాగ్‌లో అమానుషహత్యలు జరిగెను. ఇందుకు ప్రజలలో కలిగిన కోప మొక కారణముగా, టర్కీ-కాలీఫేటులయెడల చూపిన ప్రవర్తనమువల్ల ముస్లి ములకు కలిగిన కోప మింకొక కారణముగా 1920–22 సంవత్సర ములలో, గాంధీజీ నాయకత్వమున సహాయనిరాకరణోద్యమము లేవ నెత్తబడెను. నిజమునకు 1920 సంవత్సరము మొదలుకొని భారతీయ జాతీయోద్యమమునకు గాంధీజీ యే ఏకైక నాయకుడై యుండెను. ఇది భారతదేశములో గాంధీయుగము. ఆయన శాంతియుక్తమగు తిరుగు బాటు పద్ధతులు నూతనములు, ఫలప్రదములు. కావ ప్రపంచదృష్టి నాకర్షించెను. కొన్నాళ్లపాటు నెమ్మదిగా కార్యములు నిర్వర్తించుచు, సంసిద్ధపడుచు కాలముగడిపిన పిమ్మట 1930 లో మరల స్వాతంత్ర్య సమరము ప్రారంభమయ్యెను. సంపూర్ణస్వాతంత్ర్యము పరమావధి

యని కాంగ్రెసు సుస్పష్టముగా అంగీకరించెను. నాటినుండియు, తడవ తడవలుగా శాసనోల్లంఘనము, కారాగారములు నిండుట, మున్నగు కార్యము లనేకము జరుగుట నీకు తెలిసిన విషయమే. ఈ కాలములో బ్రిటిష్ వారవలంబించిన రాజనీతి ఎట్టిదనగా - సాధ్యమైనచో కొందరి నాకర్షించుటకు చేసిన చిల్లరసంస్కరణములును, జాతీయోద్యమమును అణచివేయుటకు చేసిన ప్రయత్నమును.

బర్మాలో, 1931 సంవత్సరమున, తిండిలేక బాధపడు కర్షకులు గొప్ప తిరుగుబాటు చేసిరి. మిక్కిలి క్రూరముగా అది అణచివేయబడినది. జావాలోను, డచ్ ఇండీసులోనుకూడ తిరుగుబాటు జరిగెను. సయాం ఒదుదుడుకుగా నుండెను. రాజుయొక్క అధికారములను సంకుచితపరచుటకు కొంతమార్పు జరిగెను. ఫ్రెంచి ఇండోచీనాలో జాతీయత విజృంభించుచుండెను.

ఇట్లు ప్రాచ్యదేశములందంతటను జాతీయత విజృంభించుచుండెను. కొన్నిచోట్ల అది కొద్దిగా కమ్యూనిజంతో కలిసియుండెను. ఈ రెంటికిని సమానత్వ మెందునులేదు - సామ్రాజ్యతత్వద్వేషము తప్ప. తన యూనియన్‌లోనున్న తూర్పుదేశములపట్లగాక బయటనున్న తూర్పుదేశములపట్ల కూడ రష్యా అవలంబించిన ఉదారరాజనీతి కారణముగా దానికి కమ్యూనిస్టు కాని దేశములలోకూడ అనేక స్నేహితులు కలిగిరి.

ఈ కాలమున జరిగిన ఒకగొప్పవిశేషము - స్త్రీల దాస్య విమోచనము. న్యాయశాస్త్రము, సంఘము, ఆచారములు కారణముగా స్త్రీలకు కలిగిన అనేక బంధములనుండి వారు విడుదలయగుట. పాశ్చాత్య దేశములలో ఈ సంస్కరణములు వచ్చుటకు యుద్ధముకారణమయ్యెను. ప్రాచ్యదేశములందు సైతము టర్కీనుండి ఇండియా చీనాలవరకు - స్త్రీలు ప్రబుద్ధులై పనిచేయుచుండిరి. జాతీయ సాంఘిక కార్యములను వారు ధైర్యముతో పూనుకొని పనిచేయుచుండిరి.

మనము నివసించు కాల స్వరూప మిట్టిది. ప్రతిదినము ఏదో యొక మార్పుగాని, విశేషముగాని జరిగినట్లు వార్తలు వచ్చుచున్నవి. జాతులమధ్య సంఘర్షణ జరిగినట్లుగాని, ధనికవర్గ తత్వమునకును సామ్యవాదమునకును వివాదము తటస్థించినట్లుగాని, ప్రజాస్వామికము నకును ఫాసిజంనకును వివాదము వచ్చినట్లుగాని, దారిద్ర్యము పెచ్చు పెరుగుచున్నట్లుగాని వార్తలు వచ్చుచున్నవి. అన్నింటిమీదను నానాటి కిని వృద్ధినందుచున్న యుద్ధచ్ఛాయ ఆవరించియుండెను.

చరిత్రలో ఇది ఉద్రిక్తకాలము. ఈ కాలమున జీవించియుండుట మంచిది. ఈ జీవితము డెహ్రాడూన్ జైలులో ఏకాంతవాసమైనను కావచ్చును.

—

## 157

# రిపబ్లిక్ కొరకు ఐర్లాండు పోరాడుట

ఏప్రిల్ 28, 1933

ఈ మధ్య సంవత్సరములలో జరిగిన ప్రధాన విషయముల గురించి కొంత సవిస్తరముగా విచారింతము. ఐర్లాండుతో ప్రారం భింతును. ప్రపంచచరిత్రదృష్ట్యా, ప్రపంచశక్తులదృష్ట్యా యూరోపుకు పడమరగా, దూరమందున్న ఈ చిన్నదేశ మంతగా ప్రస్తుత మెక్కువ ప్రాధాన్యము వహించదు. కాని ఈ చిన్నదేశము ధైర్యవంత

మైనది. అణచుటకు సాధ్యముకానిది. బ్రిటిష్ సామ్రాజ్యము తన శక్తినంతయు వినియోగించి దీనిని వంచలేకపోయినది. అణచలేక పోయినది.

ఐర్లాండునుగూర్చి నేను వ్రాసిన చివరలేఖలో మహాయుద్ధమునకు మున్ముందు బ్రిటిష్ పార్లమెంటు హోంరూలుబిల్లును అంగీకరించినదని చెప్పియుంటిని. అల్‌స్టర్‌లోని ప్రొటెస్టెంటు నాయకులును, ఇంగ్లాండులోని కాంసర్వేటివ్ పార్టీవారును ఇందుకు తమ అసమ్మతిని చూపిరి. దానిని ప్రతిఘటించుటకు తిరుగుబాటును సిద్ధముచేసిరి. అందుపై దక్షిణ ఐరిష్‌వారు కూడ " జాతీయ స్వచ్ఛంద సైనికులను, " అవసరమైనచో అల్‌స్టర్‌తో పోరాడుటకు, సంసిద్ధము చేసిరి. ఐర్లాండులో అంతఃకలహము వచ్చితీరు నన్నట్లుండెను. అప్పుడే ప్రపంచ యుద్ధము వచ్చెను. అందరి దృష్టులును బెల్జియం, ఉత్తరఫ్రాంసు రణరంగములమీదికి పోయెను. పార్లమెంటులోనున్న ఐరిష్ నాయకులు యుద్ధసహాయము చేయ సమ్మతించిరి. ఇంతలో అల్‌స్టర్‌లోని 'తిరుగుబాటు దారు 'లకు బ్రిటిష్ ప్రభుత్వములో పెద్దఉద్యోగములు ఈయబడెను. ఇందుచే ఐరిష్ ప్రజలకు మరింత అసంతుష్టి కలిగెను.

ఐర్లాండులో అసంతుష్టి ప్రబలెను. ఇంగ్లాండుకు సంబంధించిన యుద్ధములో తాము ఆహుతి కాకూడదని తలంచిరి. ఇంగ్లాండులో వలెనే ఐర్లాండులోకూడ నిర్బంధసైనిక విధానము ప్రవేశబెట్టి, దృఢకాయులగు యువకులందరు సైన్యములో చేరవలెనని బలాత్కారము చేయ దలచినప్పుడు దేశమంతయు క్రోధముతో అసమ్మతిని ప్రకటించెను. అవసరమైనచో పోరాడి ఆ విధానము రాకుండ చేయుట కది సిద్ధపడెను.

1916 ఈస్టరువారములో డబ్లిన్‌లో తిరుగుబాటు జరిగెను. అప్పుడు ఐరిష్ రిపబ్లిక్ ప్రకటింపబడెను. కొద్దిదినములు పోరాటము

జరిగిన పిమ్మట బ్రిటిష్‌వారు దీని నణచివేసిరి. ఈ చిన్నతిరుగుబాటులో పాల్గొన్నందుకు, మార్షల్‌లా (సైనిక పరిపాలనము) పేరుపెట్టి, ధైర్య సాహసములు చూపిన కొందరు ఐరిష్ యువకులు తరువాత కాల్చి వేయబడిరి. ఈ తిరుగుబాటుకు 'ఈస్టర్ తిరుగుబాటు' అని పేరు. ఇది నిజముగా బ్రిటిష్ శక్తి నెదిరించుటకు చేసిన ప్రయత్నమనిపించు కొనదు. ఐర్లాండు రిపబ్లిక్‌ను ఇంకను వాంఛించుచున్నదనియు, బ్రిటిష్ వారి అధికారమునకు తనకు తానై లొంగదనియు లోకమునకు వెల్లడి చేయుటకై చేసిన సాహస చేష్ట. ఈ తిరుగుబాటునకు కారకులైన ధీరులగు యువకులు ఇందుకొరకై ఆత్మార్పణము చేసికొనిరి. ప్రస్తుతము తాము విజయము సాధించలేమని వారికి తెలియును. భావి కాలములో తమత్యాగమునకు ఫల ముండుననియు, స్వాతంత్ర్యము చిక్కుననియు వా రాశించిరి.

ఈ తిరుగుబాటు జరిగినకాలమున, జర్మనీనుండి ఐర్లాండుకు ఆయుధములు తెచ్చుటకు ప్రయత్నము చేయుచుండగా ఒక ఐరిష్ వానివి బ్రిటిష్‌వారు పట్టుకొనిరి. ఇతని పేరు సర్ రోజర్ కేస్‌మెంట్. ఇతడు చిరకాలము బ్రిటిష్ కాన్సులార్ ఉద్యోగములో నున్నవాడు. లండనులో కేస్‌మెంటును విచారణచేసిరి. మరణదండన విధించిరి. కోర్టులో, ఖైదీల బోనులో నిలుచుండి అత దొక వాఙ్మూలము చదివెను. అది ఉద్రేకపూరితమై యుండెను. ఐరిష్ ప్రజల ప్రబలదేశభక్తి నది వెల్లడించెను.

తిరుగుబాటు విఫలమయ్యెను. గాని ఆ వైఫల్యమందే దానికి జయము చిక్కెను. దీని తరువాత బ్రిటిష్ వారు నడపిన హింసాకాండ, ముఖ్యముగా యువకనాయకులను కాల్చిచంపుట, ఐరిష్‌ప్రజల మనస్సులలో హత్తుకొనెను. పైకి చూచుటకు ఐర్లాండు శాంతముగానే కని పించెను. కాని అంతర్గతముగా క్రోధము రగులుచునే యుండును. త్వరలో నిది సీన్‌ఫీన్ రూపమున బహిర్గతమయ్యెను. సీన్‌ఫీన్‌భావములు

శీఘ్రముగా వ్యాపించెను. ఐర్లాండును గూర్చి వ్రాసిన కడపటి జాబులో సీన్‌ఫీన్‌నుగూర్చి చెప్పియుంటిని. ప్రారంభమున దానికి ప్రోత్సాహము లేకుండెను. ఇప్పు డది దావాగ్నివలె వ్యాపించెను.

యుద్ధము ముగియగానే లండనులో పార్లమెంటుకై బ్రిటిష్ దీవు లందంతట ఎన్నికలు జరిగెను. ఐర్లాండులో సీన్‌ఫీనరులు అత్యధిక స్థానములను వశముచేసుకొనిరి. బ్రిటిష్ వారితో కొంత సహకరించ వలె నని చెప్పు జాతీయ వాదుల నోడించిరి. పార్లమెంటు సభలకు హాజరగుటకైన సీన్‌ఫేనరులు లండను పార్లమెంటుకు హాజరుకాకుండ నిలిచిపోయిరి. దానికిబదులు డబ్లిన్‌లో 1919 సంవత్సరమున తమ సొంత రిపబ్లికన్ సభను స్థాపించిరి. ఐరిష్‌రిపబ్లికును ప్రకటించిరి. తమసభకు డాలీ ఏయ్‌రన్ అని పేరు పెట్టుకొనిరి. ఈసభ అల్‌స్టర్‌సహా ఐర్లాండు కంతకును అని వానిభావన. కాని అల్‌స్టర్‌వారు అందు ప్రవేశించ లేదు. కాతలిక్ ఐర్లాండుపై వారికి అభిమానము లేదు. డాలీ ఏయిరన్ తన అధ్యక్షుడుగా డివెలరాను ఎన్నుకొనెను. గ్రిఫిత్తును ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొనెను. క్రొత్త రిపబ్లిక్ యొక్క ఈ అధ్యక్షులిరువురును అప్పుడు బ్రిటిష్ చెరసాలలో ఉండుట తటస్థించినది.

అప్పుడు ప్రారంభమైనది అసాధారణ యుద్ధములలో నొక్కటి. దీని కిదేసాటి. ఇదివరలో ఐర్లాండు ఇంగ్లాండులమధ్య జరిగిన పోరాటములు దీని కెందునపోలవు. స్త్రీ పురుషులు బహు కొద్దిమంది, తమ ప్రజల సానుభూతితో విపరీత మగు శత్రుబలముతో పోరాడిరి. క్రమబద్ధమైన మహాసామ్రాజ్యము వారి కెదురొడ్డి నిలిచెను. సీన్ ఫేనరుల పోరాటము, హింసాయుతమగు సహాయనిరాకరణము. ఇంగ్లీషు సంస్థలను బహిష్కరించమని వారు బోధించిరి. సామాన్య లా - కోర్టులకు బదులు రాజీనామాలుచేయు కోర్టులవంటి సొంతసంస్థలను సాధ్యమైనప్పుడెల్ల వారు నెలకొల్పిరి. పల్లెలలో నిలుపబడిన పోలీసు స్థానములపై వారు గెరిల్లా యుద్ధమును సాగించిరి. జైళ్లలో నిరాహారదీక్ష నవలంబించి

సీన్‌ఫేన్ ఖైదీలు బ్రిటిష్ ప్రభుత్వమును కష్టముల పాలుచేసిరి. ప్రసిద్ధిచెందిన నిరాహారదీక్ష కార్డు మేయరైన టెరెంన్సు మాక్‌స్వీనీ పూనిన దీక్ష. ఐర్లాండు ప్రజల గుండెలు ఝల్లుమనునట్లు చేసినది. చెర సాలలో పెట్టినప్పుడు అతడన్నమాట — "ప్రాణములతోనో, చచ్చియో నేను జైలునుండి బయటకు వత్తును." అని చెప్పి అతడు ఆహారమును విసర్జించెను. 75 దినములు ఉపవాసముచేసిన తరువాత అతడు అసువుల బాసెను: అతని మృత శరీరము జైలునుండి బయటకు తేబడెను.

సీన్‌ఫీన్ తిరుగుబాటును క్రమబద్ధము చేసిన పురుషులలో పేరొక్కనదగ్గవాడు మైకేల్ కొలిన్సు. సీన్‌ఫేన్‌ల ఎత్తుగడలకు ఐర్లాండులో బ్రిటిష్ ప్రభుత్వము స్తంభించి పోయెను. కొన్ని జిల్లాలలో దానిస్వరూపమే మాసిపోయెను. క్రమక్రమముగా ఉభయ పక్షములందును హింసాపద్ధతులు ముదిరెను. తరుచు ప్రతీకారములు జరుగు చుండెను. ఐర్లాండులో పనిచేయుటకు ప్రత్యేక బ్రిటిష్ సైన్యము నియమింప బడెను. దానికి హెచ్చు జీతము లిచ్చిరి. యుద్ధసైన్య ములనుండి విడుదలయైన వారిలో తెగించిన సాహసులు, క్రూరులు ఇందుండిరి. ఈసైన్యమునకు "బ్లాక్ అండ్ టాన్సు" అను పేరు వచ్చినది. వారి దుస్తుల రంగును బట్టి వారి కాపేరు వచ్చినది. ఈ బ్లాక్ అండ్ టానులు నిర్దాక్షిణ్యముగా హత్యలు చేసి కొనుచు పోయిరి. ప్రక్కలపై పరుండి నిద్రబోవుచున్న వారిని తరుచు కాల్చిచంపుచుండిరి. ఇట్లుచేసిన సీన్‌ఫీనరులు భీతావహులై తమకు లొంగుదురని ఆశించిరి. కాని సీన్ ఫీనరులు లొంగుటకు నిరాకరించిరి. తమ గెరిల్లా యుద్ధమును సాగించిరి. అందుమీద బ్లాక్ అండ్ టానులు పల్లెలను, పట్టణములలో పెద్ద భాగములను తగుల బెట్టుచు క్రూరముగ ప్రతీకార కార్యముల చేసిరి. ఐర్లాండంతయు పెద్దరణభూమి అయ్యెను. ఒకరిని మించి ఒకరు, ఉభయ పక్షములును, హింసలను సాగించిరి. వినాశము

నిండియుండిరి. ఈ అంతఃకలహమును, ఈ అన్యోన్యద్వేషమును, స్వాతంత్ర్యమునకై ధైర్యముగా ఐర్లాండు చేసిన పోరాటమునకు ఘోర ఫలములు. ఇంగ్లీషు ఆయుధములు చేయలేని పని ఇంగ్లీషురాజనీతి చేసి విజయమునందినది. ఐరిష్ పౌరుడు ఐరిష్ పౌరునితో పోరాడు చుండెను. ఇంగ్లాండు కొంతవరకు చల్లగా ఒకపక్షమునకు సహాయము చేసి చూచుచుండెను. తటస్థించిన క్రొత్తపరిస్థితులచూచి అది సంతుష్టి చెందెను.

అంతఃకలహము క్రమముగా అంతరించెను. కాని రిపబ్లిక్ పక్షమువారుమాత్రము ఫ్రీస్టేటును అంగీకరింపరైరి. ఫ్రీస్టేటు పార్లమెంటైన డైల్‌కు ఎన్నుకోబడిన రిపబ్లికనులు సైతము, రాజభక్తి ప్రమాణమును తీసికో నిరాకరించి, సభలకు వెళ్లుట మానుకొనిరి. ఇట్లు డీవెలీరాయును, అతని పక్షమువారును డైల్‌కు హాజరగుటలేదు. ఫ్రీస్టేటు పక్షము వారు, ఫ్రీస్టేటు అధ్యక్షుడగు కాస్‌గ్రేవ్ నాయకత్వమున అనేకవిధములుగా రిపబ్లికనులను అణచివేయ ప్రయత్నించిరి.

ఐరిష్ ఫ్రీస్టేటు స్థాపనను పురస్కరించుకొని, బ్రిటన్‌యొక్క సామ్రాజ్యరాజకీయములలో అనేక ఫలితములు కలిగెను. ఐరిష్ సంధి ననుసరించి ఐర్లాండుకు ప్రాప్తించిన స్వాతంత్ర్యము, అప్పుడు ఇతర అధినివేశములకు చట్టప్రకారము ఉన్న స్వాతంత్ర్యముకన్న అధికముగా నుండెను. ఐర్లాండుకీ స్వాతంత్ర్యము వచ్చుటతోడనే ఇతర అధినివేశములున్ను అట్టి స్వాతంత్ర్యమును పుచ్చుకొనిరి. అధినివేశ ప్రతిపత్తి అనుభావము అప్పుడు మార్పుచెందెను. ఇంగ్లాండుకును, అధినివేశములకును జరిగిన సామ్రాజ్యసమావేశములలో అధినివేశములకు అధిక స్వాతంత్ర్యము ఇచ్చుట ద్వారా మరికొన్ని మార్పులు కలిగెను. ప్రబలమగు రిపబ్లికన్ ఉద్యమము పనిచేయుచున్న ఐర్లాండు, సంపూర్ణస్వాతంత్ర్యము కావలెనని నిరంతరము కోరుచుండెను. బోయర్ సంఖ్య అధికముగా గల దక్షిణ ఆఫ్రికాయును పూర్ణస్వాతంత్ర్యము కోరు

చుండెను. ఈ విధముగా అధినివేశములస్థితి మారుచు, వృద్ధినందుచు, పోవుచుండెను. చివరకు బ్రిటిష్ కామన్‌వెల్తులో అధినివేశములు ఇంగ్లాండుయొక్క సోదర - జాతులని అంగీకరింపబడెను. ఇది వినుట కింపుగానే ఉండెను. సమానరాజకీయ ప్రతిపత్తి నందుటకు క్రమ వృద్ధిని సూచించుచున్నదనుటకు సందేహములేదు. కాని ఇందలి సమానత్వము మాటలలోనే. క్రియలో కాదు. ఆర్థికముగా అధినివేశ ములు బ్రిటనుకును, బ్రిటిష్ పెట్టుబడికిని ముడిపడియుండెను. అనేక విధములుగా ఆర్థికపు ఒత్తిడి వానిపైకి ఇంగ్లాండు తీసికొని రావచ్చును. అదియును గాక అధినివేశములు వృద్ధియైనకొద్దీ వారి ఆర్థిక ప్రయోజనములకును, ఇంగ్లాండు ఆర్థిక ప్రయోజనములకును సంఘర్షణ సంభవించవచ్చును. ఇట్లు సామ్రాజ్యము క్రమముగా బలహీనమగును. సామ్రాజ్యము శిథిలము కాగలదను భయముతోనే ఇంగ్లాండు బంధముల సడలించి అధినివేశములతో రాజకీయ సమానత్వ మునకు అంగీకరించెను. వివేకముతో, సకాలమున, ఇట్లు పనిచేసి ఇంగ్లాండు ఎంతో ఆత్మరక్షణ చేసికొనెను. కాని ఇదిచిరకాలము నిలుచు నది కాదు. అధినివేశములను ఇంగ్లాండునుండి వేరుపరచు శక్తులు పని చేయుచునే ఉండెను. అవి ముఖ్యముగా ఆర్థికశక్తులు. ఈ శక్తులు నిరంతరము సామ్రాజ్యమును బలహీనముచేయ ప్రయత్నించుచుండును. ఈ కారణమువల్లను, ఇంగ్లాండు నిస్సందేహముగా కృశించుచుండుట వల్లను బ్రిటిష్ సామ్రాజ్యము క్రమముగా అంతరించుచున్నదని నేను నీకు వ్రాసియుంటిని. సమానసంప్రదాయములు, సమాన సంస్కృతి, జాతిబంధము గల అధినివేశములే చిరకాలముపాటు, ఇంగ్లాండుతో ముడి పెట్టుకొనిఉండుట కష్టమైనప్పుడు, ఇండియా ఇంగ్లాండుతో ముడిపెట్టుకొని యుండుట అంతకన్న కష్టముకాదా? ఏలయన, ఇండియా ఆర్థిక ప్రయోజనములకును బ్రిటిష్ వారి ఆర్థిక ప్రయోజనములకును సంఘర్షణ తప్పదు. ఒకటి రెండవదానికి తలవంచి తీరవలెను. కాన

స్వతంత్రభారతదేశము ఇట్టి సంబంధమును ఇంగ్లాండుతో పెట్టుకో నేరదు. తన ఆర్థికనీతి బ్రిటన్ ఆర్థికనీతికి తలయొగ్గియుండ సహించదు.

బ్రిటిష్ కామన్‌వెల్తు అనగా స్వతంత్ర అధినివేశములు. పరాధీనమగు పేద ఇండియా కాదు. రాజకీయముగా స్వతంత్రమైన ఈ భాగముల సముదాయమే కామన్‌వెల్తు. కాని ఈ భాగములన్నియు ఇంకను బ్రిటన్ ఆర్థిక సామ్రాజ్యము క్రిందనే ఉన్నవి. ఐరిష్ సంధి అభిప్రాయ మేమన — బ్రిటిష్ పెట్టుబడిదారులచే కొంతవరకు స్వప్రయోజనార్థము ఐర్లాండును వినియోగించుకొనుచు నుండుటయే. రిపబ్లిక్ కావలెనని ఐర్లాండు ఆందోళనచేయుట కిదియే ప్రధానకారణము. డీవెలీరాయును, రిపబ్లికనులును, బీదకర్షకుల యొక్కయు, తగ్గుమధ్యతరగతులయొక్కయు, బీదవిద్యావంతులయొక్కయు ప్రతినిధులు. కాప్‌గ్రేవును, ఫ్రీస్టేటు వారును భాగ్యవంతులగు మధ్యతరగతులవారికిని, భాగ్యవంతులగు కర్షకులకును ప్రతినిధులు. ఈ రెండు తరగతుల వారును బ్రిటిష్ వ్యాపారముపై ఇష్టము కలవారు. బ్రిటిష్ పెట్టుబడిదారులకు వీరన్న ఇష్టము.

కొంతకాలమైన పిమ్మట డీవెలీరా తనఎత్తుగడలను మార్చెను. అతడును, అతని పక్షమువారును డైల్‌ఎయిరన్‌లో ప్రవేశించిరి. రాజభక్తి ప్రమాణమునుచేసిరి. మాటవరస కట్లు చేయుచున్నామని చెప్పుచు తమకు అధిక సంఖ్యాక బలము చేకూరుట తోడనే ఈప్రమాణమును రద్దుచేయుదుమనియు ప్రకటించిరి. తరువాత జరిగిన ఎన్నికలో, 1932 తొలిభాగమున, ఫ్రీస్టేటు పార్లమెంటుకు అధిక సంఖ్యాకబల మతనికి వచ్చెను. తోడనే తనకార్య క్రమము నతడు అమలులోపెట్ట ప్రారంభించెను. రిపబ్లిక్‌కై పోరాటము ఇంకను జరుగుచునే యుండ వలెను. కాని పద్ధతులు మారవలెను. డీవెలీరా రాజభక్తి ప్రమాణమును రద్దుచేయ ప్రతిపాదించెను. మరియు, ఏటేట చెల్లించు వార్షికములను (Land

annuities) చెల్లించనని బ్రిటిష్ ప్రభుత్వమునకు అతడు తెలియబరచెను. ఈ వార్షికము లెట్టివో వెనుక నీకు వ్రాసియుంటిని. ఐర్లాండులో పెద్దభూస్వాములనుండి భూమి తీసికొని వారికి ఉచిత విధముగా పరిహారము చెల్లించబడినది. ఈభూమిని తీసికొన్న కర్షకులనుండి సాలుసాలుకు కొంతధనము వసూలు చేయబడుచుండెను. ఒక తరముదాటి ఈప్రక్రియ జరుగుచుండెను. అది ఇంకను జరుగుచుండెను. ఇకముందు ఎంతమాత్రము ధనము చెల్లించమని డీవెలీరా చెప్పెను.

వెంటనే ఇంగ్లాండులో గోలపుట్టెను. బ్రిటిష్ ప్రభుత్వముతో విరోధము కలిగెను. రాజభక్తి ప్రమాణమును డీవెలీరా రద్దుచేయుట 1921 లో జరిగిన ఐరిష్ సంధిని భగ్నముచేయుటయే యని మొట్టమొదట వారుచెప్పి, తమ అసమ్మతిని సూచించిరి. అధినివేశములు సోదర-జాతులనియు, ప్రతిఅధినివేశమును తనరాజ్యాంగమును మార్చుకోవచ్చుననియు ప్రకటింప బడినదికదా ! ఇంగ్లాండును, ఐర్లాండును సోదర జాతులే అయినట్లయితే ఇంగ్లాండు రాజ్యాంగమునుండి రాజభక్తి ప్రమాణమును తీసివేయవచ్చునని డీవెలీరా చెప్పెను. 1921 లో జరిగిన సంధి నెత్తుకో వలసిన పనిలేదనెను. ఐర్లాండుకు అహక్కు లేనిచో అంతవరకును అది ఇంగ్లాండుపై ఆధారపడియున్నట్లేనని చెప్పెను.

ఇక రెండవ విషయము. వార్షికములను చెల్లించుట అపుచేయగానే బ్రిటిష్ ప్రభుత్వము తన అసమ్మతి నింకను తీవ్రముగా ప్రకటించెను. ఇదివరలో చేసికొన్న ఒప్పందమునకు ఇది భంగకరమనెను. డివెలీరా ఇది కాదనెను. న్యాయశాస్త్రరీత్యా వాదించెను. ఆ వాదము మనమిప్పుడు ఎత్తుకోవద్దు. వార్షికముల చెల్లించు తరుణము వచ్చెను. అవి చెల్లింపబడలేదు. ఇంగ్లాండు ఐర్లాండుపై క్రొత్తయుద్ధము ప్రారంభించెను. ఇది ఆర్థికయుద్ధము. ఐరిష్‌కర్షకుడు పండించినపంట ఇంగ్లాండుకు వచ్చుచుండెను. అకర్షకుని పాడుచేయ వలెనను ఊహతో వ్యాపారసుంకము అధికముగా ఐరిష్ పదార్థములపై ఇంగ్లాండు విధించెను. ఈవిధముగా

చేసిన ఐరిష్ ప్రభుత్వము కాళ్లబేరమునకు వచ్చునని తలచెను. మామూలు ప్రకారము, ఇంగ్లాండు, ప్రతిపక్షిని లొంగదీయుటకు దండము ప్రయోగింప ప్రారంభించెను. కాని వెనుకటివలె ఇప్పుడా పద్ధతులు ప్రయోజనకరముగా లేవు. ఇంగ్లాండునుండి ఐర్లాండుకు పోవు బ్రిటిష్ వస్తువులపై ఐరిష్ ప్రభుత్వము సుంకములు విధించి ప్రతీకారము చేసెను. ఈ ఆర్థిక యుద్ధమువల్ల రెండు దేశములలోని కర్షకులకును,పరిశ్రమలకును పెద్దనష్టము కలిగెను. జాతీయతకు,ప్రతిష్టకు భంగము కలుగునన్న కారణమున ఎవరును రాజీకి దిగలేదు.

1933 తొలిభాగమున ఇంగ్లాండులో మరల ఎన్నికలు జరిగెను. వెనుకటికన్నకూడ ఎక్కువ వోట్లతో డీవెలీరా విజయము కాంచెను. ఇది బ్రిటిష్ ప్రభుత్వమునకు కంటకముగా నుండెను. దీనిని బట్టిచూడ ఐర్లాండును ఆర్థికముగా లొంగదీయ వలెనని ప్రయోగించిన బ్రిటిష్ రాజనీతి నిష్ఫలమైనట్లు స్పష్టమైనది. వింతవిశేషమేమనగా,అప్పులు చెల్లించలేదను కారణమున ఐరిష్ వారిని దుర్మార్గులని బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించుచుండెను. కాని అమెరికాకు తాము చెల్లించవలసిన అప్పులను చెల్లించుటకు అది ఇష్టపడుటలేదు.

ఇప్పుడు డీ వెలీరా ఐరిష్ ప్రభుత్వమునకు పెద్ద. తన దేశము నతడు క్రమక్రమముగా రిపబ్లిక్కును చేయ పాటుపడుచుండెను. రాజభక్తి ప్రమాణ మప్పుడే పోయినది. వార్షికములు చెల్లించుట పూర్తిగా అపుదలచేయబడెను. ప్రాతగవర్నర్ జనరల్‌కూడ పోయెను, అతని స్థానే తన పక్షమువాని నొకనిని డీ వెలీరా నియమించెను. కాని ఈ ఉద్యోగమున కిప్పుడు ప్రాధాన్యములేదు. రిపబ్లికు కొరకు పోరాటము జరుగుచునేయున్నది.కాని పద్ధతులు వేరు. శతాబ్దులతరబడి జరుగుచున్న ఆంగ్ల ఐరిష్ పోరాటమింకను జరుగుచునేయున్నది. నేడది ఆర్థిక యుద్ధస్వరూపమును ధరించినది.

త్వరలో ఐర్లాండు రిపబ్లికుగా మారవచ్చును. కాని ఒక పెద్ద

ప్రతిబంధకమున్నది. డీవెలీరాయును, అతని పక్షమువారును కోరునది ఐక్యమైన ఐర్లాండు; ఒక రిపబ్లికు, ద్వీపమునకంతకును, అల్‌స్టరు సహా, ఒక కేంద్రప్రభుత్వము. రెండు భాగములుగా చీల్చుటకు ఐర్లాండు బహూచిన్నదేశము. అల్‌స్టరును మిగత ఐర్లాండులో కలుపుట ఎట్లో డీవెలీరా పరిష్కరించవలసిన పెద్దసమస్య. బలవంతముగా నట్లు చేయుటకు వీలుకాదు. 1914 లో బ్రిటిష్ ప్రభుత్వము ప్రయత్నించెను. కాని అది తిరుగుబాటులోనికి దిగబోయెను. ఫ్రీస్టేటు అల్‌స్టరును నిర్బంధించలేదు కదా, అట్లుచేయ నది సంకల్పించనూ లేదు. అల్‌స్టర్ సద్భావమును సంపాదించి ఐర్లాండును ఐక్యముచేయ వచ్చునని డీ వెలీరా ఆశించుచున్నాడు. ఈ ఆశ మంచిదే కావచ్చును. కాని ప్రొటెస్టెంటు అల్‌స్టరుకు, కాతలిక్కు ఐర్లాండుపై గల అవిశ్వాసమింకను అట్లేయున్నది.

నోటు (1938):—ఉభయదేశముల మధ్య జరుగుచున్న ఆర్థిక యుద్ధము కొంతకాలము జరిగిన పిమ్మట ఉభయ ప్రభుత్వములును ఒక ఒప్పందమునకు వచ్చిన కారణమున నది అంతమొందెను. ఈ ఒప్పందములో వార్షిక సమస్యయు, ఇతర ఆర్థిక విషయములును పరిష్కరింపబడినవి. ఇది ఫ్రీస్టేటుకు మిక్కిలి లాభకరముగా నుండెను. డీ వెలీరా రిపబ్లికు సిద్ధికై మరికొన్ని సాధనముల నుపయోగించెను. బ్రిటిష్ ప్రభుత్వముతోను, రాజుతోను ఉన్న కొన్ని సంబంధములను విడగొట్టెను. ఐర్లాండుకు ఇప్పటిపేరు 'ఐయిర్.' 'ఐయిర్' పరిష్కరించవలసిన ప్రధాన సమస్య ఐక్యదేశము. ఇందు అల్‌స్టరుకూడ కలిసియుండును. కాని అల్‌స్టరింకను ఇష్టపడుట లేదు.

సమాప్తి.

# సంస్కృతి ప్రచురణలు

10. సోవియట్ల దేశం (శశి) ... ... రూ. 0-10-0
11. నేటిచైనా (పింగళి పరశురామయ్య) ... రూ. 0-10-0
26. మహమ్మదీయరాజ్యాలలో జాతీయవికాసం (కాళీపట్నం కొండయ్య) ... ... రూ. 1- 8-0
33. వసంతము (బద్దెపూడి రాధాకృష్ణమూర్తి) ... రూ. 1- 0-0
40. నా చిన్నప్పుడు (గాంధీజీ) ... ... రూ. 1- 0-0
41. వీరస్వర్గము (ప్రతాప రామకోటయ్య) ... రూ. 0- 8-0
43. ప్రపంచ చరిత్ర (ఐ. భా.) (నెహ్రూ) ... రూ. 2- 0-0
44. తెనుగు-ఇంగ్లీషు నిఘంటువు (విలియం బ్రౌన్) రూ. 5- 0-0
45. ప్రపంచ చరిత్ర (ఆ. భా.) (నెహ్రూ) ... రూ. 2- 0-0
46. జెన్‌సింగ్ నార్కే (చింతలపూడి శేషగిరి రావు) రూ. 0-15-0
47. భారత కథలు (దువ్వూరి లక్ష్మీభాస్కరుడు) రూ. 0-15-0
48. మన వారసత్వము (కొటూరి వెంకటేశ్వరరావు) రూ. 1 - 8-0
49. ఇందిరాదేవి (బులుసు వేంకట రమణయ్య) రూ. 0-15-0
50. కమ్యూనిస్టు పార్టీ: ప్రచారం-పరమార్థం (మధు లిమాయె) 1- 8-0
51. కమ్యూనిస్టుల ప్రజాసేవ? (శశి-కాంత్) .. రూ. 0- 4-0
53. ప్రగతి (ఆంధ్ర ప్రభ నుంచి) ... రూ. 0- 4-0
54. భారత కమ్యూనిస్టులు (రాజాజీ) ... రూ. 0- 4-0

# అపూర్వ గ్రంథములు

1. రతిరహస్యము (ముష్టిపల్లి సోమభూపాలుడు)
2. తెనుగు-ఇంగ్లీషు నిఘంటువు (విలియం బ్రౌన్)

## CULTURAL BOOKS

5. The Indian Communists (Rajaji) 0-6-0

# కల్చరల్ బుక్స్ లిమిటెడ్

31, బీరాన్ సాహెబ్ వీధి,

మౌంటు రోడ్డు :: మద్రాసు - 2

సంస్కృతి ప్రచురణలు
పిల్లల పుస్తకాలు
అపూర్వ గ్రంథములు

ప్రకాశకులు:
కల్చరల్ బుక్స్ (ప్రైవేట్) లిమిటెడ్
31, మీరాన్ సాహెబ్ వీధి,
మౌంటు రోడ్డు :: మద్రాసు - 2